శ్రీః
శ్రీరామచన్ద్రాయనమః

# మైరావణచరిత్రము

మాడయ్యకవి విరచితము.

పరిష్కరణము : పీఠిక : టిప్పణి

*'సహజ పాండిత్య' 'తర్కకోవిద' 'విద్యావిభూషణ' 'తత్త్వశాస్త్రపారంగత'*

**గరిమెళ్ళ అచ్యుత సత్యశేషగిరి సోమయాజులుశర్మ**

M.A.(సంస్కృతము), M.A.(తెలుగు), M.A.(దర్శనములు)

పుష్పగిరి మహాసంస్థాన పండితులు

ప్రకాశకులు

**రావి కృష్ణకుమారీ – మోహనరావు దంపతులు**

చీరాల



శ్రీః
శ్రీరామచన్ద్రాయనమః

## మైరావణ చరిత్రము

మాడయ్యకవి విరచితము

పరిష్కరణము: పీఠిక: టిప్పణి

**గరిమెళ్ళ సోమయాజులుశర్మ**

ప్రథమ ముద్రణ: హనుమత్ జయంతి **3, జూన్ 2013**

ప్రతులు : **500**

పేజీలు : **164**

వెల రూ. : **80.00**



D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# పీఠిక

ఓం

**శ్రీరామచన్ద్రాయ నమః**

## మాడయ్య కవి (1460 - 1520)

ఈ మైరావణచరిత్రమును రచించిన కవి మాడయ్య. ఈ కవి పేరు 'మారయ్య' యని కవులచరిత్రలో శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు; 'మాడయ్య' యని శబ్దరత్నాకరములో శ్రీబహుజనపల్లి చిన సీతారామాచార్యులు గారు వ్యవహరించిరి.

తే॥గీ॥ ప్రోడ వన్నింట సర్వయ మాడ సుకవి (మైరా -1-18) అని కవి ప్రాసయతిలో వాడుటను బట్టి కవి పేరు 'మాడయ్య' యని శ్రీవేంకటరామకృష్ణకవులు నిర్ధారించిరి. చాగంటి శేషయ్య గారు, బులుసు వేంకట రమణయ్య గారు, ఆరుద్రగారు దీనినే యామోదించిరి. గ్రంథాంతగద్యములలో మాడయ్య పేరే కలదు. సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'మాడయ్య' యనియే కలదు.

### వంశము

మాడయ్య కవి తండ్రి సర్వయ. తల్లి రాచమాంబ. అన్న మల్లన. ఇతఁడు నిత్యము రామాయణము పారాయణము చేయు నియమము గలవాఁడు.

కం॥ నీ తండ్రి సర్వధీమణి
నీ తల్లి దయావిశుద్ధ నియమాదరణ
ఖ్యాతిని భూదేవికి నెన
యాతతమతి యైన రాచమాంబ ధరిత్రిన్





కం॥ నీ యగ్రజుండు దక్షిణ
రాయనృపప్రవిమలాబ్ధిరమణీయుఁడు రా
మాయణపఠనవ్రత ని
త్యాయతఘనయశుఁడు మల్లనార్యుఁడు పేర్మిన్. (మైరా -1-20, 21)

అను పద్యములలో నీ విషయములు స్పష్టముగాఁ గలవు.

### నివాసము - గురువు

ఈ కవి 'గుడివాడ' లోని శ్రీ భీమేశ్వరస్వామి భక్తుఁడు. కాఁబట్టి యితని నివాసము కృష్ణామండలము లోని 'గుడివాడ' గాని తత్పరిపరిసర ప్రాంతము గాని యైయుండును. ఇవటూరి మల్లికార్జునుఁడు విద్యాగురువు.

చ॥ వలనుగ నాత్మలోన గుడివాడ పురాధిపు భీమలింగనిం
దలఁచి కరంబు లెత్తి ప్రమదంబున మ్రొక్కి నుతించి భక్తిని
శ్చలమతి నివ్వటూరి పురశాసను మద్గురు మల్లికార్జునున్
గొలిచి తదాజ్ఞచేఁ బ్రకటకోమలకావ్యకళావినోదినై.

(మై -1-29) అని యవతారికాపద్యము.

'ఇది శ్రీ భీమేశ్వర వరప్రసాద కవితాధురీణ సకలశాస్త్ర ప్రవీణ' అని యాశ్వాసాంతగద్యము.

### కృతి భర్త

ఈ మైరావణ చరిత్రము నంకితమును గొన్న పుణ్యాత్ముఁడు లేజర్ల గోపామాత్యుఁడు. తల్లి యబ్బమాంబ. తండ్రి యబ్బయామాత్యుఁడు. భార్య రామాంబిక. వీరు శ్రీవత్సగోత్రులు.

కం॥ శ్రీవత్స గోత్రమణికిని (1-35)
కం॥ రామాంబికామనోహర (1-163)
కం॥ శ్రీవత్సగోత్రజలనిధి జైవాతృక (2-167)
మా॥ అబ్బమాంబాకుమారా (2-168)
కం॥ లేజర్ల యబ్బధీమణిగోపా (3-1)
మా॥ అబ్బయామాత్యపుత్రా (3-205) అని షష్ఠ్యంత - ఆశ్వాసాద్యంత పద్యములీ విషయములను దెల్పుచున్నవి.

కృతిపతి వలెనే మాడయ్య కూడ శ్రీవత్సగోత్రుఁ డని, యమాత్యశబ్దముచే నియోగిబ్రాహ్మణుఁ డని యీ క్రింది పద్యమును బట్టి తెలియుచున్నది.

ఆ.వె॥ ధాత్రి లోన మనకు గోత్రంబు శాఖయు
నొక్క టగుట మంచి యోగ్య మయ్యెఁ
గానఁ జెప్పుఁ దంద్రకవిత మైరావణ
చరిత మొప్ప నాకు జయకరముగ (1-27)

మీరు సెప్పితి రెలమిన్ (1-26); చెప్పుఁ దంద్ర కవిత (1-27) అను బహువచన ప్రయోగములను బట్టి కృతిభర్త యగు గోపమంత్రి కంటెఁ గృతికర్త యగు మాడయ్య వయస్సులోఁ గొంచెము పెద్దవాఁ డని తోఁచుచున్నది.

మాడయ్యకవి యింటి పేరు తెలియదు. కృతిపతి యగు గోపామాత్యుని యింటి పేరు 'లేజర్ల' వా రని పెక్కు పద్యములలోఁ గలదు.

తే॥గీ॥ ఐన శ్రీలక్ష్మి లేజర్ల యబ్బమంత్రి (1-4)

తే॥గీ॥ గురుతరోదారి లేజర్ల గోపశౌరి (1-15)

కం॥ రాజితలేజర్ల మంత్రి రత్నంబునకున్ (1-36)

కం॥ లేజర్ల యప్పసచివుని గోపా (2-1)

కం॥ లేజర్ల యబ్బధీమణి గోపా (3-1)

'వెంజెర్ల గోపమంత్రి' యని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు (చాటు - 2 భా -278పుట) పేర్కొనినారు. వారు చూచిన తాళపత్త్రప్రతిలో నట్లున్నదేమో!

కాండవ వంశము వా రని కొన్నిపద్యములలోఁ గలదు.

చ॥ కాండవవంశవర్ధనా (1-162)

చ॥ కాండవకులకంజభాస్కర (2-166)

"మొదట 'కాండవ' యను గృహనామము గలవారై పిమ్మట 'లేజర్ల' యను గ్రామనివాసు లగుటచే లేజర్ల వారైరేమో"! (ఆ.క.త- (భా -237పుట.) అని చాగంటివా రనుమానించినారు.

"ఇతని బావమరిది కాండవ వంశంలోని లేజర్ల అబ్బయ్యగారి గోపమంత్రి" (స.ఆం.సా - 7సం -31పుట) అని యారుద్ర గారు చెప్పినారు.



## ఇతర కృతులు

మాడయ్య మైరావణచరిత్రమునే కాక 'దేవేంద్రవిజయు' మను ద్విపదకావ్యమును రచించి గోపమంత్రి వియ్యంకుఁడైన యెఱ్ఱమంత్రి కంకిత మిచ్చినాఁడు.

కం॥ నా వియ్య మైన కాస
క్ష్మావినుతుని సుతున కెఱ్ఱమంత్రీంద్రునకున్
దేవేంద్రవిజయ మను కథ
శ్రీ వెలయఁగ ద్విపద మీరు సెప్పితి రెలమిన్ (1-26)

ఈ ద్విపద దేవేంద్రవిజయము నేఁడు లభింపదు.

## దేశాటనము - కాలము

శ్రీనాథమహాకవి వలెనే మాడయ్య కూడ నాంధ్రదేశము నాలుగు చెఱఁగులఁ బర్యటించి వివిధ రాజాస్థానములలో ననేక కవుల నోడించి యాయా రాజులచే ననేకసత్కారము లందినవాఁడు.

సీ॥ మెప్పించినాఁడవు మెఱవడిఁ గర్ణాట
నరనాయకుని వీరనారసింహు
దట్టించినాఁడవు తస్కరకవిరాజుఁ
గోటసింగనమంత్రి కొలువు లోనఁ
గాంచినాఁడవు కనత్కాంచనాభరణంబు
లేపార నందాపురీశు చేత
నందినాఁడవు నుత్తమాశ్వద్వయంబును
గిమిడె భూమండలరమణు చేత

తే॥గీ॥ నవమతిస్ఫూర్తిఁ గ్రోడించినాఁడ వఖిల
కావ్యలక్షణలక్ష్యసాగరము నెరయ
నిన్ను వేర్వేఱ నింక వర్ణింప నేల?
ప్రోఢ వన్నింట సర్వయ మాడసుకవి! (1-18)

మాడయ్యకవి కాలము నిర్ణయించుటకీ పద్యమే యెక్కువగాఁ దోడ్పడుచున్నది. ఈ పద్యములో 1. వీరనరసింహరాయలు 2. కోట సింగనమంత్రి 3. నందాపురీశుఁడు 4. కిమిడెరాజు పేర్కొనఁబడినారు.

## 1. వీరనరసింహరాయలు:

కర్ణాటరాజ్యము నేలిన వారిలో 1. సాళువనరసింహరాయలు – జైమిని భారతకృతిభర్త – అన్నమయ్యసమకాలికుఁడు 2. తుళువనరసింహరాయలు – వరాహపురాణకృతిభర్త 3. వీరనరసింహరాయలు – మాడయ్యను మెచ్చిన రాజు – అని ముప్వురు నరసింహులు గలరు. వీరు ముప్వురు 15వ శతాబ్ది యుత్తరార్ధములో 1485 –1509 మధ్యకాలములో నున్నవారే.

తుళువ నరసింహరాయలకు 1. తిప్పాంబ 2. నాగాంబ యను నిద్దఱు భార్యలు గలరు. తిప్పాంప కుమారుఁడు వీరనరసింహరాయలు. నాగాంబ తనూజుఁడు శ్రీకృష్ణదేవరాయలు. వీరనరసింహరాయ లను పేరు కృష్ణరాయల యన్న యందే రూఢము.

తే॥గీ॥ ఆ నృసింహప్రభుండు తిప్పాంబ వలన
నాగమాంబిక వలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయభూవిభుని; నచ్యు
తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు.

కం॥ వీరనృసింహుఁడు నిజభుజ
దారుణకరవాలపరుషధారాహత వీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్.

– అల్లసాని పెద్దన (మను - 1–31, 32)

కం॥ ఆ నరసమహీమహిళా
జానికిఁ గులసతులు పుణ్యచరితలు తిప్పాం
బానాగాంబిక లిరువురు
దానవదమనునకు రమయు ధరయును బోలెన్.

కం॥ వారలలోఁ దిప్పాంబ కు
మారుఁడు పరిపంథికంధిమంథాచలమై





వీరనరసింహరాయఁడు
వారాశిపరీతభూమివలయం బేలెన్.

– నంది తిమ్మన (పారి –1–14,15)

పై పద్యములో 'నరనాయకుని వీరనారసింహు' (మైరా –1–18) అను దానికి బదులుగా 'నరసనాయకు వీరనారసింహు' – నను పాఠ ముండి యుండు నని చాగంటివా రూహించుచున్నారు.

వీరనరసింహరాయల రాజ్యకాలము క్రీ.శ. 1506 – 1509.

## 2. కోట సింగనమంత్రి :

ఈ కోటసింగనరాజు సుప్రసిద్ధుఁడే. ముప్పది యిద్దఱు మంత్రులలోఁ బదియవమంత్రిగాఁ గీర్తింపఁబడినాఁడు.

సీ॥ పట్టిసపురవీరభద్రుని ప్రేమచేఁ
జొన్నెందె శ్రీకోట సింగరాజు.

(చాటు.మ.మం– 2భా–252పుట.)

ఇతఁడు పట్టిస (పట్టిసీమ) శ్రీవీరభద్రభక్తుఁ డగుటచే గోదావరీ మండలమునకుఁ జెందినవాఁడు కావచ్చును. కోటసింగరాజుపైఁ గవులు చెప్పిన చాటుపద్యములను శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు సేకరించినారు. వీనిని బట్రాజు లెక్కువగాఁ జదువుదురని చెప్పి చాగంటివారు కూడ నుద్ధరించినారు. ఇవి చమత్కార హృద్యము లగు చాటుపద్యము లగుటచే నేను గూడ నిచట నుదాహరించుచున్నాను.

సీ॥ పాయసాన్నప్రౌఢి పరిపాకమే చాలు
పిండివంటల రుచుల్ మెండు మేలు
ఆజ్యప్రవాహంబు రాజ్య మేమని చెప్పఁ
బల్చని పెసరొల్పుఁ బప్పు తెప్ప
మెత్తనై స్వచ్ఛమై మెదలెడు రాజాన్న
మెన్నఁ గైకొంటిమో యన్న! నిన్న
బహువిధశాకప్రపంచంబు తుది ముట్ట
నూరుఁగాయల రుచు లొరవు లుట్ట

తే॥గీ॥ అనుచు నీపంక్తి భుజియింతు రనుదినంబు
భూసురశ్రేష్ఠు లెలమి నుప్పొంగి పొంగి
మహితచారిత్ర! కొండయామాత్యపుత్త్ర!
కుటిలదుర్మంత్రిమదభంగ! కోటసింగ!

సీ॥ రావూరిపురి ఢిల్లిరాజ్యంబు లందుండి
సింధుబర్బరమధ్యసీమ నుండి
పాంచాలమాళవపాండ్యభూముల నుండి
కటకకల్యాచలగయల నుండి
ఘోట్టాణటెంకణ ఘూర్జరోర్వుల నుండి
మళయాళకేరళమహుల నుండి
భోజకర్ణాటకాంభోజభూముల నుండి
సాల్వాంధ్రముఖ్యదేశముల నుండి

తే॥గీ॥ చాల నేతెంచు సద్ద్విజసంఘములకు
నన్నదానంబు గావించుచున్న దొరవు
భవ్యచారిత్ర! కొండయప్రభుసుపుత్త్ర!
కుటిలదుర్మంత్రిమదభంగ! కోటసింగ!

కం॥ నరజన్మంబునఁ బుట్టినఁ
గరణీకమె యుత్తమంబు కరణం బైనన్
పురుషార్థపరుఁడు గావలె
శిరసెత్తిన ఫలము కోటసింగనవర్యా!

చ॥ గడుసరి లోభి యర్థ మది కన్నపుదొంగల బందిపోటుకున్
బుడమిని వారకాంతలకు భూపతికిం జనుఁ గోటసింగ! నీ
పడసిన యర్థ మార్తులకు బాంధవకోటికి యాచకాళికిన్
గుడికిని సత్త్రశాలకును గూపతటాకవనప్రతిష్ఠకున్.

తే॥గీ॥ కోట సింగరాజు మాట వాసియె కాని
గంగమాంబ వలన ఘనత కెక్కె
గంగమాంబ జగతి గయ్యాళి యైనను
సింగరా జిఁకేమి సేయఁ గలఁడు?





ఉ॥ భానుజుఁ దర్థముం గుముదబాంధవుఁడా యమృతంబు మేఘుఁడున్
దానజలంబు నన్నమది ధర్మజుఁడున్ గల వేళ నిత్తురౌ
వానిని వాని వాని మఱి వానినిఁ జెప్పకు కోటసింగఁడే
మానక కాంచనామృతసమానజలాన్నము లిచ్చు నెప్పుడున్.

– (చాటు. మ. మం– 2భా – 278...280 పుటలు)

తస్కర కవిరా జెవ్వరో తెలియదు 'తస్కరకవిరాజి' నని వేటూరి వారి పాఠము. అప్పుడు 'తస్కరకవి' వ్యక్తి పేరు కాక 'దొంగకవు' లని సామాన్యార్థము వచ్చును.

### 3. నందాపురీశుఁడు :

ఈ రాజు పేరు తెలియదు. నందాపుర మనఁగా నిప్పటి జయపురము (జయపూర్ – ఒరిస్సా) అని చాగంటి వారు చెప్పుచున్నారు.

### 4. కిమిడెభూరమణుఁడు :

ఈ రాజు పేరు కూడఁ దెలియదు. కిమిడి సంస్థానము గంజాము మండలము లోని దని చాగంటి వారు చెప్పుచున్నారు.

"కృష్ణామండలనివాసి యగు నీకవి యటు పడమట బళ్ళారి మండలమునకును దూర్పున గంజాము మండలము వఱకును బోయి తన పాండిత్యమును గనఁబఱచి బహుమతు లందె ననుట శ్లాఘనీయ మగు విషయము"!

– (కవితరంగిణి – 6భా –242 పుట)

మాదయ్య వీరనరసింహరాయలను మెప్పించుటచే నితఁడు 1460–1520 మధ్యకాలములో జీవించినట్లు స్థూలముగా నిర్ణయింపవచ్చును.

## మాదయ్య నుతించిన ప్రాచీనకవులు

***1. సంస్కృతకవులు :***

**కం॥ వినుతింతు సమ్మదంబున
వినుతసుపటుచాటుకారవిఖ్యాతలస
ద్ఘనతరరామకథారస
ఘనసముదయమత్తకేకిఁ గవివాల్మీకిన్ (1–9)**

**కం॥ నీరదనీలశరీరుని**
**నీరజదళనేత్రు నిగమనిర్మితసూత్రున్**
**బారావారగభీరునిఁ**
**బారాశరమౌనిఁ గొల్తుఁ బ్రమదం బెసఁగన్ (1-10)**

**సీ॥ సన్నుతి యొనరింతు సర్వజ్ఞ బిరుదాంక**
**భద్రవాచాస్థాణు భట్టబాణు**
**గురుమతి వర్ణింతు వరపదాలంకార**
**కవితార్థవిన్యాసుఁ గాళిదాసు**
**మది లోన వర్ణింతు మహనీయమధురవి**
**స్ఫురిత శాబ్దోన్మత్తు సోమదత్తు**
**వినయోక్తిఁ గొనియాడుదును భూరిగర్విత**
**కవిగోత్రపాకారి ఘను మురారిఁ**

**తే॥గీ॥ బ్రార్థనము సేతు శివభద్రుఁ బ్రవరసేనుఁ**
**జోరు భవభూతి దండి మయూరు బాణు**
**మాఘు భారవి నుద్భటు మతియుఁ బేరు**
**గల కవీంద్రులఁ జింతింతు గరిమతోడ. (1-11)**

**1. వాల్మీకి (త్రేతాయుగము) :**

శ్రీమద్రామాయణ మహాకావ్యకర్త. ఆదికవి.

**2. వ్యాసుఁడు (ద్వాపరయుగము) :**

మహాభారతము, 18 పురాణములు రచించిన మహర్షి. 18 ఉపపురాణములు; బ్రహ్మసూత్రములు; యోగభాష్యము వ్యాసుని రచనలే యని సంప్రదాయము.

**3. బాణభట్టు (7శ.) :**

శ్రీహర్షవర్ధనుని (604-647) ఆస్థానకవి. 1. హర్షచరితము 2. కాదంబరి 3. చండీశతకము నితని కృతులు. పార్వతీపరిణయనాటకము భట్టబాణ విరచితముగాదు. వామనభట్టబాణుని కృతి. ఇతఁడు తెలుఁగువాఁడు.



**4. కాళిదాసు (క్రీ.పూ. 1శ.) :**

1.రఘువంశ 2. కుమారసంభవ 3. మేఘసందేశకావ్యములు 4. అభిజ్ఞానశాకుంతల 5. విక్రమోర్వశీయ 6. మాళవికాగ్నిమిత్ర నాటకములు రచించిన మహాకవి.

**5. సోమదత్తుఁడు (?) :**

ఈ కవి యెవరో యేకృతులు రచించెనో తెలియదు. సంస్కృతవాఙ్మయ చరిత్రకారు లెవ్వరు నీకవినిఁ బేర్కొనలేదు.

**6. మురారి (8శ) :**

అనర్ఘరాఘవ నాటకకర్త.

**7. శివభద్రుఁడు :**

ఈ కవి పెక్కుమంది యాంధ్రకవులకు స్తోత్రపాత్రుఁ డైన వాఁడు. ఇతఁడు 'శివభద్ర' మను స్తోత్రకావ్యమును రచించినాఁడు. "శివభద్రంబు నందు 'ప్రణమితశిరసి' యని కవివరుండును" (అప్ప -4-73) అని యప్పకవి చెప్పినాఁడు. ఈ శివభద్ర కావ్యము నాకు లభింపలేదు.

**8. ప్రవరసేనుఁడు (1శ.) :**

ఇతఁడు 'సేతుబంధ' మను ప్రాకృతకావ్యమును నిర్మించిన మహాకవి. 'బదరసేను' - అను ముద్రితపాఠ మపపాఠము.

**9. చోరుఁడు (11శ.) :**

ఈ కవి యసలు పేరు బిల్హణుఁడు. మదనాభిరామనృపతి (వీరనరసింహుఁడు) కూఁతు రగు యామినీపూర్ణతిలకకు (చంద్రలేఖ - శశికళ) గురువై యామెను రహస్యముగా భోగించుటచే రాజుచేఁ జోరుఁడుగా శిక్షింపఁబడి పిమ్మట నామెను వివాహ మాడినవాఁడు.

1. చోరపంచాశిక (బిల్హణీయము); 2. బిల్హణస్తవము (శివస్తుతి); 3. విక్రమాంకదేవచరితము (18 సర్గముల మహాకావ్యము); 4. కర్ణసుందరీనాటిక రచించిన గొప్పకవి.

**10. భవభూతి (8శ.) :**

1. మాలతీమాధవ 2. మహావీరచరిత 3. ఉత్తరరామచరితము లను నాటకములను రచించిన మహాకవి. కాళిదాసుతో సమస్కంధుఁడు.

**11. దండి (7శ.) :**

1. అవంతిసుందరీ 2. దశకుమారచరిత 3. కావ్యాదర్శములను రచించిన మహావిద్వత్కవి.

**12. మయూరుఁడు (7శ.) :**

ఇతఁడు కూడ బాణునితో శ్రీహర్షుని యాస్థానము నలంకరించిన వాఁడు. 1.సూర్యశతక 2. సూర్యదండక 3. మయూరాష్టకములను రచించిన మహాకవి.

బాణ – మయూరులు బావ – మఱఁదులని సంప్రదాయము. ఇది పోతన – శ్రీనాథుల సంబంధము వంటిది.

**13. బాణుఁడు (1340 –1420) :**

ఈ పద్యములో బాణుఁడు రెండు సారులు వచ్చినాఁడు. ఈ రెండవ బాణుఁడు వామనభట్టబాణుఁడు. శ్రీవిద్యారణ్యస్వామి శిష్యుఁడు. పెదకోమటి వేమారెడ్డి (1403 –1420) యాస్థానవిద్వత్కవీశ్వరుఁడు. 'షడ్భాషావల్లభ' – 'కవిసార్వభౌమ' బిరుదాంకితుఁడు. ఇతని కృతులు –

1. వేమభూపాలచరితము 2. బృహత్కథామంజరి 3. ఉషాపరిణయము (బాణాసురవిజయము) – గద్యకావ్యములు. 4. నలాభ్యుదయము (8సర్గములు) 5. రఘునాథచరితము (30సర్గములు) 6. హంస సందేశము – పద్యకావ్యములు. 7. పార్వతీపరిణయము (5 అంకములు) – నాటకము 8. కనకలేఖాకల్యాణము (4 అంకములు) – నాటిక 9. శృంగారభూషణము – భాణము 10. శబ్దార్థ చంద్రిక 11. శబ్దరత్నాకరము – నిఘంటువులు. శబ్దరత్నాకరము యాదవప్రకాశుని వైజయంతీకోశము వలె విశాలమైన నిఘంటువు.

వీనిలో 1. వేమభూపాలచరిత 2. పార్వతీపరిణయ 3. కనకలేఖాకల్యాణ 4. శబ్దరత్నాకరములు నాకు లభించినవి. తక్కినవి ముద్రితములో కావో తెలియదు.

వామనభట్టబాణుఁడు శ్రీనాథుని కంటె సుమారు 30 సంవత్సరములు పెద్దవాఁడు. ఇరువురు వేమభూపాలుని యాస్థానమునం దున్న వారే. వేమభూపాలచరితమును శ్రీనాథుఁడు భీమఖండములో ననుసరించినాఁడు. పార్వతీపరిణయమును శ్రీపిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగా రనువదించినారు. వేమభూపాలచరితమును శ్రీబండ్లవేంకట రమణయ్యగారు పద్యకావ్యముగా నాంధ్రీకరించినారు.





**14. మాఘుఁడు (7శ.) :**

శిశుపాలవధమహాకావ్యకర్త.

**15. భారవి (6శ.) :**

కిరాతార్జునీయమహాకావ్యకర్త.

**16. ఉద్భటుఁడు (8శ.) :**

కావ్యాలంకారసారసంగ్రహము, కుమారసంభవము రచించిన గొప్ప యాలంకారికుఁడు.

***2. తెలుఁగు కవులు :***

ఉ॥ **రక్కసి చేతఁ జిక్కువడి రాయిడిఁ బొందిన యట్టి వేదముల్**
**చక్కఁగఁ జేసి వ్యాసుఁడు ప్రశస్తము సేసిన భారతం బిలన్**
**దక్కఁగ నాంధ్రభాష విశదంబుగఁ జెప్పిన నన్నపార్యునిం**
**దిక్కనసోమయాజిని మదిం దగఁ గొల్చెద గావ్యభూతికిన్ (1–12)**

మాదయ మహాభారతము నాంధ్రీకరించిన కవిత్రయములో నన్నయ –తిక్కనలను మాత్రమే స్తుతించినాఁడు. ఎఱ్ఱన గారిని నుతింపక పోవుట వింతగా నున్నది. పెక్కు మంది యాంధ్రకవు లిట్టి పని చేసినారు.

పోతన భాగవతములో నన్నయ – తిక్కనల మాత్రమే స్తుతించినాఁడు. శ్రీనాథుఁడు నైషధ – కాశీఖండములలోఁ గవిత్రయమును స్తుతించినను భీమఖండములో నన్నయ – తిక్కనలను మాత్రమే నుతించినాఁడు.

# కథాసారము

## ప్రథమాశ్వాసము.

శ్రీరామచంద్రుఁడు రావణుని వధించిన పిమ్మట సీతామహాసాధ్వితో నయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడై రాజ్యము నేలుచుండెను. అతఁ డొకనాఁడు కొలువు దీర్చి యుండఁగా నామహానుభావుని దర్శించుటకై యనేకమహర్షులు వచ్చిరి. కుశలప్రశ్నలైన పిమ్మట రాముఁ డగస్త్యమహర్షినిఁ జూచి హనుమంతుని సాహాయ్యము వల్లనే తాను కష్టములు గడచి గట్టెక్కితి నని చెప్పెను. అప్పు డగస్త్యమహర్షి హనుమంతుని ప్రభావము నుగ్గడించుటకై యీ మైరావణుని కథను జెప్పెను.

రామ – రావణ యుద్ధము జరుగుచుండెను. రావణుఁడు శ్రీరాముని జయింపలేక పాతాళలంక నేలు మైరావణునిఁ దలఁచు కొనెను. మైరావణుఁడు లంకాపట్టణమునకు వచ్చి రావణునిఁ గలిసెను. రావణుఁడు తాను సీతను దొంగిలించి తెచ్చిన సంగతిని, యుద్ధవిషయమును జెప్పి రామలక్ష్మణుల నెట్లైనను వధించి రమ్మని యాజ్ఞాపించెను. అప్పుడు మైరావణుఁడు పరకళత్రాపహరణము మహాపాపమనియు శ్రీరాముఁడు సామాన్య మానవుఁడు కాఁ డనియుఁ బరమాత్ముఁ డైన శ్రీమహావిష్ణు వనియుఁ జెప్పి సీత నర్పించి శ్రీరాముని శరణు వేఁడు మని బోధించెను. ఆ యుపదేశమును బెడచెవిని బెట్టి రావణుఁడు మైరావణుని దూషించి “నీవు చెప్పిన పని చేసితివి. చాలును. నీవు వచ్చిన దారినే పొ”మ్మని మందలించెను. అంత మైరావణుఁడు శ్రీరామలక్ష్మణులను మాయచేసి పాతాళలంకకుఁ గొనిపోయి భద్రకాళికి బలి యిత్తు నని ప్రతిజ్ఞ చేసెను. గూఢచారులీ విషయమును విభీషణునకు విన్నవించిరి. విభీషణుఁడు – జాంబవంతుఁడు, హనుమంతుఁడు, సుగ్రీవుఁడు మొదలగు వానరులకీ రావణ – మైరావణ సంవాదము చెప్పి మన మెట్లైనను శ్రీరామలక్ష్మణులను గాపాడుకొనవలెనని విన్నవించెను. అంత హనుమంతుఁడు విశ్వరూపము ధరించి తన తోఁకతో నొక కోటను గట్టి రామలక్ష్మణుల నందుంచెను. రామలక్ష్మణులు నిద్రించుచుండిరి. విభీషణ సుగ్రీవాదులా వాలవప్రము చుట్టు ప్రహరి తిరుగుచుఁ గాపు కాయుచుండిరి.

మైరావణుఁడు పాతాళలంక కేఁగి తన భార్య యగు మాతంగిని బిలిచి రావణుని యాదేశమును వివరించెను. శ్రీరామలక్ష్మణులను దెచ్చి భద్రకాళికి బలియిచ్చు సంగతి చెప్పెను. అంత మాతంగి మూర్ఛ పొంది కొంతసేపటికి సేద దేఱి శ్రీరాముఁడు మహావిష్ణు వని మత్స్య – కూర్మ – వరాహ – నారసింహ – వామన – పరశురామ – రామావతారములను వర్ణించి రావణవధకై రాముఁడుగా నవతరించిన కారణపురుషుఁ డని “శ్రీరామునకు నీకు హస్తిమశకాంతరము. వాని జోలికి వెళ్ళ వల”దని హితవు చెప్పెను. మాతంగి పలికిన నీతివాక్యములు వినక మైరావణుఁడు రామలక్ష్మణులను దెచ్చుటకై తెగువ పూనెను.

ఇది ప్రథమాశ్వాసము.





## ద్వితీయాశ్వాసము

మైరావణుఁ డింద్రజాల మహేంద్రజాలాది విద్యలను సాధనములుగాఁ జేసికొని తన మంత్రులగు సూచీముఖ – ఘటకులతో బయలుదేరెను. ఎన్నో యపశకునములు పొడచూపినవి. వానిని లెక్కింపక మైరావణుఁడు ఘటకుని జూచి శ్రీరామలక్ష్మణుల సంగతి తెలిసికొని రమ్మని పంపెను. ఘటకుఁడు వానరవేషముతో వెళ్ళి హనుమంతుఁడు తోఁకతోఁ గట్టిన కోటను గాంచి వచ్చి “అది నక్షత్రమండలము దాఁక నున్నది. దానికి సుగ్రీవ –విభీషణులు ప్రహరి తిరుగుచున్నారు. అది దుర్భేద్య”మని విన్నవించెను. అది విని మైరావణుఁడు కోపముతో సూచీముఖునిఁ బంపెను. సూచీముఖుఁడు వాలపుఁ గోటకుఁ గన్నపెట్టి త్రవ్వపోఁగా ముక్కు విఱిగెను. అంత మైరావణుఁడు మాయావిభీషణ వేషముతో హనుమంతుని జేరి శ్రీరామలక్ష్మణ లెట్లున్నారో చూచి వచ్చెద నని లోని కేఁగి తన మాయచే శ్రీరామలక్ష్మణులను మూర్ఛిల్లఁ జేసి యొక యుక్కుపెట్టెలోఁ బెట్టి పాతాళలంక చేరి భద్రకాళి గుడిలో దాచి రాక్షసులను గాపుంచెను. ఆ తరువాత నిజవిభీషణుఁ డరుదెంచి తోఁక కోట పరికించి మైరావణుఁడు మాయావేషముతో శ్రీరామలక్ష్మణులను దొంగిలించి తీసికొనిపోవుట తెలిసికొని విలపించెను. హనుమంతుఁ డాగ్రహించి యెట్లైనను పాతాళలంక చేరి శ్రీరామలక్ష్మణులను దీసికొని వత్తు నని ప్రతిజ్ఞ చేసెను. విభీషణుఁడు హనుమంతునకుఁ బాతాళలంకామార్గ మెఱిఁగించి యొక సరస్సు చూపెను.

విభీషణుఁడు చెప్పిన విధముగా నాంజనేయుఁడు సరస్సుచేరి సూక్ష్మరూపముతో నాతటాకము నందలి తామరకాడలోఁ బ్రవేశించి పాతాళలంక కేఁగుచుండెను. అది చూచి మత్స్యవల్లభుఁడు హనుమంతు నడ్డగించెను. హనుమంతునకు – మత్స్యవల్లభునకు ద్వంద్వయుద్ధము జరిగెను. ఇద్దఱు సరిసమానముగాఁ బోరిరి. హనుమంతుఁడు మత్స్యవల్లభుని శౌర్యమునకు మెచ్చి “నీ తల్లిదండ్రు లెవరు? గోత్రనామము లేవి?” యని ప్రశ్నించెను. “నా తల్లి తిమింగిలము. హనుమంతుఁడు సీతాన్వేషణమునకై సముద్రము దాఁటుచుండఁ గా వాని చెమట బిందువు క్రిందఁ బడినది. ఆ స్వేదబిందువును తిమింగిలకాంత మ్రింగి గర్భము ధరించినది. ఆమెకు నేను పుట్టితిని. నా భుజబలమునకు మెచ్చి మైరావణుఁడు నాకు మత్స్యవల్లభుఁడని పేరుపెట్టి తనకు సహాయునిఁ జేసికొని యీ పంకజనాళమును జూపి యెవ్వరు రాకుండ నన్ను నియమించె” నని తన

జన్మవృత్తాంతము చెప్పెను. అది విని సంతసించి హనుమంతుఁడు "నేనే యాంజనేయుఁడ"నని చెప్పి తన విశ్వరూపము చూపెను. మత్స్యవల్లభుఁడు హనుమంతుని స్తుతించెను. హనుమంతుఁడు తాను వచ్చిన కార్యము చెప్పెను. మత్స్యవల్లభుఁడు సూక్ష్మరూపుఁ డైన హనుమంతుని తన భుజముపై నెక్కించుకొని పాతాళలంకకుఁ జేర్చి యొక్క సరోవరము దగ్గఱ దింపెను. "ఈ పాతాళలంకాపుర ద్వారమున నొక్క త్రాసు గలదు. అది శత్రువు లెక్కిన విఱిగి పడును. పదిలముగా వెళ్ళుము. నీటికై యీ సరస్సునకు వచ్చు రాక్షసస్త్రీల వలన రామలక్ష్మణుల వార్త తెలియును. అది విని నీ కార్యము సాధింపు" మని చెప్పి మత్స్యవల్లభుఁడు హనుమంతుని వీడుకొనెను. ఆ సమయమున దుర్దండి యను రాక్షసి హనుమంతునకు ఁగన్పట్టెను. ఈమె మైరావణుని తోఁబుట్టువు. దుర్దండి భర్త కాలదండుఁడు. వీరి కొడుకు నీలమేఘుఁడు. నీలమేఘుఁడు పుట్టినప్పు డాకాశవాణి "ఓ మైరావణా! నీ మేనల్లుఁ డగు నీ నీలమేఘుఁడు నీ కొమార్తెను బెండ్లాడి యీ పాతాళలంక నేలు"నని పలికినది. అది విని యులికి మైరావణుఁడు నీలమేఘునిఁ గారాగృహములో బంధించెను. దుర్దండీకాలదండులను సంకెలలు వేసి దాసులుగాఁ జేసికొనెను. ఈ వృత్తాంత మంతయు దుర్దండి హనుమంతునకుఁ జెప్పినది. అది విని హనుమంతుఁడు "నేను మైరావణునిఁ జంపి నీలమేఘుని రాజుగాఁ జేసెదను. నాకు రామలక్ష్మణులను జూపుమని పలికెను. దుర్దండి మైరావణుని గుఱించి మఱియు నిట్లు చెప్పెను. మైరావణుఁడు మేరునగప్రాంతములో బ్రహ్మదేవుని గూర్చి పెక్కు సంవత్సరములు తీవ్రమైన తపస్సు చేసెను. వాని తపస్సునకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుకొను మనఁగా "దేవ రాక్షసయక్షాదులచే నాకు మరణము లేకుండవలెను. మఱియు నాకొక పట్టణము పాతాళములోఁ గావలె" నని కోరెను. బ్రహ్మయట్లే వరమిచ్చి పాతాళలోకములో నొక పట్టణము నిర్మింపు మని మయునిఁ బంపెను. మయుఁడు పాతాళమునకు వచ్చి 50 యోజనములు విస్తీర్ణము 88 యోజనములు నిడివి గల యొక పట్టణము నిర్మించెను. దానిలో 30 లక్షలు వీథులు 7 కోట్ల శివాలయములు గలవు. 1. నవరత్నములు పొదిగిన కోట 2. ఱాతికోట 3. ఇనుపకోట 4. ఉక్కుకోట 5. కంచుకోట 6. వెండికోట 7. బంగారుకోట నిర్మించి మైరావణునకిచ్చెను. ఆ పాతాళలంకా పట్టణమును జూచి సంతసించి మైరావణుఁడు బ్రహ్మకు మ్రొక్కి తన శత్రులెవరైన వచ్చినచోఁ దెలిసికొను విధమును వేఁడెను. అంత బ్రహ్మ యొక భూమికోటను నిర్మింపఁజేసి దాని వాకిలి





యందు నుక్కుతోఁ జేసిన యొక తక్కెడను వ్రేలాడఁ దీయించి "మిత్రుఁడు వచ్చినచో నీ త్రాసిట్లే యుండును. శత్రువు వచ్చినచో విఱుగు"నని చెప్పి మాయమయ్యెను. మైరావణుఁడా యుక్కు తక్కెడకు 18కోట్ల రాక్షసులను గావలియుంచెను. పిదప మైరావణుఁడు దుండగుఁడై నాగులను, గంధర్వులను, యక్షులను, దేవతలను, జెఱలోఁ బెట్టి బాధించెను. అట్టి మైరావణుని నీవెట్లు గెలువఁ గలవని దుర్దండి ప్రశ్నించెను. అది విని యాంజనేయుఁడు మైరావణున కెంత సైన్యమున్నను నేను త్రుటిలో గెల్వఁగల నని చెప్పి దుర్దండికిఁ దన విశ్వరూపము చూపెను. దుర్దండి విశ్వరూపుఁ డగు హనుమంతుని స్తుతించి "నీవు సూక్ష్మరూపము గైకొనుము. పాతాళలంకకుఁ గొంపోదు"నని చెప్పెను. అంత హనుమంతుఁడు దుర్దండి సంకెలలు తెగఁగొట్టి చింతాకంత సూక్ష్మరూపము ధరించెను.

ఇది ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము

దుర్దండి బంగారు కడవలో నీరు ముంచుకొని దాని యంచుపైఁ జింతాకంత యైన యాంజనేయు నుంచుకొని పాతాళలంక యందలి కోటకుఁ జేరెను. వెంటనే మయుఁడు చేసిపెట్టిన తక్కెడ భగ్నమయ్యెను. అది చూచి కావలివారగు పెక్కుమంది రక్కసులు వివిధాయుధములు ధరించి దుర్దండిని జుట్టుముట్టిరి. అంతఁ గలశము నందున్న హనుమంతుఁడు భూమి పైకి లంఘించి తన స్వస్వరూపము ధరించి మిన్ను ముట్టునట్లు దేహము పెంచి రాక్షసులను డీకొని నిమిషములో రాక్షససేన నంతమొందించెను. దుర్దండి హనుమంతుని పరాక్రమము గని పొంగి వానిని శ్రీరామలక్ష్మణులున్న కాళికాలయము దరికిఁ గొంపోయెను. అచ్చటి ద్వారపాలకులగు రాక్షసులు దుర్దండిని హనుమంతునిఁ జుట్టుముట్టఁగా హనుమంతుఁడు వారి నందఱను మట్టుపెట్టి కాళికాలయము లోనికిఁ బోయి కాళికాదేవికిఁ జేతులు మోడ్చి స్తుతించి రామలక్ష్మణులను జూపు మని ప్రార్థించెను. కాళికాదేవి సమాధానము చెప్పక మౌనముతో మిన్నకుండెను. అంత హనుమంతుఁడు కోపించి "నిన్ను నా తోఁకతోఁ జుట్టి విదిలించెదను. బూడిద యయ్యెద" వని హుంకారముతోఁ గాళిక పైకి దూఁకెను. అంతనా మహాశక్తి కంపితాత్మయై కనులు తెఱచి "నాపైఁ గోపించి ద్రోహము తలపెట్టెద వేల? మైరావణుఁడు శ్రీరామలక్ష్మణులను దెచ్చి యిచ్చట దాఁచుట నాకుఁ దెలయ"దని

యొక్కింత కన్నులు మోడ్చి తన మనస్సుతో సర్వము పరికించి తన భోజనాగారములో శ్రీరామలక్ష్మణులను దాఁచి పెట్టుట తెలిసి భూతగణములను బిలిచి శ్రీరామలక్ష్మణులను బైటకుఁ దెండని యాజ్ఞాపించెను. భూతసంఘములు శ్రీరామలక్ష్మణులున్న యుక్కుపెట్టెను హనుమంతున కిచ్చిరి. ఆంజనేయుఁ డాపెట్టెను గైకొని పెన్నిధిని గన్న పేద చందంబున నానందించి దుర్దండితో లంకా పట్టణమునకు వచ్చి పురమును భగ్నము చేసి యచ్చటి రాక్షసుల నందఱను హతమార్చెను. హతశేషు లగు రాక్షసు లీవిషయమును మైరావణున కెఱింగించిరి.

అంత మైరావణుఁడు కోపించి యఖిలకంటకుఁడు, అష్టహస్తుఁడు, బహుముఖి, సూచీముఖుఁడు, రత్నలోచనుఁడు, ఘటనాసికుఁడు మొదలగు వారిని సైన్యముతో హనుమంతుని పైకిఁ బంపెను. రాక్షసులకు హనుమంతునకు భీకరయుద్ధ మయ్యెను. హనుమంతుఁడు సమస్త సైన్యమును సంహరించెను. మైరావణుఁడు స్వయముగా సైన్యముతో యుద్ధమునకు బయలుదేరెను. మాతంగి “నీకు యుద్ధము తగ”దని బుద్ధి చెప్పినది. మైరావణుఁడా మాటలు పెడచెవిని బెట్టి రథమెక్కి రణరంగమున కేతెంచెను. హనుమంతుఁడు రాక్షసవీరులను నేలమట్టము గావించెను. హనుమంతునకు మైరావణునకు నెక్కటికయ్య మయ్యెను. హనుమంతుఁడు మైరావణుని వాలముతోఁ జుట్టి నేలఁ గూల్చెను. మైరావణుఁడు చచ్చి మఱల బ్రదికెను. మఱలఁ జంపెను. మఱల బ్రతికెను. మైరావణునకు విఱిగిన కాళ్ళు చేతులు మఱల మొలచుచుండెను. ఖండించిన శిరస్సు మఱల వచ్చుచుండెను. ముద్ద యైన యంగములు మఱల బలియుచుండెను. ఈ విధముగా నెన్ని మాఱులు చంపినను మైరావణుఁడు మఱల జీవించి యుద్ధమునకు వచ్చుచుండెను. హనుమంతునకది యంతయు మాయగాఁ దోఁచెను. మైరావణు నెట్లు చంపవలెనని యాలోచించుచుండెను. అంతట దుర్దండి హనుమంతుని జేరి “వీని ప్రాణములు వీని దేహములో నుండవు. మఱియొక చోట దాఁచిపెట్టినాఁడు. ఈ పట్టణము మధ్య నొక మహాబిలము గలదు. దాని లోపల నొక గుహ యున్నది. ఆ గుహలో నొక గుండు గలదు. ఆ గుండులో మఱల నేడు కన్నము లుండును. ఆ యేడు బిలములలో నేడు తుమ్మెద లున్నవి. ఒక బిలము నందలి గనిలోని తుమ్మెద మఱియొక గని లోనికిఁ బోయి దాఁగికొనును. ఆ యేడు తుమ్మెదలను బట్టుకొని యొకే మాఱు చంపినచో వీఁడు చచ్చు” నని మైరావణుని ప్రాణరహస్యము తెలిపినది. ఈ మర్మము వెల్లడించుచున్న



దుర్దండిని మైరావణుఁడు కోపించి తూలనాడుచుండెను. అంతలో హనుమంతుఁడు మైరావణుని వాలముతోఁ జుట్టి హుంకారము చేసి యొక పాదముతో వాని కంఠము త్రొక్కి వాని నాబిలము వఱకు నీడ్చుకొని వెళ్లి మహాబిలమునందలి గుహ చొచ్చి యేడు బిలములయందలి యేడు తుమ్మెదలను బట్టుకొని పిసికి యొకేమాఱు చంపెను. మైరావణుఁడు ప్రాణములు విడిచి చచ్చెను. సమస్త భూతములు సంతసించెను. దుర్దండి హనుమంతుని సన్నుతించి కారాగృహములో నున్న నీలమేఘుని విడిపించినది. నీలమేఘుఁడు స్నానము చేసి శుద్ధుఁడై హనుమంతుని పాదపద్మములకు మ్రొక్కి చేతులు మోడ్చి యొక దండకముతో వినుతించెను. అంతఁ గారాగృహపాలకులీ విషయము లన్నియు మాతంగికిఁ జెప్పిరి. ఆమె భర్తకై విలపించుచు రణభూమికి వచ్చినది. అక్కడ భూతములు, బేతాళములు, ప్రేతములు, పిశాచములు, డాకినులు, శాకినులు, దయ్యములు మాంసము తినుచుఁ దిరుగుచుండుఁగా యుద్ధమండలము భయంకరముగా నుండెను. మాతంగి మైరావణుపైఁ బడి విలపించినది. హనుమంతుఁడు మాతంగి నూరడించి మైరావణునకుఁ బరలోకక్రియలు గావింపు మని నీలమేఘు నాజ్ఞాపించెను. మైరావణునకు వైదికానుష్ఠానమంత్ర పూర్వకముగా నగ్ని సంస్కారాది పరలోకక్రియలు జరిగినవి. మత్స్యవల్లభుఁడు హనుమంతునకు మ్రొక్కెను. హనుమంతుఁడు కనక కలశములతో విమలోదకములు తెప్పించి దైత్యు లందఱు జయ పెట్టుచుండఁగా మంచి ముహూర్తమున నీలమేఘున కభిషేకము గావించి పాతాళలంకారాజ్యమునకుఁ బట్టము గట్టి మత్స్యవల్లభుని యువరాజుగా నియమించి నీతులు చెప్పి శ్రీరామనామమాహాత్మ్యము నుగ్గడించి శ్రీరామలక్ష్మణులున్న పెట్టె గైకొని వచ్చి లంకాపట్టణములోఁ బెట్టి పెట్టె తలుపులు తెఱచెను. శ్రీరామలక్ష్మణులు నిద్రనుండి మేలుకొనినట్లే లేచిరి. ఈ కథయంతయు నొక రాత్రిలో జరిగినది. తెల్లవారినది. సూర్యుఁ డుదయించెను. శ్రీరామలక్ష్మణులు సంధ్యావందనాదిక్రియలు ముగించి యుద్ధమునకు సన్నద్ధులైరి. శ్రీరాముఁడు రావణుని సంహరించెను. కపిసైన్యము కొలువఁగా శ్రీసీతా మహాదేవితో నయోధ్యకు వేంచేసి పట్టాభిషిక్తుఁడయ్యెను.

అని యీ మైరావణుకథ నగస్త్యమహర్షి శ్రీరామచంద్రునకు వినిపించెను. శ్రీరాముఁడు హనుమంతునిఁ గౌఁగిలించుకొనెను. అంత మధ్యాహ్న మయ్యెను. మహర్షు లందఱు శ్రీరాముని దీవించి తమతమ యాశ్రమములు చేరిరి. శ్రీరాముఁ

డీ హనుమచ్చరిత్రమును దన తల్లులకు వినిపించెను. కౌసల్యాదేవి తన పుత్రులతో వానరుల కందఱకు విందు చేసినది. శ్రీరాముఁడు భోజన మారంభించుచు నాంజనేయునకుఁ బ్రసాద మిచ్చెను. హనుమంతుఁడా ప్రసాదపాత్రను గైకొని శ్రీరామప్రసాదము వానరుల కందఱకుఁ బంచిపెట్టెను. శ్రీరాముఁడు కపుల మధ్యకు వచ్చి హనుమంతుని సమీపించి "నీ భక్తికి మెచ్చితిని. నీకేమి కావలయునో కోరకొను"మనెను. హనుమంతుఁడు మఱల శ్రీరామభక్తినే కోరెను. శ్రీరాముఁడు సంతోషించి హనుమంతునకుఁ దన కంఠహారము బహూకరించెను. అనంతరము కొలువు కూటమునకు వచ్చి దివ్యరత్నసింహాసనము నలంకరించి తమ్ములతో నాంజనేయునిఁ బ్రేమపూర్వకముగా సంభావించి సుగ్రీవాదులతోఁ గిష్కింధకు వీడుకొలిపెను. విభీషణుని గూడ ననేకాలంకారములతో సత్కరించి 'తలఁచినపుడు వత్తువు గాక'! యని లంకకు సాగనంపెను. ఇట్లు పట్టాభిరాముఁడైన శ్రీరాముఁ డశ్వమేధాద్యనేక యాగములు చేయుచు బాలమరణములు, చోరభయములు, నీతిబాధలు లేకుండ రాజ్య మేలుచుండెను. ప్రజలకు శ్రీరామరాజ్య మయ్యెను.

ఉ॥ **ఈ కథ నెవ్వరైన లిఖియించిన విన్నఁ బఠించిరేనియున్**
**బ్రాకటరాజ్యవైభవము బంధుసమృద్ధియుఁ బుత్రలాభమున్**
**భీకరచోరశత్రుఘనబృందనివారణ మీప్సితార్థముం**
**జేకుఱు నెల్ల సౌఖ్యములు శ్రీహనుమంతు కృపారసంబునన్.**

తృతీయాశ్వాసము సర్వము సమాప్తము.

ఈ మైరావణచరిత్రములో 3 ఆశ్వాసములు 164 +168 + 205 మొత్తము 537 పద్యగద్యములు గలవు.

అగస్త్యమహర్షి చెప్పువఱకు శ్రీరామునకీ కథ తెలియకపోవుట వింతగా నున్నది. మహాభారతమునకు జైమినిభారతము పరిశిష్ట మైనట్లే రామాయణమునకు శతకంఠ - సహస్రకంఠ - మైరావణచరిత్రములు పరిశిష్టములు.

శతకంఠ రామాయణము సీతావిజయము. మైరావణచరిత్రము హనుమద్విజయము. నేఁటి హేతువాదులు పదితలలు గల దశకంఠ రావణుని గూర్చియే విశ్వసించుట లేదు. ఇంక శతకంఠరావణుని, సహస్రకంఠరావణుని,



మైరావణుని నమ్ముదురా! ప్రాచీనకవులీ యితిహాసములను విశ్వసించినారు. కొందఱు నాటకాదులలోఁ జమత్కారము కోసము శ్రీరామకథలో నెన్నో మార్పులు గావించినారు. ఏదో విధముగా శ్రీరామచరిత్రమును, శ్రీరామనామమాహాత్మ్యమును లోకములోఁ బ్రచారము చేయుటయే వారి ప్రధానలక్ష్యము.

## వర్ణనలు

మాడయ్య యీ కావ్యములో నష్టాదశవర్ణనలు చేయ లేదు గాని మూఁడు నాల్గు వర్ణనలు చక్కఁగా జేసినాఁడు.

**1. పురవర్ణనము :**

కావ్యారంభములో నయోధ్యాపురము 14 పద్యములలో (1–38.…51) ప్రబంధోచితముగా వర్ణింపఁబడినది.

**2. వన – సరోవర్ణనము :**

రెండవ యాశ్వాసములో విభీషణుఁ డాంజనేయునకుఁ బాతాళ లంకామార్గము చూపు సందర్భములో నొక సుదీర్ఘవచనములో (2–74) వనము; (2–75) సరస్సు వర్ణింపఁబడినవి.

**3. ప్రయాణము – అపశకునములు :**

మైరావణుఁడు శ్రీరామలక్ష్మణులను దెచ్చుటకై సూచీముఖ ఘటకులతో బయలుదేరి నపుడు దుశ్శకునము లిట్లు వర్ణింపఁ బడినవి.

కం॥ సురగాలి యెదురు వీఁచెను
వఱ డొక్కటఁ గూఁక వెట్టె – వసుమతి వణఁకెన్
ఉరగంబులు పొడచూపెను
హరిణసమూహంబు త్రోవ–కడ్డము దాఁటెన్

ఆ.వె. ఎడమనుండి పాల – కుడికి నేతెంచెను
బసిఁడికంటి వీచె – బయలు రొప్పె
విఱిగిపడియెఁ దరువు – దొరలుచు ధర మీఁద
గుండె లవియ మింటఁ – గొఱడు దోఁచె (2–3,4)

**4. యుద్ధవర్ణనము :**

రెండవ యాశ్వాసములో నాంజనేయ -మత్స్యవల్లభుల యుద్ధము; మూఁడవ యాశ్వాసములో మైరావణాంజనేయయుద్ధము సుదీర్ఘముగాఁ గన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినవి. (3-146) ఒక వచనములో యుద్ధభూమి బాణుని కాదంబరీశైలిలో వర్ణింపఁబడినది.

ఆరుద్రగారు చెప్పినట్లు - "అష్టాదశవర్ణనల్లో వీలైన కొన్ని మాత్రమే వర్ణించాడు. అన్నీ పులిమి కావ్యాన్ని చెడగొట్ట లేదు".

(స.ఆ.సా - 7సం - 32పుట.)

## చమత్కారములు

**1. మకుటనియమము :**

నన్నయగారు భారతము నందలి నాగస్తుతిలో 'మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్' (ఆది - 1-104...107) అను మకుటముతో నాలుగు పద్యములు రచించినారు. నన్నెచోడుఁడు కుమారసంభవములో 'దారిద్ర్యవిద్రావణా' (కుమార -10-90...99) యను మకుటముతో 10 పద్యములు రచించినాఁడు. అట్లే మాడయ్య కూడ మాతంగి మైరావణునకు శ్రీరాముఁ డవతారపురుషుఁ డని మత్స్య - కూర్మ - వరాహ - నారసింహ - వామన - పరశురామావతారములను వర్ణించు సందర్భములో 'రాముఁడుగా నెఱుంగుమీ' (మైరా - 1-144...149) అను మకుటముతో 6 చంపకమాలలు రచించినాఁడు.

ప్రబంధములో మకుట నియమముతోఁ బద్యములు చెప్పుట యొక చమత్కారమే కదా!

**2. కనుకట్టు విద్య:**

కం॥ మన లోన మనకుఁ గలహము
పెనుపంగా నేర్చు మిత్రభేదము పుట్టన్
ఎనమంద్రలోనఁ బదుగురఁ
గనుమాయల మొఱఁగి తివియఁ గా నేర్చు నిలన్ (మైరా - 1-123)

మైరావణుఁడు కనుకట్టు విద్యతో నెనమండుగురు లోపలి నుండి పదిమందిని మాయము చేయునఁట! ఇక్కడ మైరావణుని మాయాచమత్కారమే కాక మాడయ్య కవితాచమత్కారము కూడ వెల్లడి యగుచున్నది.



**3. సామెతలు :**

అందమైన సామెతలను యథాసందర్భముగాఁ బద్యములలోఁ బొదుగుట యొక చమత్కారము. ఇందు రెండు, మూఁడు సామెతలు గలవు.

హస్తిమశకాంతరము (మైరా 1-155)

తగరు చేరి కొండఁ దాఁకు భంగి (మైరా 2-20)

పాఱెడు బండ్లకుఁ గాళ్ళు సాఁచపఁగా (మైరా - 2-24)

ఈ సామెతను నాచనసోమనాథుఁడు (ఉత్తరహరివంశము 2-31) వాడినాఁడు. గట్టు ప్రభువు కుచేలోపాఖ్యానములోఁ గొన్ని వందల సామెతలు వాడినాఁడు. ఇది సామెతల పుట్ట.

**4. అల్పవస్తువు లధిక వస్తువులను జయించుట :**

సీ॥ అయ్యయో! మనరాజ - హవ్యవాహనులను
గాల్చెఁగా రాక్షస - కాననంబు
చెల్లఁబో! మనరాజ - సింహపోతంబుల
మట్టెగా దానవ - మత్తగజము
కటకట! మనరాజ - ఖగకులాధీశులఁ
గఱచెఁగా దైత్యోర -గంబు చెలఁగి
అక్కట! మనరాజ - హంసమండములఁ
గప్పెఁగా దైత్యాంధ - కార మెలమి
తే॥గీ॥ ఎంత కార్యంబు గల్గిన - నేటి కొక్కొ!
యమరపతికైన హరికైన - నజునికైనఁ
బూర్వకర్మానుభవములఁ - బొదల కేల
దప్ప దను మాట లిప్పుడు - తథ్యమయ్యె. (మైరా - 2-56)

మైరావణుఁడు శ్రీరామలక్ష్మణులను మాయతో మూర్ఛిల్లఁ జేసి యుక్కుపెట్టెలో బంధించి దొంగిలించి తీసికొని పోయినాఁడు. అప్పుడు సుగ్రీవుఁడు విభీషణునితోఁ బలికిన పలుకు లివి. ఇక్కడఁ గవి వాడిన రూపకములను గమనింపుఁడు -

శ్రీరామలక్ష్మణు లగ్నులు వంటి వారు. మైరావణుఁ డడవి వంటివాఁడు. మంట యడవిని గాల్చుట సహజము. అడవి మంటలను గాల్చుట విపరీతము. శ్రీరామలక్ష్మణు లను నగ్గి మంటలను మైరావణుఁ డను నడవి గాల్చినది. శ్రీరామలక్ష్మణు లను సింగపుఁ గొదమలను మైరావణుఁ డను మదించిన యేనుఁగు త్రొక్కినది. రామలక్ష్మణు లను గరుత్మంతులను మైరావణుఁ డను పాము కఱచినది. రామలక్ష్మణు లను సూర్యమండలములను మైరావణుఁ డను చీఁకటి గప్పినది. ఇక్కడ రూపకములను వ్యతిరేకముగా వాడి యల్పవస్తువు చేతిలో నధిక వస్తువులు చిక్కిన వని యొక చమత్కారమును సాధించినాఁడు.

ఈ పద్యవిద్యకు గురువులు తిక్కన – సోమనాథులు.

ఉ॥ అంచితతాలకేతుకిర – ణాళి మెఱంగులు గాఁగ మౌర్వి మ్రో
యించుట గర్జ చందముగ –నేచి విరోధదవానలంబు మా
యించు శితాస్త్రవర్షమున – నిట్టిది భీష్మమహాభ్రమె ట్లడం
గించెనొకో! శిఖండి యను – కృత్రిమవాయువు దాఁకి దైవమా!

(భీష్మ – 1–52)

ఇక్కడ భీష్ముఁడు పెద్దమేఘముగా శిఖండి నోటిగాలిగా రూపింపఁబడినారు.

సీ॥ కుజము కుంజరముచేఁ – గూలునో కూలదో
కూలు కుంజరమునీ – కుజము గూల్చె
మ్రాను పేరేటిచే – మడుఁగునో మడుఁగదో
మడుఁగు పేరేటినీ – మ్రాను మడిఁచెఁ
గాలునో యొకనిచేఁ – గాలదో సాలంబు
గాలునీ సాలంబు – గాల్చె నొకనిఁ
దునియునో పరశుచేఁ – దునియదో వృక్షంబు
తునియునీ వృక్షంబు – తునిమెఁ బరశు

తే॥గీ॥ వనుచుఁ దమలోనఁ జర్చించు – నమరవరుల
కభిమతార్థఫలార్థమై – యంద వచ్చు
పారిజాతంబు నామ్రోలఁ – బండి యుండ
నందఁ గంటి నాకోర్కుల – నందఁగంటి.

(ఉత్తరహరివంశము 2–176)

13



ఇది శివస్తుతి. ఏనుఁగు చెట్టును గూల్చుట సహజము. చె ట్టేనుఁగును గూల్చుట విపరీతము – వ్యతిరేకము. ఏనుఁగుచేఁ జెట్టు కూలునో కూలదో చెప్పలేము గాని శివుఁడను చెట్టు గజాసురుని గూల్చిన దని భావము. ఇట్లే నాలుగు పాదములు తెలియవలయును.

ఇక్కడ శ్రీవిశ్వనాథవా రీపద్యమును శ్రీకృష్ణపరముగా వివరించి మొదటి మూఁడు పాదములకు 1. కువలయాపీడకథ 2. కాళింది మడుఁగుకథ 3. యమళార్జున భంజనకథ చెప్పి నాల్గవ పాదమును వివరింపఁబోయి "యిచట నర్థము తెలియదు" (సాహిత్య సురభి – 121 పుట) అని యాత్మవంచన లేక నిక్కము వక్కాణించినారు. ఇది శ్రీకృష్ణుఁడు చేసిన శివస్తవము. పద్యమును శ్రీకృష్ణపరముగా నన్వయించుట యసందర్భము.

బ్రహ్మశ్రీ చదలవాడ జయరామశాస్త్రిగారు ముక్తాఫలవ్యాఖ్యలో శివపరముగా నన్వయించి 1. గజాసురసంహారము (కుజము – శివుఁడు; కుంజరము – గజాసురుఁడు) ; 2. గంగాబంధనము (మ్రాను – శివుఁడు; ఏఱు – గంగ); 3. మన్మథదహనము (ఒకఁడు – మన్మథుఁడు; సాలము – శివుఁడు); 4. దక్షయజ్ఞ – పరశురాక్షసనిర్వాసనము (పరశుఁడు – రాక్షసుఁడు; వృక్షము – శివుఁడు) క్రమముగా సూచింపఁబడినట్లు వ్యాఖ్యానించిరి. పద్య మంతట విషయ నిగీర్ణములచే నతిశయోక్తి. నాచనసోముఁడు సామాన్యకవి కాఁడు. అలికంబున నక్షిని డాఁచిన సర్వజ్ఞుఁడు. ప్రకృతము ననుసరింతము. ఈ మాదయ్య పద్య మనుకరణము గాదు. ప్రాచీపద్యము లందలి భావములకు మెఱుఁగు పెట్టి మహాప్రతిభచే సాధించిన యద్భుతచమత్కార శిల్పము.

## ఛందో విశేషములు

ఈ కావ్యములో నాంధ్ర సాహిత్యక్షుణ్ణములగు 1. చంపకమాల 2. ఉత్పలమాల 3. శార్దూలము 4. మత్తేభము 5. తేటగీతి 6. ఆటవెలఁది 7. సీసము 8. కందమునను సామాన్యచ్ఛందస్సులే కాక 9. మత్తకోకిల10. లయవిభాతి 11. తరలము 12. లయగ్రాహి 13. మాలిని 14. దండకమునను విశేషచ్ఛందములు వినియోగింపఁబడినవి.

**1. మత్తకోకిల :** (1–90); (1–91); (1–92); (2–109)

నీవు నాకును గల్గి యుండఁగ – నిష్ఠురాస్త్రచయంబుచే (1–90)

మత్తకోకిలవృత్తములోఁ బ్రతిపాదమునందు 'ర – స – జ – జ – భ – ర' యను గణము లుండును. 11వ యక్షరము యతిస్థానము.

శ్రావకాభరణాంక! విన్ రస – జాభరేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల – మంద్రు దీనిఁ గవీశ్వరుల్.

అని భీమకవి కవిజనాశ్రయము.

ఈ కావ్యములో 4 మత్తకోకిలలు గలవు.

**2. లయవిభాతి :**

వడిఁ గపికులాధిఁపుడు – జడియక చలంబునను –
జడచరునివాలమున – నడరఁగను మోఁదెన్ (2–84)

లయవిభాతిలోఁ బ్రతిపాదమునందు "న – స – న – న – స – న – న– స – న – న – స – గ"యను గణము లుండును. 10 –19–28 స్థానములలోఁ బ్రాసయతులను విధిగా వాడవలయును.

నసన నసనంబులును – నసన నసగంబులును
నెసఁగఁగృతిపాదముల – రసికతను జెప్పన్
గుసుమశరవత్సుభగ – యసదృశగుణా! వినుత
రస! లయవిభాతి యని – రసమసుకవీంద్రుల్.

అని భీమకవి కవిజనాశ్రయలక్షణము.

ఇది యుద్ధురమాలావృత్తము. పాదమునకు 34 అక్షరములు గలది.

**3. తరలము :**

చెనఁకి కొట్టుదు రెలమిఁ జేతురు – చేయి చేయియు వీడ్వడన్
బెనచి పట్టుదు రుదరఁ ద్రోతురు – భీమహుంకృతు లొప్పఁగన్
మొనసి పాయుదు రంటి దిగుతురు – ముష్టి ముష్టియు మీఱఁగన్
గినిసి తాఁకుదు రొండురున్ రణ – కేళి చిత్రము దోఁపఁగన్. (2–85)

తరల వృత్తములోఁ బ్రతిపాదమునందు 'న – భ – ర – స – జ – జ – గ' యను గణములుండును. 12వ యక్షరము యతిస్థానము.



ఈ పద్యములో నాల్గవ పాదమొక్కటి మాత్రమే గణబద్ధముగా నున్నది. 1–2–3 పాదములలో లయ సరిగా నున్నను గణములు సరిగాలేవు. గురువులుండవలసిన చోట రెండేసి లఘువులను వాడినాఁడు. తరలము నియతగణబద్ధవృత్తము గాని మాత్రాచ్ఛందము గాదు.

ప్రవరరుద్రవిరామయుక్తి నభంబులున్ రసజాగముల్
కవిజనాశ్రయ! పొంది యందముగా మహిం దరలం బగున్.

అని భీమన కవిజనాశ్రయలక్షణము.

రవిసుధాకరవహ్నిలోచని! – రత్నకుండలభూషణీ!
ప్రవిమలంబుగ మమ్ము నేలిన – భక్త జన చింతామణీ!
అవని జనులకుఁ గొంగుబంగా – రైన దైవ శిఖామణీ!
శివుని పట్టపురాణి! గుణమణి! శ్రీగిరిభ్రమరాంబికా!

అని యజ్ఞాతకవికృత మగు భ్రమరాంబికాష్టకము.

సిరులు మించిన పసిమి బంగరు – జిలుగు దుప్పటి జాఱఁగాఁ
జరణ పద్మము మీఁద దేహము – చంద్రకాంతులు దేరఁగా
మురువు చూపఁగ వచ్చినావో – మోహనాకృతి మీఱఁగా
గరుడవాహన! దనుజమర్దన! – కందుకూరి జనార్దనా!

అని కందుకూరి రుద్రకవి జనార్దనాష్టకము.

ఈ పద్యములు గూడ లయబద్ధముగా నున్నవి గాని గణములు సరిగాలేవు. కొందఱు కవు లిట్లు విశృంఖలముగాఁ బ్రవర్తించినారు.

**4. లయగ్రాహి :**

వెండియును రోషమునఁ – గొండల విధంబునను –
నొండొరులఁ జేరి తమ – మెండుగను వేల్పుం (2–86)

లయగ్రాహిలోఁ బ్రతిపాదమునందు "భ – జ – స– న – భ –జ – స – న – భ – య" గణములుండును. 9–17–25 స్థానములలోఁ బ్రాసయతులను విధిగా వాడవలయును.

ఇం బదరcగా భజస – నంబుల కదన్ భజస –

నంబులు భకారము నొ–దంబడి లయగ్రా

హిం బరcగc జెప్పు కల – శం బిడిన యట్ల యగ –

ణంబు కృతి మీcద నమ – రం బరహితార్థీ!

అని కవిజనాశ్రయలక్షణము.

ప్రబంధకవు లందఱు తమ ఛందః పాటవమును బ్రదర్శించుటకై యొక్క లయగ్రాహి నైనను దమ కావ్యములలో వాడినారు. 'సమీరకుమారవిజయ' మను మహాప్రబంధమును నిర్మించిన పుష్పగిరి తిమ్మన మహాకవి తిరువడాంబా శతకమును లయగ్రాహులతో నొకే ప్రాసముతో నిర్వహించినాcడు.

అంబరశిరోజ! కన – కాంబరచతర్ముఖుల –

కుం బరమసమ్మదక – రంబులగు నుద్యో

గంబు లొనరించి సక – లంబునకుc గారణమ –

నం బరcగియున్ హరున – కుం బదcతివై లో

కంబులను బ్రోచెదవు – పంబిన త్వదీయకరు –

ణం బొదము బుద్ధిని ని – నుం బొగడెదన్ హే

రంబజననీ! తిరువ – డాంబ! ముఖరమ్యశశి –

బింబ! పుషితాశ్రితక – దంబ! జగదంబా!

ఇందలి నాల్గవ పాదమంతయు మకుటము. దీనిలో 50 పద్యములు కలవు. ఇది శతకము గాదు. తిరువడాంబాపంచాశిక.

**5. మాలిని :**

సుకవిజనమహీజా – శుద్ధసత్కాంతిరాజా! (1–164)

మాలినీ వృత్తములోc బ్రతిపాదమునందు 'న – న – మ– య– య' గణములుండును. 9వ యక్షరము యతిస్థానము.

ననమయయుతంబై – నాగవిశ్రాంతమై యి

ట్లనుపమగుణ! మాలి – న్యాహ్వయం బయ్యె ధాత్రిన్.

అని కవిజనాశ్రయలక్షణము.



పెక్కుమంది తెలుcగు కవుల వలె మాదయ్య కూడ నీ కావ్యములో మూc డాశ్వాసముల చివర మూcడు మాలినీవృత్తములను నియమముగా వాడినాcడు.

**6. దండకము :**

శ్రీరాఘవేంద్రాంఘ్రిపంకేరుహస్ఫారభృంగా....నమస్తే నమః (3–132)

సాధారణముగాc దెలుcగు కవు లిచ్చ వచ్చినన్ని తగణములపై నొక గురువున్న దండకము గాని; రెండు నగణములపై రగణము లున్న దండకమును గాని వాడినారు. నన్నయ – పోతనాదులు తగణ దండకములను; శ్రీనాథ – నంది తిమ్మన – తెనాలి రామకృష్ణాదులు నగణములపై రగణములు గల దండకములను రచించినారు. మాదయ్య రచించిన యీ యాంజనేయదండకము నన్నయగారి శివదండకము వలెc దగణదండకము.

## యతి విశేషములు

**అఖండయతులు :**

చ॥ నను భయదాసురార్ణవము – నందు మునుంగక యుండc బ్రోచె (3–187)

ఈ పద్యపాదములో నఖండయతి గలదు. అప్పకవి యఖండయతి నంగీకరింప లేదు గాని మహాకవులందఱు నఖండయతులను వాడినవారే. ఆంధ్రమహాభారతము నందే యఖండయతులు గలవు. పరిష్కర్తలు దిద్దివేసిరి. కూచిమంచి వేంకటరాయని 'సుకవిమనోరంజనము' పరికించునది.

**యతిభంగములు :**

తే॥గీ॥ దనుజకులవార్ధిబాడబా – నలుcడు నగుచు (1–55)

ఇక్కడ యతిభంగము. సరియగు పాఠ మన్వేషణీయము.

మ॥ అనినన్ వాయుతనూభవుండు మదిలో – నాశ్చర్యముం బొంది య

త్యనుకంపన్ దగcజూచి యంతc గడు నా–శ్చర్యంబుతోc బల్కె (2–44)

ఇందలి రెండవపాదములో యతి తప్పినది. రెండుమాఱు "లాశ్చర్యంబుతో"నని కవి ప్రయోగించి యుండcడు. 'తాత్పర్యంబుతో' నను పాఠము శుద్ధపత్రికలోc గలదు. ఇదే సరియగు పాఠము.

ఉ॥ దీమసమెల్లఁ దక్కి తన - డెందము లోపల నుమ్మలించుచున్ (1-139)
ఇక్కడ యతిభంగము. 'డీమస' మని కవి ప్రయోగించియుండును.

**ప్రాసవిశేషములు:**

**ల - ళ ప్రాసము.**

కం॥ వాలమునఁ జుట్టి కొందఱఁ
గాళికి బలిద్రిప్పి నేల - గదియం గొట్టెన్ (3-12)
ల - ళ ప్రాసము నాంధ్రకవు లందఱు నంగీకరించిరి.
అప్పకవి దీని 'సభేదప్రాస' మని పేర్కొనినాఁడు.
మాడయ్య కవి రేఫ - శకటరేఫ పద్యములను విడివిడిగా రచించియుఁ గొన్నిచోట్ల సాంకర్యము గావించినాఁడు.

**ర ప్రాసములు :**

చ॥ సరసిజ - సురనిఖిల - స్ఫురిత - గురుమతి (1-7)
కం॥ నీరద - నీరజ - పారావార - పారాశర (1-10)
ఇట్టి పద్యములు పెక్కు గలవు.

**ఱ ప్రాసములు :**

కం॥ మఱియు - గఱకెక్కి - బఱపుటయు - తఱి (1-102)
కం॥ మఱియును - తఱచుగ - (క్ర)చ్చఱ - గుఱి (2-5)
చ॥ చఱచెను - కఱచెను - విఱిచెను - పఱచెను (3-104)

**ర - ఱ ప్రాసము (సాంకర్యము) :**

కం॥ సురగాలి - వఱదు - ఉరగంబులు - హరిణ (2-3)
ఆంధ్రభాషలో రేఫ - శకటరేఫ (ర - ఱ) నిర్ణయము పెద్ద గందరగోళము. మాడయ్య సీసపద్యముల చివర నియమముగాఁ దేటగీతులనే వాడినాఁడు.

**వ్యాకరణ విశేషములు :**

మాడయ్యకవి - అత్త్వసంధులు, ఇత్త్వసంధులు, క్త్వార్థసంధులు, తత్సమసంధులు, స్త్రీవాచకసంధులు, ద్రుతద్విత్వసంధులు మొదలగు వానినిఁ దన కిచ్చవచ్చిన నట్లు ప్రయోగించినాఁడు. వీనిని బాలవ్యాకరణ మంగీకరింపదు. ప్రౌఢవ్యాకరణము కొన్నింటి నంగీకరించినది. కొన్నింటికిఁ బ్రాచీనకవిప్రయోగములు గలవు. వానినిఁ బరిశీలింతము.





**1. అత్త్వసంధులు :**

పోకడ + ఎఱుంగక - పోకడెఱుంగక (1-13)
కోట + ఒక - కోటొక - (2-12)
రాక + ఎంత - రాకెంత (2-44)
చెమట + ఒదవ - చెమటొదవ - (2-46)

**2. ఇత్త్వసంధులు :**

ఒక్కటి + ఇంక - ఒక్కటింక (2-153)
ఒకటి + అప్పుడు - ఒకటప్పుడు (2 - 154)
కావలి + ఉండు - కావలుండు (2-156)
దీని + అందు - దీనందు (3-7)
కావలి + ఉన్న - కావలున్న (3-8)
కొలఁది + ఎఱుఁగ - కొలఁదెఱుఁగ (3-49)

**3. క్త్వార్థసంధులు :**

మరలి + ఇటకు - మరలిటకు (2-7)
ముంచి + ఎత్తి - ముంచెత్తి (2 -80)
పొడమి + అబ్ధి - పొడమబ్ధి (2 -98)
కలిగి + ఉండు - కలిగుండు (3-36)

సూ॥ క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు. (బాల - సంధి - 8) అని చిన్నయసూరి.
సూ॥ ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి (ప్రౌఢసంధి -2)
చాపమునాకందిమ్మనుడు (భార - విరా - 4ఆ - 112)
ఎఱింగెఱింగి నా వలువిది (భాగ - 9స్క - 515)
నీచేతఁ జెప్పంపఁడేఁప్రభా -4-146)
అని బహుజనపల్లివారు క్త్వార్థసంధి నంగీకరించినారు.
తే॥గీ॥ ఇడఁగ వచ్చును ల్యప్పుపై నిత్వసంధి (కవిసంశయ 1-14)
అని చెప్పి
కం॥ ఇతనికిఁ దగ నెల్ల పనులు నెఱిఁగించిపుడే (భార - ఉద్యో - 1-39)
అని భారతప్రయోగము నడిదము సూరకవి యుదాహరించినాఁడు.
'నమ్మీనమ్మక' (భార - శాంతి -2-351) అని తిక్కయజ్వ ప్రయోగించినట్లు

శ్రీచెళ్ళపిళ్ళవారు బహుధా నిరూపించినారు.

ఉ॥ విరోధు లాడు దుర్భాషణముల్ 'వినీవినని' భంగి (శృం.నై - 6-33)

అని శ్రీనాథుఁడు

చ॥ నియమితదుందుభిధ్వని 'వినీవినమిన్' (జైమిని - 4- 116)

చ॥ అని తన కూఁతుఁ దోడ్కొనుచు నల్లుని యింటికి నేఁగ మామఁజూ

చనలము లోన.... (జైమిని - 6 - 29)

అని పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి ప్రయోగించినారు.

ఇట్టి ప్రాచీనకవిప్రయోగములను గ్రంథపరిష్కర్తలు తమ కిచ్చవచ్చినట్లు దిద్దివేయుట మహాసాహసము.

చిన్నయసూరి కూడ సూత్రాంధ్రవ్యాకరణములో -

సూ॥ నక్త్వః. సూ॥ క్త్వాపి సవర్ణే దృశ్యతే. (సూత్రా - సంధి - 9,10సూ.) అని పాక్షికముగా నంగీకరించినాఁడు.

**తత్సమ - స్త్రీవాచకసంధులు :**

'భీతె' (1-115) భీతియే యని యుండవలయును. 'బీతె' యనవచ్చును.

జనని + ఎవ్వతె - జననెవ్వతె (2-89)

ఇట్టి సంధులను బూర్వకవులు క్వాచిత్కముగాఁ బ్రయోగించినారు.

చ॥ దనుజగృహీత సీతఁ దన 'దారని' క్రమ్మఱఁ దెచ్చియేలఁగన్. (జైమిని 6-29.)

కం॥ అని చదివి లవుఁడు రాఘవ

మనుజేశుని తల్లి 'వీరమాతఁట' (జైమిని - 6-115)

అని పినవీరభద్రకవి ప్రయోగించినాఁడు.

**5. ద్రుతద్విత్వసంధులు :**

కావన్ + ఒక్కఁడు - కావన్నొక్కఁడు (1-126)

కనుఁగొంచున్ + ఎదురైన - కనుఁగొంచున్నెదురైన (3-6)

ఎన్నఁడున్ + ఎఱుఁగ - ఎన్నఁడున్నెఱుఁగ (3-32)

మించినన్ + అతఁడు - మించినన్నతఁడు (3-64)

కరంబులన్ + ఉరము - కరంబులన్నురము (3-148)

ఈ ద్రుతద్విత్వసంధులు పోతనగారి కెక్కువ ప్రియమైనవి.

సూ॥ కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు



పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి. (ప్రౌఢ - సంధి -3)

సర్వమున్నతని దివ్యకళామయ మంచు (భాగ - 7స్క - 142)

నన్నయభట్టారకుఁడు - 'అన్నిష్టసఖినూఁదియున్నదాని' (భార - ఆది - 3 -140)

అని ప్రయోగించి 'లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య' అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్యసూచనార్థం బని యెఱుంగునది - అని ప్రౌఢవ్యాకరణము చెప్పినది.

శా॥ హంసీయానకుఁ గామికి న్నధమ (శ్రీనాథుని చాటువు)

శా॥ సుతుని న్నుద్యుక్తశాంతాత్మునిన్ (శివరాత్రి -1 -1)

చెప్పినన్నిద్ధరణీ (శివరాత్రి- 4-66)

అని శ్రీనాథుఁడును వాడినాఁడు.

కం॥ మిన్నుగ నకారహల్లుల

కున్నచ్చుల తోడ సంధిఁగూర్పఁగఁ జెల్లున్

పన్నగశయనుఁడు హరి యో

ర్చున్నఘములు భక్తు లైన సుజనుల కనఁగన్. (కవిసం - 4-1)

అని ముద్దరాజు రామన కవిజనసంజీవనిలో నంగీకరించినాఁడు.

**చ॥ వలనుగ నప్పురంబు ఘనవప్రసమున్నతి యర్కు తేరికిన్**
**అలవున దాఁట రామి.... (మైరా - 1-41)**

**ఉ॥ ఇత్తునె సీత భీతి నిటు లేటికిఁ బల్కెదు పంద కైవడిన్**
**ఇత్తతి రామలక్ష్మణుల.......(మైరా - 1-114)**

**కం॥ ఎవ్వరి తోడుతఁ జెప్పదు**
**నెవ్వరు గల రాప్తులిందు కెవ్వరు ముఖ్యుల్**
**ఎవ్వరు గలరీరాజుల.......(మైరా - 2-130)**

**ఉ॥ ఎవ్వరి దాన వీవు కమలేక్షణ! నిర్దయ నిట్టి సంకెలల్**
**ఎవ్వఁడు నీకుఁ బెట్టె.......(మైరా - 2-132)**

ఇట్టి తావులలోఁ బాదాంతము లగుటచే సంధి చేయక పోవుట దోషము కాదని యెఱుంగునది.

అందు వల్లనే చిన్నయసూరి -

సూ॥ వాక్యావసానంబున సంధి లేమి దోషంబు గాదని యార్యు లంద్రు.

(బాల - సంధి - 55) అని సూత్రించి

"అట్లు సంధి విరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడు" నని వివరించినాఁడు.

**6. కుషష్ఠి – నగాగమము**

పవన 'నందనుకండజ' నాథుఁడిట్లనున్ (2–89)

'పవననందనునకండజ' – అనియుండవలెను.

'ఉక్కు కైనను' బీరువోకుండఁదరిమి (3–4)

'ఉక్కునకైనను' – అని యుండవలయును.

సూ॥ కువర్ణకంబు పరంబగు నపు డుకార ఋకారంబులకు నగాగమం బగు. (బాల – తత్సమ – 28) అని చిన్నయసూరి.

ఈ నగాగమంబును గొందఱు మహాకవులు పాటింపలేదు. అందువల్లనే –

సూ॥ కువర్ణకంబు పరంబగు నపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులం దక్కఁ దక్కిన మహాకవిప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టదు. (ప్రౌఢ – శబ్ద –19)

ఉత్సవముకేఁగెదు (ఉత్తరహరి – 6–140); నిషధేంద్రు బచ్చుకున్ (శృ.నై –6–115) అని ప్రౌఢవ్యాకర్త చెప్పినాఁడు.

కవిత్రయప్రయోగములు గూడఁగలవు.

కం॥ గరుడాసీనునకు సిద్ధగరుడామరుకున్ (నృసింహ – 1–38)

చ॥ కనిన పదంబు ద్రిప్పఁగ జగత్పతి పద్మజుకైనఁ బాడియే (2–28)

అని యెఱ్ఱనగారి నృసింహపురాణము.

**7. నుగాగమము లేకపోవుట :**

**చ॥ మనుపనారత మబ్బయగోపధీమణిన్ (మైరా – 1–8)**

**ఉ॥ మీఱెంతయు నొప్పునట్టి సెలయేఱుల తోడి నగంబులోయనన్ (మైరా– 1–50)**

'మనుపు ననారతము' 'మీఱు నెంతయు' నని యుండవలెను.

సూ॥ ఉదంతమగు తద్ధరార్థ విశేషణమున కచ్చు పరమగు నపుడు నుగాగమం బగు. (బాల – సంధి –33) అని చిన్నయసూరి. కాని –

కం॥ నాలికఁ ద్రెంచుగ్రశరమునం దలఁద్రుంచెన్. (జైమిని –6–186)

అని పినవీరకవి ప్రయోగించినాఁడు.



**మ॥ అనుచుం దోడ్కొని పోవుచోఁ బవనజుం దా'పట్టణంబొప్పు' (మైరా –3–6) 'పట్టణంబు నొప్పు' అని యుండవలయును.**

సూ॥ షష్ఠీసమాసంబునం దుకార ఋకారముల కచ్చుపరమగు నపుడు నుగాగమంబగు (బాల – సంధి – 34) అని చిన్నయసూరి.

కాని యీ నియమమును బెక్కుమంది కవు లుల్లంఘించిరి. అందువల్లనే ప్రౌఢవ్యాకర్త

సూ॥ కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారమున కచ్చు పరంబగు నపుడు నుగాగమంబునకు లోపంబు నగు. (ప్రౌఢ – సంధి –10) అని సూత్రించి గోకుల మిల్లిలు (హరి – పూర్వ –5–203); బచ్చింట (పాండు –3–16); శిరసందము (కళా –7–126) మొదలగు కవుల ప్రయోగము లుదహరించినాఁడు.

ఉ॥ ఏమందము మందయాన మొగమందము మీఱు నవారవిందమున్ (విజయ 1–149)

అని చేమకూర వేంకటకవి.

**8. కొని – కాదేశము**

తెగఁ ద్రవ్వక' పోదు (మైరా –2 –19); రాజుల 'నెత్తుక' వోయెనో (మైరా –2–43) పదిల 'పఱచుక' వారిన్ (మైరా –2–64); కాళ్ళుంజేతులు 'పెనుచుక' (మైరా 3–13)

త్రవ్వకొని – ఎత్తుకొని – పఱచుకొని – పెనుచుకొని – సాధువులు.

కం॥ ఉరమేసినఁ జుట్టుక పడె (జైమిని –3–103) ప్రాణజుఁ డెత్తుక చన (జైమిని –8–24)

అని పినవీరభద్రుఁడు వాడినాఁడు.

చ॥ పరిణయవేళ యందుఁ దన పాదము పట్టుక (అప్ప –1–21)

అని యప్పకవి వంటి లాక్షణికుఁడే ప్రయోగించినాఁడు.

నేఁటి వాడుకలో – 'ఎత్తుకు – పట్టుకు – చుట్టుకు ' అని కాకు బదులు 'కు' వినఁ బడుచున్నది.

**9. పకారాదేశము లేకపోవుట :**

భావించఁగ (మైరా 1–123); కోపించఁగ (2–126); నుతించఁగ (3–157) ఇవి మార్పరాని ప్రాసస్థలములలో నున్నవి.

సూ॥ ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగు నపుడు

పవలగు (బాల – క్రియా –88) అను చిన్నయసూరి సూత్రము ననుసరించి – 'భావింపఁగ' – 'కోపింపఁగ' – 'నుతింపఁగ' – అను రూపములు సాధువులు.
సూ॥ కవిత్రయేతరప్రయోగంబులం గొన్ని యెడల నిప్రత్యయాదులు పరంబుల లగు నపుడు పకారం బించుక్కకారంబున కేనిఁ గానఁబడదు. (ప్రౌఢ – క్రియా –16)

కం॥ సాధించుట కెవ్వారిని బోరించని(కళా –2–4)
కం॥ ఊహించ నొక నాల్గు గడియల సంచారము (కళా –3–65)

అను ప్రౌఢవ్యాకరణము ననుసరించి మైరావణప్రయోగములు సాధువులే.

కం॥ మించి మదించిన రిపుల హ
రించక సత్కీర్తి యీమహీతల మెల్లన్
నించక దీనుల దయఁ బో
షించక ప్రఖ్యాతి గల్గునే నరనాథా (దశకుమారచరిత్రము)

అని లింగమగుంట తిమ్మకవి సులక్షణసారము.
ఇక్కడ నొక్క విషయము గమనింపవలయును–
"హల్లకాస్త్రారిదారిన్ గ్రసించన్ హృషీకేశతాసక్తి రక్షించ....ఘటించన్... నటించన్... క్రీడించ... (సమీర –4–145)
అని పుష్పగిరి తిమ్మనగారు నిరోష్ఠ్యదండకములో వాడుకొనినారు.
ఇక్కడఁ బరిష్కర్తలు బాలవ్యాకరణము ననుసరించి 'గ్రసింపన్' 'రక్షింప' 'ఘటింపన్', 'నటింపన్' 'క్రీడింపన్' – అని దిద్దివేసినారు. కవి నిరోష్ఠ్య నియమము భంగమైనది.

"మొర్రో నేను నిరోష్ఠ్య (కందం?) దండకం రాస్తున్నాను అని కవి మొత్తుకున్నా సరే పరిష్కర్తలు దిద్దిపారేశారు. ఈ దండకంలో పరిష్కర్తల పకారాలు చాలా అపకారాలు చేశాయి. చిత్రకవిత్వం లోని నియమాలు ఉల్లంఘిస్తున్నప్పుడైనా తాము వ్యాకరణదోషా లను కొనే వాటిని పరిష్కర్తలు దిద్దకుండా ఉంటే బాగుండేది" (సమగ్ర. ఆం. సా. 10 సం. 150 పుట) అని యారుద్రగారు వాపోయినారు.

**10. చేయు – చేతును:**

ప్రార్థనము సేతు (మైరా –1–11); ఎలమి చేతురు (2–85); చేతు నొక్కొ (2–123)
చేతును – చేతురు – 'చేయుదును – చేయుదురు' అని యుండవలయును.
సూ॥ చువర్ణంబు తోడ దుగ్దకారంబు తకారం బగు (బాల – క్రియా –108)



చేతురు – కోతు రిత్యాదు లసాధువు లని యెఱుఁగునది – చిన్నయసూరి.
కాని యిట్టి వానికిఁ గవి ప్రయోగములు గలవు.
మ॥ సంక్షోభింపఁగాఁ జేతుఁ గట్టలుకన్ (భార –విరా –2 – 281)
చ॥ దోర్బలము డాఁపక పోరెదు నేమిసేతు (భార – భీష్మ –2 – 7)
తే॥ చేరి చుంబించి మోహింపఁ జేతు రనిన (శృ.నై. 2–88)
మ॥ తనరారన్ నుతి సేతు సేతు హిమవత్ (రసికజన –1–10)
కం॥ చేతును జేయుదును నాఁగఁ జెలువొప్పు హరీ (గణపవరపు వెంకటకవి – ద్విరూపకోశము) అని శ్రీ చెళ్ళపిళ్ళవారి పాశుపతము.
ఉ॥ ఊహలు సేతు రెందయిన......(ఇందుమతీ 1–15)
తే॥ డంబు చేతనె వాగ్బంధనంబుఁ జేతు (ఇందుమతీ 3–135)
అని తెనాలి రామభద్రకవి యిందుమతీ పరిణయము.

**11. ఉత్తమపురుషములో నకారలోపము :–**

చ॥ మెచ్చితింక మది (మైరా –2–148) – 'మెచ్చితి నింక' –అని యుండవలెను.
'సేవించి తచ్యుతుని – సేవించితి నచ్యుతుని' – అని యహోబలపండితుఁ డంగీకరించినాఁడు.

తే॥గీ॥ దొరయఁగాఁ గూర్చి కవిసమ్మతులను 'వ్రాయు
దుక్త' లక్ష్యాస్పదంబు లాంధ్రోక్తు లెనయ.

అని తిమ్మనకవి సులక్షణసారము.

**12. ఒప్పన – వొప్పన**

కం॥ ఈ వేళఁ దెచ్చి కాళిక
కే వొప్పన చేతుఁ దలఁక కిమ్ములఁ దరుణీ (మైరా –1–14)
ఇది ప్రాసస్థలములో నున్నది. 'వొప్పన' సాధువు గాదు.
సూ॥ యకారంబును వు వూ వొ వోలును దెలుఁగు మాటలకు మొదట లేవు. (బాల – సంజ్ఞా –17) అని చిన్నయసూరి సూత్రము.

**ఒల్లను – వల్లను :**

**ఉ॥ ప్రాణముల్ । వల్లను నంగదుం గొనుచు వారిధి మెల్లనె (మైరా–2–60)**
**ఇక్కడ నారుద్రగారు –**

ఇందులో 'ఒల్లను' (వల్లను) అనే మాట దిద్దడానికి వీలు లేని యతిప్రాసస్థానంలో

ఉంది. అందుచేత మైరావణచరిత్రను సంస్కరించిన పండితులిలా వ్రాశారు. 'ఇందు వలచు ధాతువునకు వ్యతిరేకము నందు 'ఒల్లను' అని ప్రయోగింపవలసి యుండఁగా 'వల్లను' అను గ్రామ్యరూపము వాడఁబడినది.' అయితే 'వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాష నగు' అని చిన్నయసూరి సూత్రించాడని మఱచిపోకూడదు. (బాల – క్రియా –107). 'ఒల్ల' రానప్పుడు 'వల్ల' రావచ్చునని విస్మరిస్తేనే ఇది గ్రామ్యరూప మనుకోడం జరుగుతుంది." (సమగ్ర –7సం – 40 పుట) అని తమ వ్యాకరణ పాండిత్యమును బ్రదర్శించినారు.

వీరికీ బాలవ్యాకరణసూత్ర మర్థము కాలేదు.
తెలుఁగులో 'వలచు' ధాతువు గలదు గాని 'ఒల్ల –వల్ల' ధాతువులు లేవు.

ఈ ధాతువులే యున్నచో నీ సూత్రము చెప్ప వలసిన యవసరము లేదు. వలచు ధాతువునకు వ్యతిరేకములో 'ఒల్ల' విధించినాఁడు గాని 'వల్ల' ధాతువునకుఁ గాదు. 'ఒల్ల' రాని పక్షములో 'వలవను' అను రూపమే యుండును. ఒల్లకు రూపములను సూరియే ప్రదర్శించి 'పక్షంబున వలవఁ డిత్యాది' –అని వివరించినాఁడు.

బాలవ్యాకరణ పేటికా వ్యాఖ్యలో –
'ఒల్లాదేశమురాని పక్షమున 'వలవఁడు – వలవరు; వలవదు – వలవవు; వలవవు – వలవరు; వలవను – వలవము; వలవమి – వలవని" – అని శ్రీదూసి రామమూర్తిశాస్త్రిగారు వలచుధాతురూపముల నన్నింటిని జూపినారు.
కావున నారుద్రగారి సమర్థనము సరియైనది గాదు.
'వొప్పన – వల్లను' – అను ప్రయోగములు గ్రామ్యములే.

**13. తోడ – తోడుత :**
చ॥ హర్షము తోడుత వచ్చి యెంతయున్ (మైరా –1–28)
మాడయ్య 'తోడ' విభక్తికిఁ 'దోడుత' నను రూపములను సుమారు 16 తావులలోఁ బ్రయోగించినాఁడు.
సూ॥ ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబు గలదు. అయినను దానికి వలె దీని కితర కార్యంబు గలుగదు. (ప్రౌఢ – కారక –8)
చ॥ పగతురచేతిలోఁ బడక ప్రాణము తోడుత నున్నవాఁడవే. (భాగ –10స్క – పూర్వ – 1756)



అని శ్రీ బహుజనపల్లివారు తెలిపినారు.
ఉ॥ శివభక్తి పరాయణుఁ డర్థి తోడుతన్ (హర – 2–54)
ఉ॥ రాజ్యరమావిభూతి కౌద్ధత్యము తోడుతన్ (జైమిని –1–56)
తే.గీ॥ బార్య తోడుత నసిపత్త్రవ్రతముఁ బూని (జైమిని –1–78)
అని శ్రీనాథుఁడు, పిల్లలమఱ్ఱికవి కూడఁ బ్రయోగించినారు.

వ్యాకరణ విషయములోఁ బోతనగారి భాగవతము నాదర్శముగాఁ గైకొనినవాఁడు పినవీరభద్రకవి. అందువల్లనే బహుజనపల్లివారు –
"పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు : ఇతఁడు గొప్పకవి. ఇతని కవిత్వము మిక్కిలి శ్లాఘ్యముగానే యున్నది. అయిన నితఁడు బమ్మెరపోతన మతము నవలంబించినాఁడు" అని శబ్దరత్నాకర పీఠికలో వ్రాక్రుచ్చినారు.
పోతన – పినవీరన కవుల నొరవడిగాఁ బెట్టుకొన్న వాఁడు మాడయ్యకవి.

**14. విభక్తివ్యత్యయము : తృతీయకు ద్వితీయ :**

నిన్నుఁ బోరుటకు ... (1–96)

నీ తోడఁబోరుటకు.

మత్త॥ మున్నెఱుంగక బేలనై కదు – మూఢభావము తోడుతన్
నిన్నుఁ బోరితి..... (మైరా –2 –109)
నిన్నుఁ బోరితి – నీతోడఁ బోరితి నని యర్థము.
ఇక్కడఁ దృతీయకు ద్వితీయ వాడఁబడినది.
ఇది యీ క్రింది నన్నయగారి ప్రయోగము వంటిది –
కం॥ విదితముగ నిన్నుఁ జేయిం
చెదఁ గ్రతువు ధరాధినాథ....(భార – అరణ్య – 3–189)
నిన్నుఁ జేయించెద – నీచేతఁ జేయించెద నని యర్థము.

**15. నేత్రి – గాత్రి**
ఉత్ఫుల్లసరోజనేత్రి (మైరా – 3–138)
స్త్రీవాచకముగా నేత్రశబ్దమునకు జీప్రత్యయము వచ్చుట యపాణినీయము.
అంగాదులకు దప్ప సంయోగోపధంబులకు జీప్రత్యయంబులేమింజేసి
'మీననేత్రి' – పద్మనేత్రి – ఇద్యాదు లసాధువులు (బాల – తత్సమ – 85) అని చిన్నయసూరి.

ఇవి యపాణినీయములు గాని యసాధువులు గావు. సారస్వతవ్యాకరణ మంగీకరించినది. మఱి కొందఱు ప్రాచీనకవులు వాడినారు.
తే॥గీ॥ పద్మదళనేత్రి! ప్రౌఢభూపాలపుత్రి! (శ్రీనాథుని చాటువు)
మ॥ ధృతిమై నుత్తమకన్య యంద్రు మృగనే-త్రిం గన్న యాతంద్రియున్.
(వీరభద్ర -2-22)
కం॥ భీష్మకవరపుత్రిన్ నుతచరిత్రి వారిజనేత్రిన్. (భాగ -10-2-244)
మాదయ్యకవి ప్రయోగము యతిస్థానములో లేదు. 'సరోజనేత్ర' యన్నను సరిపడును. కాని కవిప్రయోగము దిద్దఁగూడదు.
అధికము దీపాలవారి భాగవతపాఠ పరిశోధనలో ననుసంధేయము.
తే॥గీ॥ వేఁడి? గంధర్వభుజగేంద్ర విబుధయక్ష
సిద్ధవిద్యాధరాసురస్త్రీకదంబ
సురుచిరస్ఫారమంగళసూత్రగాత్రి (మైరా -3-141)
ఇది మైరావణునకు విశేషణము. 'సూత్రగాత్రు'ఁ డనుటకు 'సూత్రగాత్రి' యని వాడినాఁడు.

## శబ్దవిశేషములు

**1. ప్రౌఢిమ :**

**చ॥ అతివిస్ఫుటలక్షణరూఢిఁ బ్రౌఢిమన్ (మైరా -1-22)**

**శా॥ విద్యాప్రౌఢిమ తోడ... (మైరా -1-74)**

సూ॥ ముగ్ధిమాది ష్విమనిఙ్ మృగ్యః (కావ్యా -5-2-24)
ముగ్ధిమా - ప్రౌఢిమేత్యాదిషు 'ఇమనిఙ్' మృగ్యః అన్వేషణీయ ఇతి॥
అని వామనాచార్యుని కావ్యాలంకారసూత్రము.
ముగ్ధ - ప్రౌఢ శబ్దములపై 'ఇమనిచ్' ప్రత్యయము రాదు.
ప్రౌఢి - సాధువు. ప్రౌఢిమ - అసాధువు. కాని యనేక కవిప్రయోగములు గలవు.
శా॥ గంభీరవాక్ప్రౌఢిమన్ (శృ.నై. 1-12); దండ ॥ ప్రౌఢిమాఢౌకమానేన. (శృ.నై. 1-138); శా॥ అత్యద్భుతప్రౌఢిమన్ (శృ.నై 5-142); మ॥ అంహోభంజనప్రౌఢిమన్ (భీమ - 4-25); శా॥ స్ఫీతధ్వని ప్రౌఢిమన్ (భీమ -4-148) శా॥ కటాక్షాలోకనప్రౌఢిమన్ (హర - 4-36); మ॥ ముద్రావిభ్రమప్రౌఢిమన్ (హర - 5-53); శా॥ దివ్యాయుధోదారప్రౌఢిమ (హర -7-146) అని శ్రీనాథుఁడు పుంఖానుపుంఖముగాఁ బ్రయోగించినాఁడు.



సీ॥ భార్గవగార్గ్యగీష్పతిమతిప్రౌఢిమ (క్రీడా -12)
మ॥ పాంథవనితల్ గర్జావచః ప్రౌఢిమన్ (క్రీడా -60)
మ॥ కవితాప్రౌఢిమ లేని యజ్ఞులు వృథా గర్వాంధు లే లౌదురో? (విక్ర -1-16)
కం॥ చతురామ్నాయప్రౌఢిమ (ప్రబోధచం -1-10)
తే॥గీ॥ పాటలీచంపకోత్పలప్రౌఢిమములు (పారి -3-46)
మ॥ సరసవాచాప్రౌఢిమల్ మీఱఁగన్ (మను - 3-74)
తే॥గీ॥ గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢిమమున (ఆముక్త -4-98)
శా॥ సాహిత్యస్ఫురన్మాధురీ చారుప్రౌఢిమ (కాళహస్తి -3-167)
సీ॥ వచ్చె నౌరా యని వరగుణప్రౌఢిమ (నిరంకుశో -2-4)
సీ॥ పౌలస్త్యనిరసనప్రౌఢిమాఢౌకితంబు (కావ్యాలంకార -1-83)
మ॥ అలఘుప్రౌఢిమ నీదు దాన విభవం బాలించి (కావ్యాలంకార -5-9)
శా॥ నిర్వక్రప్రౌఢిమ విన్నవింతు (వసు - 1-193)
సీ॥ గంభీరరసగుంభసంభృతప్రౌఢిమ (వసు - 2-106)
ఆ.వె॥ ప్రౌఢిమహిమభానుకులుఁడ (రాఘవపాండ -1-30)
శా॥ దైవద్వీపవతీసమత్సరవివాదప్రౌఢిమానర్గళ (కళా 2-144)
తే॥గీ॥ సారస్వతప్రౌఢిమార్ధి (కళా -3-102)
శా॥ మదనశాస్త్రప్రౌఢిమాభిజ్ఞుఁడై (ఇందుమతీ -4 -44)
కం॥ చేతః ప్రౌఢిమఁ జెప్పిరి (అప్పకవి - 1-59)

అని వల్లభరాయ - జక్కన - నందిమల్లయఘంటసింగయ - నంది తిమ్మన - పెద్దన - శ్రీకృష్ణదేవరాయ - ధూర్జటి - కందుకూరి రుద్రకవి - రామరాజభూషణ - పింగళిసూరన - తెనాలిరామభద్ర - అప్పకవి ప్రభృతిమహాకవులు ప్రయోగించిరి.

ఈ ప్రయోగములకు మూలము.

శ్లో॥ ఇంధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచండానల
ప్రౌఢిమ్నా బహులీకృతే నిపతితం సంతాపచింతాకులమ్
(మూకపంచ - మందస్మిత -94)

అను మూకశంకరుల పంచశతీశ్లోకము. దీనిని మొట్టమొదటఁ బసికట్టిన వారు శ్రీచెళ్ళపిళ్ళవేంకటశాస్త్రిగారు.

శ్లో॥ యస్మిన్నాద్య స్స జయతి రసః ప్రౌఢిమా కోప్యసీమా (సరస -4)

అని సరసకవికులానందభాణములో వెల్లాలరామచంద్రకవి ప్రయోగము కూడఁ గలదు.

**2. చంగలించు :**

తే॥గీ॥ చన్నుఁగవమీఁదిపయ్యెద – చంగలింప (మైరా –1–60)

'చెంగలించు' – అను దానికిఁ 'జంగలించు'నని యతిస్థానములోఁ బ్రయోగించినాఁడు. దీనిని శబ్దరత్నాకరము స్వీకరించినది.

**3. నాసికము :**

ఉ॥ భూవర యిట్లు నాసికము పోయిన (మైరా –2–21)

కం॥ ఘటనాసికు నాసిక ముత్కటముగ (మైరా –3–45)

నాసా – నాసికాశబ్దము లాకారాంతస్త్రీలింగములు. ఇక్కడ నపుంసకలింగములుగా వాడఁబడినవి.

సూ॥ కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు (బాల – తత్సమ –66)

కంధరము – కంధర. విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు. విధము.

కంధరా – నాసికా – భిక్షా – దంష్ట్రా – గ్రీవా – పాదు – కోల్కాప్రభృతులు – కంధరాదులు.

అని సూరిగారు చెప్పుటచే నివి సాధువులు.

**4. వివరము :**

వ॥ సూచీముఖఘటకుల రావించి యవ్వివరం బెఱింగించి (మైరా –2–2)

'వివరము' సంస్కృతశబ్ద మైనచో 'రంధ్ర'మని యర్థము.

దేశ్య మైనచోఁ బూర్తివిషయము (వివరణము) అని యర్థము.

అది వివరముగాఁ జెప్పు మని లోకవ్యవహారము.

**5. పరిణయము :**

కం॥ దశరథసుతు లేపరిణయమున నుండుదురో (మైరా –2–30)

'పరిణయము = వివాహము, పెండ్లి' యని శబ్దరత్నాకరము.

ఇక్కడ – 'విధము, భద్రము' – అనునర్థములో వాడఁబడినది.

**6. బారి :**

బారి తిరుగంగ నేఁగెద (మైరా –2–33)

'బారి = ఏనుఁగు గొలుసు; నిర్బంధము, హింస, దారి' యని శబ్దరత్నాకరము.



ఇక్కడ ప్రహరి (తిరుగు) – అనునర్థములో వాడఁబడినది.

**7. తండము :**

**వ॥ కొదమకోకిలతండంబులకు నాలవాలంబై (మైరా –2–74)**

తండము. దేశ్యశబ్దము. సమూహము, గుంపు – అని యర్థము.

ఇది కన్నడభాష నుండి వచ్చిన దేశ్యము. శబ్దరత్నాకరములో లేదు. సూర్యరాయ నిఘంటువు గ్రహించినది.

తిక్కనాదులు విడిగా వాడినారు. శ్రీనాథుఁడు సంస్కృత సమాసములో బిగించినాఁడు.

తే॥గీ॥ విమలడిండీరఖండతండముల తోడ (భీమ –4–175)

తటివద్ద కంకాళతండంబులును (కాశీ –3–138)

'తండతండములు', 'తండోపతండములు' – అని కావ్యములలో లోకవ్యవహారములోఁ గలదు.

**8. నిశి :**

**చ॥ నిశి గొని భద్రకాళికిని – నిండిన భక్తిని (మైరా –2–125)**

నిశి = రాత్రి, చీఁకటి. నిశా – నిశీథ –నిశీథినీ శబ్దములు గలవు.

నిశి యనునది శబ్దరత్నాకర – సూర్యరాయనిఘంటువులలో లేదు. లోకవ్యవహారములోఁ గలదు. నిశివేళ.

తే.గీ. చిన్నవయసున గొనముల తెన్నుఁగనమి
పేరు 'శశివర్ణు'ఁడని తండ్రిపెట్టెఁగాని
గొనములను గాంచ 'నిశివర్ణు'ఁడనుచుఁబిల్వఁ
దగియెనాతండు కర్మవిధంబులెట్లొ!

అని మహాదేవకవి సూతసంహిత (సూత – ముక్తి – 172)

**9. పద్దెనిమిది :**

**కం॥ ఘోరదైతేయులఁ బద్దెనిమిది కోటుల (మైరా –2–156)**

'పదునెనిమిది' – అనునది గ్రాంథికరూపము. సంఖ్యావాచకములకు వ్యావహారికరూపములను గొందఱు కవులు వాడుచున్నారు.

మ॥ ఇరువై నాలుగు మూళ్ళ – శ్రీనాథుఁడు (కాశీ –1–53)

కం॥ నూటిరువై యెనిమిది – భట్టుమూర్తి (కావ్యాలంకార –2–50)

సీ॥ క్రింది పందొమ్మిదో ఛందమునను – అప్పకవి చక్రబంధలక్షణము (4–399)

**10. భిక్షకుఁడు :**

**సీ॥ చంద్రశేఖరుని భి–క్షకునిఁజేసి (మైరా –3–52)**

అని యతిస్థానములోఁ గలదు. భిక్షు – భిక్షుకశబ్దములు ప్రచలితములగుటచే 'భిక్షక' శబ్ద మసాధువని కొందఱు భ్రమింతురు.

'భిక్ష – భిక్షాయా మలాభే లాభే చ' – అను ధాతువునుండి 'భిక్షణ'మను రూప ముత్పన్నమగుటచే 'భిక్షకుఁడు' కూడ సాధువే.

"కృత్సు – భిక్షకః – భిక్షికా; భిక్షః – భిక్షా; భిక్షాకః – భిక్షుః'।

అని బృహద్ధాతుకుసుమాకరము.

**11. కైవారము :**

వ॥ వందిజనకైవారంబును (మైరా 3–56)

కైవారము – కయివారము (త.కైవారమ్) – స్తోత్రము, పొగడ్త. అని సూర్యరాయ నిఘంటువు.

కైవారము – తమిళము నుండి వచ్చిన దేశ్యము. అచ్చుకన్నడశబ్ద మని కన్నడ నిఘంటువులు.

సీ॥ మొనల కైదువు వాఁడు మినుకు కైవారముల్
మెచ్చువాఁ డని బీర మెచ్చు వాఁడు (అచ్చ. రామా –1–13)

అని కూచిమంచి తిమ్మకవి యచ్చతెనుఁగు రామాయణము.

పోతన – శ్రీనాథులు దీనిని సంస్కృత సమాసములోఁ గూడ వాడినారు.

వ॥ భూరికీరకైవారనిజగుణాలంకారుండును. (వీరభద్ర – 2–95)

తే॥గీ॥ వందిమాగధసూతకైవారరవము (భాగ –10స్క –2–671)

మ॥ మీ కైవారదుర్భాషణంబులకున్ (శృం.నై. 7–89)

సీ॥ భారతీదేవి కైవారవాక్యంబులు (కాశీ–6–57)

కం॥ కైవారపదానుసారకమనీయముగా (హర –6–9)

వైరిసమాసములు పోతన – శ్రీనాథులకు సమ్మతములే. తెలుఁగుకవు లందఱు నెక్కువగానో తక్కువగానో వైరిసమాసములు వాడినవారే.

మాదయ్య 'పుడమీశ' (మైరా –1–84) మొదలగు వానిని వాడినాఁడు. పరిష్కర్తలు 'పుడమిదొర'యని దిద్దినారు.



దీనిని గూర్చి యారుద్రగా రిట్లు చెప్పినారు–

"మాదయ్య ఈ కావ్యంలో 'పుడమీశుడు' అనే ప్రయోగాలు పద్దెనిమిది చేశాడు. కొన్ని లక్షణవిరుద్ధా లని పరిష్కర్తలు దిద్దేశారు. "ఇందు 'పుడమీశ' యనునది గ్రామ్యరూపము. పుడమిశబ్దము సంస్కృత మను భ్రాంతిచే నీశశబ్దముతో సవర్ణదీర్ఘమునఁ గలుపఁబడినది. ఇట్టిచోట్ల మేము 'పుడమిదొర' యని సవరించుచు వచ్చితిమి. విశేషముగ మార్పు చేయ నక్కర లేకుండ దిద్దుటకు వీలున్నచోట్ల నిట్లే మరికొన్ని సవరింపఁబడినవి." అని పరిష్కర్తలు చెప్పారు. పండితులు దిద్దిన అసలు పాఠాలు దొరికితే 'అఖిలకావ్యలక్ష్యసాగరం వ్రాసిన వాళ్ళు సహితం ఒకనాడు వాడే అపురూప ప్రయోగాలు మనకు దక్కేవి.." (స. ఆ.సా – 7సం – 41పుట) నిజమే. కవి ప్రయోగము లెట్టివైనను బరిష్కర్తలు దిద్దుట తప్పే.

**12. వేఁడి – ఏఁడి? :**

సీ॥ వేఁడి? పురందరు వేయు మాఱులు దాఁక
నాజిఁ బోఁ దరిమిన యవఘళుండు
వేఁడి? కృతాంతు ముప్పేట్టి కింకరులతోఁ
బనిగొన్న యసమాన భవ్యయశుఁడు
వేఁడి? పయోధిపు వినుత భూషణములు
కానుకఁ గొన్న శృంగారమూర్తి
వేఁడి? కుబేరు దుర్విక్రమం బెడలించి
పురిఁ జూరవెట్టిన భూరియశుఁడు

తే॥గీ॥ వేఁడి? గంధర్వభుజగేంద్ర విబుధయక్ష
సిద్ధవిద్యాధరాసురస్త్రీకదంబ
సురుచిరస్ఫారమంగళసూత్రగాత్రి
వేఁడి? జయశాలి నా ప్రాణవిభుఁడు వేఁడి? (మైరా –3–14)

ఈ 'వేఁడి' యను ప్రయోగము మాదయ్య మహాభారత ప్రౌఢప్రయోగమర్మజ్ఞతకు దర్పణము. ఈ పద్యములో 'వేఁడి' యనునది యతి స్థానములో 7 మాఱులు ప్రయోగింపఁబడినది.

వేఁడి – ఏఁడి యను దానికి రూపాంతరము. ప్రౌఢవ్యాకర్త దీనికై ప్రత్యేక సూత్రము రచించినాఁడు.

సూ॥ ఆ ఈ శబ్దములకును; ఏ శబ్దమునకును మహదర్థంబున నన్ని విభక్తుల యందును వకారంబు నిత్యముగాను, వైకల్పికముగాను; అమహదర్థంబునం బ్రథమేతర విభక్తుల యందు వచనద్వయంబునం దకార వకారంబులు నిత్యముగాను బూర్వాగమంబులగు (ప్రౌఢ –శబ్ద – 53)

వాఁడు – వారు; వీఁడు – వీరు, వేఁడు – ఏఁడు; వేరు – ఏరు; వేనిన్ – ఏనిన్; వేరిన్ – ఏరిన్; వేనిచేతన్ – ఏనిచేతన్ మొదలగునవి. వేఁడు – ఎవఁడు.

తే॥గీ॥ వీరిలో ముఖ్యు లెవ్వారు? వేఁడు రాముఁ
డతని యనుజన్ముఁ డెట్టివాఁ డనుచుఁ బలుక (రామా –7–192)

ప్రౌఢవ్యాకరణమునందు శబ్దరత్నాకరమునందు రామాభ్యుదయ ప్రయోగ మొక్కటియే చూపఁబడినది. అనేక ప్రయోగములు గలవు.

కం॥ పార్థుఁడు వేఁడీ? పొదువుదు (భార – ద్రోణ –3ఆ –46)
కం॥ వేరీ? ధరణిపు లల్లయ (కాశీ –1–47)
కం॥ సరి వేరీ? జలరాశివేష్టితమహీ – చక్రంబునన్ (కాశీ –1–54)
శా॥ వేరీ? ని న్నెదిరింపఁగా జగమునన్ – వీరుల్ (హర –7–146)
తే॥గీ॥ విద్యమాననృపాళిలో – వేరు సాటి. (ఇందుమతీ –1–64)
వేరు – ఏరు – ఎవరు.

ఆ.వె॥ భామలార! రండు నాముద్దు తనయుండు
వేఁడి? వేఁడి? యనుచు వేఁడి వేఁడి
వేఁడి వేఁడి నీరు వెడఁద కాటుక కంటి
కొలుఁకు లండ మాటి కొలుకుచుండ (సారంగ –3–79)

అని చేమకూరవారి సారంగధరచరిత్రము. ఇది సారంగధరునకై రత్నాంగి విలాపము. నా ముద్దు తనయుండు; వేఁడి? వేఁడి? = ఏఁడీ? ఏఁడీ?; వేఁడి వేఁడి = ప్రార్థించి ప్రార్థించి; వేఁడి వేఁడి నీరు = వెచ్చవెచ్చని యశ్రువులు. తక్కినది సులభము.

**13. కొన్ని వింత ప్రయోగములు :**

**కం॥ చేరకు 'పాతివ్రత్యల' (మైరా –3–162)**

'పతివ్రతల' నని యుండవలయును. పతివ్రత యొక్క భావము పాతివ్రత్యము. 'సత్యరహితుఁ' డను దానికి 'సత్యరాహిత్యుఁ'డని పిల్లలమఱ్ఱికవి ప్రయోగించినాఁడు.



ఉ॥ సత్యవిహీనుఁడై చను రసాతలనాథుని తోడఁ జేయు సాం
గత్యము కోటి వచ్చినను గాదు సుధీజనకోటి కాశ్రయా
వృత్యయభూతి నెవ్వఁ డభివాంఛితుఁడౌ భువి నట్టిసత్యరా
హిత్యుఁ డొనర్చు దుష్కృతుల కెల్లఁబురోహితుఁ డెల్లయొఁ దుదిన్.
(జైమిని – 4–130)

కొందఱు తెలుఁగుకవు లిట్లే 'సహాయ – సాహాయ్య'; 'మత్సర – మాత్సర్య'; 'అజయ్య – అజేయ' ప్రభృతి శబ్దములను ఛందోఽనుకూలతకై వ్యత్యయముగాఁ బ్రయోగించినారు.

మ॥ నరనాథుండు తలంకె వార్థు లినికెన్ (మైరా –3–92)
'ఇంకు' అనుదానికి 'ఇనుకు' అని ప్రయోగించినాఁడు.
ఇట్లే 'ఘోటించు' (3–31); 'ఘూడించు' (3–65) మొదలగు క్రియారూపము లిందుఁ గలవు.

ఇట్లే తక్కిన విశేషము లెఱుంగవలయును.

**మాదయ్య యనుకరించిన ప్రాచీనకవులు**

ప్రాచీనకవు లందఱు కొలఁదిగనో గొప్పగనో పూర్వకవుల ననుకరించిన వారే. మాదయ్యకూడ నాలుగైదు తావులలో ననుకరించినాఁడు.

**వాల్మీకి – మాదయ్య :**

ఉపమలను రాశులుగాఁ బోయుట వాల్మీకి ప్రధానలక్షణము.

శ్లో॥ వృత్తశీలకులే జాతా మాచారవతి ధార్మికే।
పునఃసంస్కారమాపన్నాం జాతామివ చ దుష్కులే (10)
అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ।
ఆమ్నాయానా మయోగేన విద్యామ్ ప్రశిథిలా మివ॥ (11)
సన్నా మివ మహాకీర్తిం శ్రద్ధామివ విమానితామ్।
పూజా మివ పరిక్షీణా మాశామ్ ప్రతిహతా మివ॥ (12)
ఆయతీ మివ విధ్వస్తా మాజ్ఞామ్ ప్రతిహతా మివ।
దీప్తా మివ దిశం కాలే పూజా మపహృతా మివ॥ (13)
పద్మినీ మివ విధ్వస్తాం హతశూరాం చమూ మివ।
ప్రభా మివ తమోధ్వస్తా ముపక్షీణా మివాపగామ్॥ (14)
వేదీ మివ పరామృష్టాం శాన్తా మగ్నిశిఖా మివ।

పౌర్ణమాసీ మివ నిశాం రాహుగ్రస్తేన్దుమణ్డలామ్॥ (15)
ఉత్కృష్టపర్ణకమలాం విత్రాసితవిహంగమామ్।
హస్తిహస్తపరామృష్టా మాకులామ్ పద్మినీ మివ॥ (16)
పతిశోకాతురాం శుష్కాం నదీం విస్రావితామివ।
పరయా మృజయా హీనాం కృష్ణపక్షనిశా మివ॥ (17)
......................................
......................................
అనువ్రతాం రామమతీవ మైథిలీమ్
ప్రలోభయామాస వధాయ రావణః॥ (23) (వాల్మీకి -సుందర -19స.)

ఇది యశోకవనము లోని సీతావర్ణనము.

సీ॥ చంద్రుఁడు లేనట్టి - శర్వరి భంగిని
వనజబంధుఁడు లేని - దినము పగిది
ధవుఁడు వాసిన పద్మ - దళనేత్ర చందాన
జనపతి లేని రా-ష్ట్రంబు పగిది
జలములు లేనట్టి - జలజాకరము భాతి
విద్య యేమియు లేని - విప్రు మాడ్కి
నుడివోయి యుండిన - యుర్వీరుహము పోల్కి
ప్రాణంబు లేని గా- త్రంబు లీల

తే॥గీ॥ శుభములను బాసి సర్వంబు - శూన్య మగుచు
సోలి పడి యున్న కపిసేనఁ - జొచ్చి చూచి
మిమ్ముఁ బొడఁగాన కక్కడ - మిగుల భీతిఁ
బుడమిపైఁ బడి పెనుమూర్ఛఁ - బొంది తేటి. (మైరా -2-47)
ఇక్కడ నుపమలు మాలగా గ్రువ్వఁబడినవి.

**బాణుఁడు - మాదయ్య :**

వ॥ అస్తి పూర్వాపర జలనిధివేలావలగ్నా మధ్యదేశాలంకారభూతా మేఖలేవ భువో వనకరికులమదజలసేకసంవర్ధితై రతివికచధవళకుసుమనికర మత్యుచ్ఛ్రతయా తారాగణమివ.....ప్రేతాధిపనగరీవ సదాసన్నిహితమృత్యుభీషణా మహిషాధిష్ఠితా చ; సమరోద్యతపతాకినీవ బాణాసనారోపితశిలీముఖా వివిక్తసింహనాదా చ; కాత్యాయనీవ ప్రచలితఖడ్గభీషణా రక్తచందనాలంకృతాచ ......విన్ధ్యాటవీ నామ॥
ఇది కాదంబరిలో విన్ధ్యాటవీవర్ణనము.

వ॥ మఱియు గరుడకేతను హస్తాంబుజంబునుంబోలె శంఖచక్రగదాఖడ్గశార్‌ఙ్గాది దివ్యాయుధ ప్రకరంబై; రత్నాకరంబునుం బోలె వీరదైతేయకిరీటకోటి నిర్మలమణిప్రభాభాసురంబై......మరుత్తనయు ప్రతాపానలజ్వాలాభీలంబై యున్న యక్కలని మధ్యంబునందుఁ బడి యున్న మైరావణుం గాంచి చేర నరిగి. (మైరా -3-146)

ఇది రణరంగవర్ణనము. ఈ వచనము శ్లిష్టోపమలు లేకపోయినను బాణుని కాదంబరీశైలిలో సాగినది.



**శ్రీనాథుఁడు - మాదయ్య :**

సీ॥ తన కృపాణము సముద్ధతవైరిశుద్ధాంత
తాటంకముల కెగ్గుఁ దలఁచుచుండ (శృ.నై. 1-9)
ఇది శృంగారనైషధములోఁ గృతిపతి యగు మామిడిసింగన ప్రశంస.

సీ॥ తన కీర్తి దిక్పాలతరుణీఘనస్తన
తారహారములతోఁ ద్రస్తరింప (మైరా -1-15)
ఇది మైరావణచరిత్రలోఁ గృతిభర్తయగు లేజర్ల గోపన్న వర్ణనము.

ఈ సీసపాదముల యందలి 'త్రస్తరింప' - 'సిగ్గుపఱుప' - 'చెలిమిసేయ' - 'ఓజచూప' - అను క్రియారూపములు శ్రీనాథుని పోహణింపే.

సీ॥ భానుబింబంబులు పంద్రెండు నుదయించి
కఱవాఁడి బీఁటెండ కాయకుండ (భీమ -3-82)
ఇది భీమేశ్వర పురాణములో ద్రాక్షారామ వర్ణనము.

సీ॥ భానుబింబంబులు పంద్రెండు నొక్కటై
తరుచరరూపంబుఁ దాల్చెనొక్కొ! (మైరా -3-58)
ఇది మైరావణచరిత్రలో హనుమద్వర్ణనము.

**పోతన - మాదయ్య :**

మాదయ్య పోతనగారి భాగవతము నెక్కువ మాఱులు పారాయణము చేసిన కవి.

కం॥ నడవదు నిలయము వెలువడి
తడవదు పరపురుషగుణముఁ దనపతి నుడువుం

గడవదు వితరణకరుణలు
విడువదు లక్కాంబ విబుధవిసరము వొగడన్. (భాగ -1స్క -25)

కం॥ నడువ రధర్మ మశరణుల
విడువరు చేపట్టి యెట్టి వేళల నైనన్
నొడువరు నాలుక ననృతము
నడవరు చలిచీమ నైన నప్పురి శూద్రుల్. (మైరా -1-46)

కం॥ ఏలితివి మూఁడు జగములుఁ
దోలితి విం(ద్రాదిసురలఁ దొల్లిటివారిం
బోలితివి దానగుణములఁ
జాలితివీ రాక్షసులను సంరక్షింపన్. (భాగ -8స్క -562)

ఉ॥ తోలితి వెల్ల దేవతల దూరగఁ బాఱఁగ విక్రమంబుగన్
వ్రాలితి వజ్జసూను హరివాసుకికంకణు లట్లు పేర్మితో
నేలితి వెల్ల లోకములు నెవ్వరు మార్కొనకుండ ధీరతన్
జాలితి వెంతయున్ దనుజసంఘముఁ బ్రోవఁగ రావణేశ్వరా!
(మైరా -1-96)

చ॥ వెఱచిన వాని దైన్యమున వేఁడుఱు నొందిన వాని నిద్రమై
మఱచిన వాని సౌఖ్యముగ మద్యముఁ ద్రావిన వాని భగ్నుఁడై
పఱచిన వాని సాధుజడభావము వానిని గావుమంచు వా
చఱచిన వానిఁ గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా!
(భాగ -1స్క -155)

చ॥ చఱచెను వాల మెత్తి ఘనసత్త్వము మీఱఁగ దైత్యునుగ్రతన్
గఱచెను వాఁడు వాయుజుని కంఠ మతం డమరారి దంతమున్
విఱచెను రక్తముల్ దొఱుగ వీఁకను దద్దనుజుండు పావనిం
బఱచెను ముష్టిఘట్టనలఁ బావని వ్రచ్చెను గోళ్ళ నాతనిన్.
(మైరా -3-104)

కం॥ పాడిరి గంధర్వోత్తము
లాడిరి రంభాదికాంత లానందమునం
గూడిరి సిద్ధులు భయముల





వీడిరి చారణులు మొరసె వేల్పుల భేరుల్. (భాగ -10స్క -1-107)

కం॥ పాడిరి తుంబురునారదు
లాడిరి యచ్చరలు విబుధు లంబరవీథిం
గూడిరి కనుఁగొన దానవు
లోడిరి యింకనుచు మౌను లుబ్బిరి యంతన్. (మైరా -3-173)

సీ॥ అహిత జయోపాయు నతికాయు విస్ఫుట
సాంద్రమదోన్మత్తు నింద్రజిత్తు (మైరా -1-101)

ఉ॥ పట్టుదు - కట్టుదు - కొట్టుదు - మట్టుదు (మైరా -2-67)

శా॥ సాధింతున్ - క్రోధింతున్ - శోధింతున్ - బాధింతున్ (మైరా -2-68)

ఇటువంటి పద్యము లన్నియుఁ బోతన గారి మూసలోఁ బోసినవే.

**అనంతామాత్యుఁడు - మాడయ్య :**

కం॥ ఆడకు మసత్యభాషలు
కూడకు గొఱఁగాని వానిఁ గొంకక యొరు లె
గ్గాడిన నెదు రుత్తర మీఁ
జూడకు విని వినని వాని చొప్పునఁ జనుమీ!

కం॥ ఒంటి చరింపకు పొలమున
నింటికిఁ గడు ప్రొద్దు గలుగ నేతెంచుచు రా
వెంటఁబడి పొడుచు గోవుల
జంటఁ జనకు క్రయ్యఁబడక సందడి యగుచోన్.

కం॥ అంగజకేళికిఁ దివిరెడు
పుంగవులను మసరు కవిసి పోరాడకు వీఁ
కం గాలు ద్రవ్వు వృషభము
లం గదియకు తెవులు గొంటులం గూడకుమీ!

కం॥ తొడుకుఁ దినఁబోవు పసరము
బడిఁ బోకుము తురగగార్దభద్విరదాదుల్
నడచు పథంబున కడ్డము
సుడియకు దుర్జనులు మెలఁగుచో నిలువకుమీ!

కం॥ నూతుల దరులను లోఁతగు
పాతటి కసవులను నెట్టి పచ్చిక యున్నన్
బ్రాతిపడి మేయఁ బోకుము
మూతి నిడకు ముగ్రసత్త్వములు గల నీటన్. (భోజరా –6–29..33)

ఇవి భోజరాజీయములో గోవ్యాఘ్రసంవాదములో నావు లేఁగదూడకుఁ జెప్పిన నీతిపద్యములు.

కం॥ చాలించు మింక మది వగ
లాలించుము పుణ్యచరితము లనిశము జిహ్వాన్
గీలించు సత్యవాక్యము
పాలించుము దైత్యవరులఁ బ్రమదం బెసఁగన్.

కం॥ చేరకు పాతివ్రత్యలఁ
గోరకు పరధనము లెంత కోపం బైనన్
బోరకు విప్రుల తోడను
నేరకు కల లోన నైన నిష్ఠురభాషల్.

కం॥ మనుపుము దీనజనావళి
మనుపుము బాంధవులఁబ్రీతి మఱి దానవులన్
దనుపుము పితృదైవంబుల
ననుపుము సత్కీర్తి దిశల కరుగం బేర్మిన్. (మైరా –3–161 ...163)

ఇవి హనుమంతుఁడు నీలమేఘున కుపదేశించిన నీతిపద్యములు. ఇందలి క్రియానుప్రాసముల పద్ధతి పోతనామాత్యునిది. నీతిపద్యములు చెప్పు వైఖరి యనంతామాత్యునిది. ఇద్దఱు మహాకవుల శైలి నొకచోటఁ గలుపుట మాదయ్య ప్రత్యేకత.

## మాదయ్య ననుసరించిన యనంతరకవులు

**మాదయ్య – నంది తిమ్మన :**

సీ॥ ఇరుగెలంకుల దైత్యతరుణీకదంబంబు
గొలువ గద్దియ మీఁద నలరు దాని
సలిలత సత్కళా సౌభాగ్యరేఖలఁ
బౌలోమి యొప్పులఁ బరఁగు దాని



నవరత్నమయభూషణములకుఁ దనమూర్తి
భూషణంబై యుండఁ బొలుచు దాని
మృదుపాణిపద్మంబు మెఱుఁగుఁ జెక్కిటఁ జేర్చి
తన భర్త సేమంబుఁ దలఁచు దాని

తే॥గీ॥ వృద్ధపుణ్యాంగనలు సెప్ప వీనులలరఁ
గథలు వినుచున్న ధర్మమార్గంబు దానిఁ
గలితతన్వంగి మాతంగిఁ గాంచి మ్రొక్కి
హస్తములు మోడ్చి కడుఁ గంపితాత్మ లగుచు. (మైరా –3–135)

ఇది మైరావణుని భార్య యగు మాతంగి వర్ణనము.

సీ॥ తొడలపైఁ జాఁచిన యడుగుఁగెందమ్ముల
నొయ్యనఁ బౌలోమి యొత్తుచుండఁ
బార్శ్వభాగంబునఁ బంకేరుహాసను
కామినీరత్నంబు కతలు సెప్పఁ
బనిఁబూని యంతంత వినయావనతవృత్తి
సప్తర్షికాంతలు సంచరింప
వీజనచామరవీటీకరండాది
కములు దిక్పతిసతీగణము దాల్ప

తే॥గీ॥ విమలచింతామణీమయవేది మీఁదఁ
గల్పకలతాంతకల్పితతల్పసీమ
నధివసించిన నిఖిలలోకైకవంద్య
నమరమౌక్తికశుక్తి నయ్యదితిఁ గనియె. (పారి –3–24)

ఇది స్వర్గలోకము నందలి యదితి (దేవమాత) వర్ణనము.
ఇద్దఱు పూర్వకథలు వినుచున్నవారే.
ఈ యనుకరణమును మొదట గుర్తించినవా రారుద్ర గారు.

**మాదయ్య – అల్లసాని పెద్దన :**

సీ॥ అసువుల నున్నారు వసుధేశు లను వార్త
వీనులు చల్లఁగా విందు నొక్కొ?
విని వారి కడకును దనుజు లెవ్వరు నాదు

పొల మెఱుంగక యుండఁ బోదునొక్కొ?
పోయి కన్నుల కాంక్ష వోవంగ నంతట
నా తపః ఫలములఁ జూతు నొక్కొ?
చూచినప్పుడె వారిఁ జోద్యంబుగాఁ బోయి
వనచరావళిలోన నునుతు నొక్కొ?
తే॥గీ॥ యనికిఁ జనుదెంచు మైరావణుని వధించి
చెనఁటి దైత్యుల నీఱుగాఁ జేతు నొక్కొ?
కాక దైవాజ్ఞ యేమిగాఁ గలుగు నొక్కొ?
యనుచుఁ జింతించుచుండు నయ్యవసరమున. (మైరా -2-123)

ఇది హనుమంతు నాత్మగతము.

సీ॥ నను నిముసంబు గానక యున్న నూరెల్ల
నరయు మజ్జనకుఁ డెం తడలునొక్కొ?
యెపుడు సంధ్యల యందు నిలువెళ్ళ నీక న
న్నోమెడు తల్లి యెం తొఱలు నొక్కొ?
యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందు నొక్కొ?
కెడఁ దోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంత చింతింతు రొక్కొ?
తే॥గీ॥ యతిథిసంతర్పణంబు లేమయ్యె నొక్కొ?
యగ్ను లేమయ్యె నొక్కొ? నిత్యంబు లైన
కృత్యములఁ బాపి దైవంబ కినుక నిట్లు
పాఱవైచితె మిన్నులు పడ్డచోట. (మను - 2-17)

ఇది ప్రవరుని మనోగతము.

మాడయ్య సీసపద్యపాదము లందలి క్రియాముక్తపదగ్రస్తమును పెద్దన యీ క్రింది సీసములో సాధించినాఁడు.

సీ॥ తీర్థసంవాసు లేతెంచినా రని విన్న
నెదురుగా నేఁగు ద వ్వెంత యైన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ



దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులుగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేరవచ్చు
వచ్చి యిద్దరఁ గల్గు వనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ తెలియ నడుగు
తే॥గీ॥ నడిగి యోజన పరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచు నూర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శనాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి. (మను -1-57)

**మాడయ్య - శ్రీకృష్ణదేవరాయలు :**

చ॥ ఒసపరి యైన రాజనపుటోగిరమున్ మిరియంపుఁగూరలున్
గసగస లానవాలుఁ గడుఁ గమ్మని నేయిని బిండివంటలున్
రసములుఁ బాయసంబు మధురంపుఫలంబులు నూరుఁగాయలున్
బసగల భక్తితోఁ బసిఁడి పళ్ళెర మందునఁ బెట్టె నెంతయున్.
(మైరా -3-189)

ఇవి కౌసల్య వడ్డించిన భోజనపదార్థములు.

చ॥ తెలి నులి వెచ్చ యోగిరముఁ దియ్యని చారులుఁ దిమ్మనంబులున్
బలుచని యంబళుల్ చెఱకుపా లెడనీళ్ళు రసావళుల్ ఫలం
బులును సుగంధిశీతజలముల్ వడఁబిందెలు నీరుఁ జల్లయున్
వెలయఁగఁ బెట్టు భోజనము వేసవిఁ జందనచర్చ మున్నుగన్.
(ఆముక్త -1-81)

ఇది విష్ణుచిత్తుఁడు పెట్టిన భోజనవర్ణనము.

మాడయ్య పద్యము లోని 'మిరియపుఁగూరలు', 'నేయి', 'పాయసము' 'ఊరుఁగాయలు' రాయల వారి తరువాతి పద్యములో వచ్చినవి.

మ॥ పునుగుందావి నవోదనంబు 'మిరియంపుంబొళ్ళ'తోఁ జట్టి చు
య్యను నాదాఱని 'కూరగుంపు' ముకుమందై యేర్చు నావం జిగు
ర్పాను పచ్చళ్ళును 'బాయసాన్నములు' 'నూరుంగాయలున్' జే సుఱు
క్కను 'నేయుం' జిఱుపాల వెల్లువగ నాహారం బిడున్ సీతునన్.
(ఆముక్త -1-82)

తమ యన్నగారిని మెప్పించిన మాడయ్య పద్యము రాయల వారి కీపద్యములు రచించు సమయములో మెదడులో మెదలియే యుండును.

**మాడయ్య - చిత్రకవిసింగరార్యులు :**

చ॥ కలువలు కుందఁ దామరలు కౌతుక మందఁ జకోరవర్గముల్
చలమును బొంద జారజనసంఘవిహారము పెంపు గుంద ది
క్కులు వెలుఁగొందఁ దస్కరులు గుందఁ దమః పటలంబు చింద వే
ల్పులు వొగడంద భాస్కరుఁడు పూర్వమహీధర మెక్కె నెంతయున్.
(మైరా -3-175)

ఈ సూర్యోదయ వర్ణనములోఁ గ్రియానుప్రాసము చక్కఁగాఁ గుదిరినది.

చ॥ కలువల నిద్ర లేపి రతికాంతుని మాంద్యము వాపి పుష్కర
స్థలిఁ దిమిరంబుఁ జోపి రతిఁ జాలని బాలల నూపి దేవతా
వళి కమృతంబుఁ జేఁపి యల వాసవదిక్సతి కుండలంబునై
కలువల ఱేని మండలము కాంతిలు చున్నది తూర్పుకొండపై.
(బిల్హ -2 -52)

ఈ చంద్రోదయవర్ణనములో సింగరార్యుఁడు లెస్సగా ననుకరించినాఁడు. ఇ ట్లుత్తమశ్రేణికిఁ జెందిన మహాకవుల కుపజీవ్యుఁ డైన మాడయ్య గొప్పకవి కనుకనే తస్కరకవిరాజులను దట్టింపఁగల్గినాఁడు.

## మైరావణ చరిత్ర విశిష్టత

ఈ మైరావణ చరిత్రము శ్రీకృష్ణదేవరాయల ప్రబంధయుగమునకు ముందు 15వ శతాబ్ది యుత్తరార్ధములో వెలసిన కావ్య మగుటచే నాంధ్ర సాహిత్యములో దీనికి విశిష్టస్థానము గలదు. కథావస్తు వద్భుతమైనది. మాడయ్య కవితాశైలి ధారాళమైనది. పద్యము లన్నియుఁ గుంటి నడక లేక హాయిగా సాగినవి. అందువలన నీ కావ్యము తరువాతి కవుల నెక్కువగా నాకర్షించినది. తెలుఁగులోని వివిధప్రక్రియలలో మైరావణ చరిత్రములు వెలసినవి.

### ద్విపద కావ్యములు

1. కాచన 2. పోలుమంచి బసవన 3. పాతూరి తిమ్మయ 4. చంద్రగిరి చిన్నయ 5. కైప లక్ష్మీనరసింహశాస్త్రి 6. బసవప్పకవి ప్రత్యేకముగా





ద్విపదమైరావణచరిత్రలు రచించినారు. వీని వివరణము డా॥ టి.సుశీలగారు రచించిన 'ద్విపదసాహిత్యచరిత్ర' (214....218 పుటలు)లోఁ గలదు.

వీనిలోఁ గాచన ద్విపద మైరావణచరిత్రము తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయము వారిచే 1950లోఁ బ్రకటింపఁబడినది.

దీనిలో 831 ద్విపద లనఁగా 1662 పాదములు గలవు.

మాడయ్య కావ్యములో నగస్త్యుఁడు వక్త. శ్రీరాముఁడు శ్రోత. వాల్మీకి రామాయణములో నుత్తరకాండములో నగస్త్యమహర్షి రావణాది కథలు చెప్పుటచే మాడయ్య కూడ మైరావణకథ నగస్త్యునిచేఁ జెప్పించెను. కాచనకృతిలో వసిష్ఠమహర్షి వక్త. శ్రీరాముఁడు శ్రోత. వాసిష్ఠ రామాయణము ననుసరించి కాచన వసిష్ఠునిచే మైరావణకథ చెప్పించెను. కాచన కొన్ని తావులలో మాడయ్య ననుసరించెను. సూచీముఖుని 'సూదిముఖు'ఁడని వాడెను. హనుమంతుఁడు 'ముంగిస' యగుట మొదలగు కొన్ని మార్పులీ ద్విపదకావ్యములోఁ గలవు.

తక్కిన ద్విపదకావ్యము లముద్రితములు.

### యక్ష గానములు

1. బూచువల్లె కొండయ్య 2. పురాణం పిచ్చయ్యశాస్త్రి 3. నల్లమిల్లి బసివిరెడ్డి 4. కొల్లూరు పురుషోత్తమకవి ప్రత్యేకయక్షగానములు రచించినారు.

వీరిలో శ్రీపురాణం పిచ్చయ్యశాస్త్రిగారు గొప్పకవి. వీరి 'విజయాశ్వచరిత్రము' ప్రౌఢ ప్రబంధము. 1. కపటవేశ్యానాటకము 2. శశిరేఖాపరిణయము 3. యక్షప్రశ్నలు 4. అర్జునవిజయము (సైంధవ సంహారము) 5. చిత్రాంగీసారంగధరము 6. గౌరీశంకరసంవాదము వీరి యితరకృతులు.

ఈ యక్షగానముల వివరణము. డా॥ యస్. వి. జోగారావుగారి 'యక్షగానవాఙ్మయచరిత్ర'లోఁ గలదు. వీరి ప్రతిపాదనమును బట్టి 4 యక్షగానకృతులు ముద్రితము లైనట్లు తెలియుచున్నది.

### నాటకములు

1. శ్రీగూడూరు కోటీశ్వరరావుగారు రచించిన 'మారుతిమైరావణ సంగ్రామము' - 5 అంకముల నాటకము. తెనాలిలో శ్రీభవానీ ముద్రాలయము నందు 1924 లోఁ బ్రచురింపఁబడినది. 1. పురూరవ 2. సంపూర్ణరామాయణము

3. సీతాకల్యాణము 4. మారుతివిజయము 5. వీరభద్రవిజయము 6. కాంతామతి 7.జగన్మోహన 8. పద్మినీలోకబాంధవము వీరి యితర నాటకములు.

2. 'కవికుమార' – 'కవితావిశారద' బిరుదాంకితు లగు శ్రీఅయ్యగారి విశ్వేశ్వరరావు గారు 'మైరావణ' నాటకమును రచించిరి. ఇది కాళహస్తి తమ్మారావు & సన్స్ రాజమండ్రి వారిచే 1947లోఁ బ్రకటింపఁబడినది.

### వచనకావ్యములు

1. బ్రహ్మశ్రీ పురాణం పిచ్చయ్యశాస్త్రి గారు 'విచిత్రమైరావణవచనము' రచించిరి. ఇది యస్.వి.గోపాల్ & కంపెనీ – చెన్నపురివారిచే 1940లోఁ బ్రకటింపఁ బడినది.

2. వావిళ్ళవా రొక మైరావణవచనకావ్యమును (16 పుటలు) –1948లోఁ బ్రకటించిరి. ఇది యజ్ఞాతకర్తృకము.

3. మైరావణచరిత్రమను మఱొక వచనకావ్యము కూడఁ బ్రచురింపఁబడినది. ఇది వావిళ్ళ వారి గ్రంథము కంటె భిన్నమైనది.

### చలన చిత్రములు

1940లో; 1964లో రెండు 'మైరావణ' చలన చిత్రములు వచ్చినవి. (పైఁడిపాల : తెలుఁగు సినిమాపాట చరిత్ర 342; 347 పుటలు)

ఈ విధముగా వివిధ ప్రక్రియలలో మైరావణకథ యాంధ్రదేశములో నాబాలగోపాలము ప్రసిద్ధమైనది. దీనికి మూలపురుషుఁడు మాడయ్య. మాడయ్య మైరావణ చరిత్రమును ముద్దరాజురామన, అప్పకవి, కూచిమంచి తిమ్మకవి, కూచిమంచి వేంకటరాయఁడు, అడిదము సూరకవి వంటి వారు తమ లక్షణగ్రంథములలో నుదాహరింపలేదు. దీని ప్రతులు దుర్లభము లగుటయే ప్రధాన కారణము. మాడయ్య 'యఖిల కావ్యలక్షణ లక్ష్యసాగరము' (మైరా –1–18) క్రోడించినవాఁడే.

కవుల చరిత్రలోఁ గందుకూరి వారు, తరంగిణిలోఁ జాగంటివారు, సప్తశతిలో బులుసువారు, సమగ్రాంధ్రసాహిత్యములో నారుద్రగారు మాడయ్యను గూర్చి కొంతకుఁ గొంత వివరించినారు. శబ్దరత్నాకరకారులు, సూర్యరాయాంధ్ర నిఘంటుకర్తలు మైరావణచరిత్రమును బ్రమాణముగాఁ గైకొనినారు. శ్రీదీపాల



పిచ్చయ్యశాస్త్రిగారు భాగవతపాఠపరిశోధనములో దీని నుపయోగించినారు.

### ప్రస్తుత పరిష్కరణము

ఈ కావ్యము మొట్టమొదట శ్రీవిద్వజ్జనరంజనీ ముద్రాక్షరశాల; పిఠాపురము వారిచే ముద్రింపఁబడి కవితాపత్త్రికాధిపతులచే 1914లోఁ బ్రకటింపఁ బడినది. దీని సంపాదకులు రామకృష్ణకవులు. ముద్రణధనప్రదాతలు పిఠాపురప్రభువులు శ్రీరాజారావు సూర్యారావు బహద్దూరుగారు. నాఁటికి నేఁటికి నిది యొక్కటే ముద్రణము. అప్పుడు 750 ప్రతులు మాత్రమే ప్రచురింపఁబడినవి. దీని ప్రతులు నేఁడు గ్రంథాలయములలోఁ గూడ లభింపవు.

శ్రీరామకృష్ణకవులు దీనికి 4 పుటల లఘుపీఠికను రచించిరి. దీనిలోఁ గవిప్రయోగముల లోని దోషములు చూపుట తప్పఁ దక్కిన విశేషము లేమియు లేవు. దీనిని శ్రీరామకృష్ణకవులు శ్రద్ధగా సంస్కరింపలేదని చెప్పుటకుఁ జింతించుచున్నాను. శ్రీ బహుజనపల్లిసీతారామాచార్యుల వ్రాఁతప్రతి యాంధ్రప్రచారిణీ తాళపత్రప్రతి దీనికాధారము. అనేక ముద్రణ దోషములు గలవు. 9 ముద్రణ దోషములను శుద్ధపత్రికలో నిచ్చినారు. అనేక పాఠదోషములు గలవు.

కవిస్తుతిలో 'బదరుసేను' అని కలదు. 'ప్రవరసేను' అని యుండవలెను. శ్రీరామచంద్రుని సభావర్ణనములో 'భరత – మతంగ – కాహళ – దంతి' యని కలదు. కాహళ – బాకా; దంతి = ఏనుఁగు. పండితశ్రేణిలో వీనికి సందర్భము లేదు. 'కోహల – దత్తిల' యని యుండవలయును. వీరు సంగీతశాస్త్రకర్తలు. మల్లినాథుని వ్యాఖ్యలలో నుదాహరింపఁబడిన వారు. 'దత్తిలము' నాదగ్గఱఁ గలదు. "విశ్వావసు తుంబురు నార దాంజనేయ భరత మతంగ కోహల దత్తిల ప్రభృతి గాంధర్వ కౌశల గౌరవ స్మరణ కారణ గాన మాధురీధురీణతాప్రీణితబుధశ్రేణికులగు వైణికులును'' (కళా –1–11) అని కళాపూర్ణోదయము. ఆటవెలఁది పద్యములకుముందు 'గీ'. అని కలదు. చంపకమాలకు ముందు 'శా'. అని కలదు. సీసపద్యముల క్రింది తేటగీతులకు 'తే.గీ.' అను గుర్తులేదు. ఇవి తేటగీతులో యాటవెలఁదులో సామాన్యపాఠకులకుఁ దెలియదు. మఱియుఁ గొన్ని వర్ణక్రమ దోషములు గలవు.

ఏదో విధముగా దీనిని ముద్రింపించి శ్రీరామకృష్ణకవులు మహోపకారము చేసినారు. లేనిచో నపురూపమైన యీ కావ్యమంతరించి యుండెడిది. ఎఱ్ఱనగారి

నృసింహపురాణమునకుఁ దాళపత్రగ్రంథము నేఁడు లభించుట లేదని శ్రీనిడుదవోలు వెంకటరావుగారి వక్కణము.

నేను శ్రీరామకృష్ణకవుల ప్రతిని బట్టియే యీ గ్రంథమును బరిష్కరించితిని. ముద్రణ దోషములను, వర్ణక్రమదోషములను సవరించితిని. ప్రశ్న చిహ్నములు (?); సంబోధన చిహ్నములు (!) మొదలగు వానిని యథాస్థానముగా నుంచితిని. కవిప్రయోగములలో దేనిని దిద్దలేదు. అది పరిష్కర్త పని కాదు. రెండు మూఁడు తావులలో నపపాఠములను సవరించితిని. సవరించిన ప్రతిచోటఁ బూర్వ ముద్రణపాఠమును పాదటిప్పణిలోఁ జూపితిని. కొన్ని కఠినపదములకు శబ్దరత్నాకరసూర్యరాయ నిఘంటువుల ననుసరించి యర్థము లిచ్చితిని.

తాళపత్రప్రతులతో ముద్రితప్రతిని సరిపోల్చి చూచుట నావంటి వానికి శక్యము గాదు గదా! అట్లే చేసినచో మఱికొన్ని మంచి పాఠములు లభించెడి వేమో! యథాశక్తిగా దీనిని బరిష్కరించి విపుల పీఠిక రచించి శ్రీరామోరా గారి యవ్యాజౌదార్యముతోఁ బాఠకులకు సమర్పించుచున్నాను. ఇందలి గుణదోషములకు సహృదయులగు పాఠకులే ప్రమాణము.

## కృతజ్ఞతలు

ఒకసారి **శ్రీరావి మోహనరావు (రామోరా)** గారు దీని లోని యాంజనేయ దండకము నాత్మజ్యోతిలోఁ బ్రచురించుటకై యీ కావ్యమును న న్నడిగిరి. నా దగ్గఱఁ గూడ దీని ప్రతి లేదు. దీనికై 10 సంవత్సరముల నుండి ప్రయత్నించుచుంటిని. అమలాపురము – శ్రీకోనసీమ భానోజీ రామర్సు కళాశాలలో నా సహోపన్యాసకులు శివలీలావిలాసపరిశోధనగ్రంథకర్తలు ప్రస్తుతము హైదరాబాదు వాస్తవ్యులు నగు డా॥ శ్రీకస్తూరి హనుమంతరావు గారు శ్రీకృష్ణ దేవరాయగ్రంథాలయము నందలి మైరావణచరిత్రమును సంపాదించి ఛాయాప్రతిని నాకుఁ బంపినారు. ఇదే సమయములో గుంటూరు వాస్తవ్యులు, నరసింహభక్తులు, బహుసహస్రగ్రంథసంపాదకులు శ్రీఅరిశెట్టి సాయిప్రసాదుగారు కాచన – ద్విపదమైరావణచరిత్రకు ఛాయాప్రతినే కాక తక్కిన మైరావణచరిత్రల ముఖపత్ర – ప్రథమ పత్రములకు ఛాయాప్రతులను గూడ నొసఁగినారు.

ఈ గ్రంథమును గూర్చి చెప్పఁగానే శతాధిక గ్రంథప్రకాశకులు చిరకాలమిత్రులు శ్రీరావిమోహనరావుగారు 'పీఠిక వ్రాసి పంపుఁడు. కావ్యమును





బ్రచురింత"మని వెంటనే తమ యామోదమును దెలిపినారు. రామోరాగా రిప్పటికి సుమారు 116 గ్రంథములు వెలువరించినారు. వీ రిన్ని గ్రంథములు పుంఖానుపుంఖముగాఁ బ్రచురించుటకు **వీరి ధర్మపత్ని శ్రీమతి రావి కృష్ణకుమారిగారు** చేదోడు వాదోడుగా నుండుట ప్రధానకారణము. ఒక ప్రాచీన ప్రబంధ రత్నమును లోకమున కర్పించుటకుఁ బ్రధానహేతుభూతులగు **శ్రీరావి కృష్ణకుమారీ – మోహనరావు దంపతులకు,** విద్యామిత్రులు **శ్రీ కస్తూరి హనుమంతరావు** గారికి, **శ్రీ అరిశెట్టి సాయి ప్రసాదు**గారికి నా కృతజ్ఞతాభినందనములు.

మాడయ్యకవి కులదైవమగు గుడివాడ శ్రీభీమేశ్వరస్వామి, యీ కావ్యనాయకుఁ డగు హనుమంతుఁడు, కథాస్వామి యగు శ్రీసీతారామస్వామి సర్వదా మనలను రక్షింతురు గాత!

శ్లో॥ చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్।
ఏకైకమక్షరమ్ ప్రోక్తమ్ మహాపాతకనాశనమ్॥

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు.

విజయవాడ,
శ్రీనందనసంవత్సరకార్తిక
బహుళచతుర్దశీసౌమ్యవాసరము,
12-12-2012

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుఁడు,
**గరిమెళ్ళ సోమయాజులుశర్మ,**
పుష్పగిరిమహాసంస్థానపండితుఁడు.

మఙ్గళమ్ మహత్
శ్రీశ్రీశ్రీ

శ్రీ పార్వతీ భీమేశ్వరాభ్యాం నమః










ఈ మైరావణ చరిత్ర నూతన సంస్కరణము
గుడివాడలో విజయము చేసియున్న
శ్రీ పార్వతీ భీమేశ్వరస్వామివారల పాదపద్మముల యందు సమర్పితము.

| ప్రకటన కర్త | పరిష్కర్త |
|---|---|
| **రావి మోహనరావు (రామోరా)** | **గరిమెళ్ళ సోమయాజులు శర్మ** |
| చీరాల | విజయవాడ |

శ్రీరస్తు          శుభమస్తు          అవిఘ్నమస్తు

# మైరావణ చరిత్రము

## ప్రథమాశ్వాసము

### అవతారిక



మద్భూమిసుతాఘనస్తనతటీ - శ్రీగంధపంకస్ఫుట
క్షేమాలంకృతవక్షుఁ డాగమగుహా - క్రీడామృగాధీశుఁడు
ద్దామస్ఫారపరాక్రముండు రఘునా - థస్వామి యత్యంతని
త్యామోదంబునఁ బ్రోచు నబ్బవిభుగో- పామాత్యచూడామణిన్ 1

చ. ధనపతిమిత్రుఁ డర్కహిమ - ధామధనంజయ నేత్రుఁ డంబికా
స్తనగిరిదుర్గతస్కరణ - చారుతరస్ఫుటగాత్రుఁ డంబుజా
సనదివిజాధినాథనత - సారచరిత్రుఁడు జాహ్నవీభరుం
డనిశముఁ బ్రోచుఁ గాత సుగు - ణాఢ్యుని నబ్బయగోపధీమణిన్ 2

చ. అమరగణాధిపార్చితుఁ ద-హర్పతికాంతిసమానతేజుఁ డా
గమపరివేష్టితుండు త్రిజ - గద్వరనిర్మితినైపుణుండు వా
గ్రమణుఁడు పంకజాసనుఁడు - రమ్యచిరాయువుఁ జేయుఁ గాత మ
త్యమితగుణాభిరాముఁడగు - నబ్బయగోపనమంత్రిశేఖరున్ 3

సీ. రత్నాకరునికిఁ దో-రపుముద్దుఁగూఁతురు
పుష్పసాయకుఁగన్న - పువ్వుబోణి
కైరవసుమమిత్రు - గాదిలిసైదోడు
తమికొ౦లకులనాడు - తరళ నేత్ర
హరియురంబున నుండు - నఖిలజగన్మాత
బంగారుచూపుల - పద్మగంధి
కామితార్థము లిచ్చు - కల్పభూజముకొమ్మ
సౌభాగ్యము కెల్ల - జన్మభూమి

తే॥గీ॥ పరమకల్యాణి కాంచన - పద్మపాణి
యైన శ్రీలక్ష్మి లేజర్ల - యబ్బమంత్రి





గోపయామాత్యు గృహమున - గూర్మిఁగలిగి
యురుతరశ్రీల నేప్రొద్దు - నుండుఁగాత. 4

ఉ. శంకరుముద్దుపట్టి జల - జాతదళాక్షునికూర్మిరాణి మీ
నాంకునిఁ గన్నతల్లి చతు - రాస్యుని కోడలు లోకము ల్నిరా
తంకసుఖస్థితిన్ మనుపు - దైవశిఖామణి లక్ష్మి నిచ్చలున్
బొంక మెలర్ప నబ్బయ సు - పుత్రుని గోపనిఁబ్రోచు నెప్పుడున్. 5

ఉ. పన్నగధారి మేనసగ - పాలునఁ గాఁపుర మున్నబోటి హృ
ద్యన్నయయోగిహృత్సరసి - జాకరవాస త్రిలోకరక్ష సం
పన్నతుషారశైలవిభు - పట్టి యపర్ణ భవాని యెప్పుడున్
మన్ననఁజూచుఁగాత నవ - మన్మథు నబ్బయగోపధీమణిన్. 6

చ. సరసిజగర్భురాణి శుక - శౌనకచిత్తసరోజభృంగి భా
సురనిఖిలామరప్రకర - శుద్ధవినూత్న కిరీటరత్నవి
స్ఫురితపదాబ్జపాణి కడుఁ - బూనినవేడ్క నటించుఁ గాత స
ద్గురుమతి యబ్బధీవరుని - గోపయమంత్రిముఖాంబుజంబునన్. 7

చ. మనసిజవైరిజూటమున - మానితకాంతిని నొప్పుచంద్రునిన్
గనుఁగొని వాంఛతో నమృత - ఖండ మటంచుఁగరంబు సాఁచి య
ల్లనఁ దివియంగ గౌరి యుప - లాలన సేయఁగ నుండు నగ్గజా
ననుఁడు సుఖస్థితిన్[1] మనుప - నారత మబ్బయగోపధీమణిన్. 8

క. వినుతింతు నమ్మదంబున
వినుతసుపటుచాటుకార - విఖ్యాతలస
ద్ఘనతరరామకథారస
ఘనసముదయమత్తకేకిఁ - గవివాల్మీకిన్. 9

క. నీరద నీలశరీరుని
నీరజదళనేత్రు నిగమ - నిర్మిత సూత్రున్
బారావారగభీరుని
పారాశరమౌనిఁగొల్తుఁ - బ్రమదం బెసఁగన్. 10

1. మనుపునారత - పూర్వముద్రణము

సీ. సన్నుతి యొనరింతు - సర్వజ్ఞ బిరుదాంక
భద్రవాచా స్థాణు - భట్టబాణు
గురుమతి వర్ణింతు - వరపదాలంకార
కవితార్థవిన్యాసుఁ - గాళిదాసు
మదిలోన వర్ణింతు - మహనీయమధురవి
స్ఫురితశాబ్దోన్మత్తు - సోమదత్తు
వినయోక్తిఁగొనియాడు - దును భూరిగర్విత
కవిగోత్రపాకారి - ఘను మురారిఁ

తే.గీ. బ్రార్థనము సేతు శివభద్రుఁ - [1]బ్రవర సేనుఁ
జోరు భవభూతి దండి మ[2]-యూరు - బాణు
మాఘు భారవి నుద్భటు - మఱియుఁ బేరు
గల కవీంద్రులఁ జింతింతు - గరిమతోడ.

ఉ. రక్కసిచేతఁ జిక్కువడి - రాయిడిఁ బొందిన యట్టి వేదముల్
చక్కఁగఁ జేసి వ్యాసుఁడు ప్ర-శస్తము సేసినభారతం బిలన్
దక్కఁగ నాంధ్రభాష విశ-దంబుగఁ జెప్పినఁ నన్న పార్యునిం
దిక్కనసోమయాజిని మ-దిం దగఁ గొల్చెదఁ గావ్యభూతికిన్.

ఉ. పొంకపుఁ గావ్యలక్షణము - పోక డెఱుంగక దిట్టకూళలై
కొంకక వంకరర్థములు - గూర్చి సభాస్థలిఁ బ్రౌఢు లట్లు ని
శ్శంకఁ జరించుచున్ సుకవి - సంఘముపల్కుల మెచ్చ కూరకే
[3]యంకము సేయవచ్చు నల - యయ్యల మున్నుగఁ బ్రస్తుతించెదన్.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవిప్రశంసయుఁ గుకవిదుష్ప్రశంసయుఁజెప్ప నాచరించి యేదేనియు నొక్క విచిత్రచరిత్రంబుఁ దెలుంగుబాస నుద్యోగించుసమయంబున.

సీ. తనకీర్తి దిక్పాల - తరుణీఘనస్తన
తారహారములతోఁ - దస్తరింపఁ
దనమూర్తి యుదధీశ - వనజాక్షిహిమధామ

1. బదరసేను - పూ.ము. అర్థము లేనిది. ప్రవరసేనుఁడు సేతుబంధ కావ్యకర్త.
2. పునరుక్తి. లేక వామన భట్టు బాణుని గ్రహింపవలెను.
3. ఆక్షేపము శ.ర. ఇదే ప్రయోగము.





చిత్తసంభవులను - సిగ్గుపఱుపఁ
దనశౌర్య మద్రీశ - తనయామనోనాథుఁ
జిచ్చుఱకంటితోఁ - జెలిమి సేయఁ
దనదాన మర్కనం-దనకల్పకంబుల
కొజ్జయై సతతంబు - నోజ చూపఁ

తే॥గీ॥ దనమనఃస్ఫూర్తి సురమంత్రి - ననుసరింపఁ
దనగభీరిమ వననిధి - తరము డింప
[1]వెలసె వెలయుచునున్నాఁడు - వెలయఁగలఁడు
గురుతరోదారి లేజర్ల - గోపశౌరి. 15

వ. ఆమంత్రీశ్వరుం డొక్కనాఁడు కవిబుధబాంధవాప్తపురోహితామాత్యమిత్రభృత్య వర్గంబు లుభయపార్శ్వంబులం బరివేష్టించి యుండ సుఖాసీనుండై నన్నుఁ బిలిపించి యర్హ పీఠంబునం గూర్చుండ నియమించి సగౌరవంబున నిట్లనియె. 16

క. సర్వజ్ఞపాదసేవక!
సర్వాగమశబ్దశాస్త్ర - చతురవివేకా!
సర్వయమంత్రితనూభవ!
సర్వేశ్వరమాడసుకవి! సన్నుతచరితా! 17

సీ. మెప్పించినాఁడవు - మెఱవడిఁ గర్ణాట
నరనాయకుని వీర - నారసింహు
దట్టించినాఁడవు - తస్కరకవిరాజుఁ[2]
గోట సింగనమంత్రి - కొలువులోనఁ
గాంచినాఁడవు కన - త్కాంచనాభరణంబు
లేపార నందాపు - రీశుచేత
నందినాఁడవు నుత్త - మాశ్వద్వయంబును
కిమిడెభూమండల - రమణుచేత

తే.గీ. నవమతిస్ఫూర్తిఁ గ్రోడించి - నాఁడ వఖిల
కావ్యలక్షణలక్ష్యసా - గరము నెరయ

1. వెలసి - పూ.ము. 2. రాజి - వేటూరివారి పాఠము.

నిన్ను వేర్వేఱ నింక వ - ర్ణింప నేల
ప్రోడ వన్నింట సర్వయ - మాడసుకవి. 18

క. నీతండ్రి సర్వధీమణి
నీతల్లి దయావిశుద్ధ - నియమాదరణ
ఖ్యాతిని భూదేవికి నెన
యాతతమతి యైన రాచ - మాంబ ధరిత్రిన్. 19

క. నీయగ్రజుండు దక్షిణ
రాయనృపప్రవిమలాబ్ధి - రమణీయుఁడు రా
మాయణపరనవ్రతని
త్యాయతఘనయశుఁడు మల్ల - నార్యుఁడు పేర్మిన్.

వ. నీవు మతియును.

చ. రసములు తొమ్మిదింగలుగు - రమ్యనవార్థసుశబ్దమాధురీ
విసరము లుల్లసిల్లనతి - విస్ఫుటలక్షణరూఢిఁబ్రౌఢిమన్
రసికులనెమ్మనంబులను - రాగము నొందఁ దెనుంగుబాస నిం
పెసఁగఁగఁగఁ జెప్ప నేర్తు సరి - యెవ్వరు నీకును మాడధీమణీ! 22

వ. కావున.

క. సుతుఁడును గుడి నిధి జెఱువును
గృతియును[1] నల్లిండ్లు వనము - క్షితిలోపల సం
తతు లిందులోన నెన్నఁగఁ
గృతివలనం గలుగునండ్రు - కీర్తియు గతియున్. 24

వ. అదియునుంగాక.

క. నావియ్య మైన కాస
క్ష్మావినుతునిసుతున కెఱ్ఱ - మంత్రీంద్రునకున్
దేవేంద్రవిజయ మను కథ
శ్రీవెలయఁగ ద్విపద మీరు - సెప్పితి రెలమిన్. 26

ఆ.వె॥ ధాత్రిలోన మనకు - గోత్రంబు శాఖయు
నొక్క టగుట మంచి - యోగ్య మయ్యెఁ

1. నల్లిండ్లు = అగ్రహారము. శ.ర. ఈ పద్యమే యుదాహృతము.





గానఁ జెప్పుఁ డంధ్ర - కవిత మైరావణ
చరిత మొప్ప నాకు - జయకరముగ. 27

చ. అని దయఁ జూచి భవ్యకన - కాంబరగోహయభృత్యవేదికా
ఘనఘనసారకుంకుమసు - గంధవినూతనభూషణాలితో
వినయముతోడఁగప్పురపు - వీడియ మర్థిని భక్తి నిచ్చి న
న్ననిపిన మద్గృహంబునకు - హర్షముతోడుత వచ్చి యెంతయున్. 28

చ. వలనుగ నాత్మలోన గుడి-వాడపురాధిపు భీమలింగనిం
దలఁచి కరంబు లెత్తి ప్రమ - దంబున మ్రొక్కి నుతించి భక్తిని
శ్చలమతి నివ్వటూరిపుర - శాసను మద్గురు మల్లికార్జునున్
గొలిచి తదాజ్ఞచేఁ బ్రకట - కోమలకావ్యకళావివేకి నై. 29

వ. ఏతత్కథాంచత్పాలలోచన కంఠంబునకు నిర్మల తారహారంబునం బోలెనొప్పుచున్న కృతినాయకుని వంశావతారం బభివర్ణించెద. 30

ఇక్కడ గ్రంథపాతము.

## షష్ఠ్యంతములు

క. ఇటువంటియన్వయాబ్ధికిఁ
బటుతరబహువేదశాస్త్ర - పారీణునకున్
గుటిలామాత్యపయోధర
పటలస్ఫుటభీషణప్ర - భంజనమతికిన్. 31

క. రామాంబాప్రియవరునకుఁ
గామితఫలదైకమనుజ - కల్పకమునకున్
దామరసాక్షలసత్పద
తామరసరసానుమోది - తనిజహృదళికిన్. 32

క. స్వర్గాధిపవైభవునకు
భర్గశిరోమధ్యసింధు - బంధురతతగీ
ర్వర్గునకు నిఖిలమార్గని
రర్గళవిమలోరుకీర్తి - రమణీమణికిన్. 33

క. బాంధవపంకజపంకజ
బాంధవునకు నమితసత్య - భాషానిధికిన్
బంధురయువతీజనగణ[1]
బంధూకప్రసవబాణ - పటుహస్తునకున్. 34

క. శ్రీవత్సగోత్రమణికిని
దేవాధిపమంత్రిసదృశ - దృఢసన్మణికిన్
భూవరసభాభిసన్నుత
పావనచరితునకు ధర్మ - పరిపాలునకున్. 35

క. ఆజన్మశుద్ధునకుఁగవి
రాజాంచితహృత్సరోమరాళంబునకున్
ధీజననుతవర్తనునకు
రాజిత లేజర్లమంత్రి - రత్నంబునకున్. 36

వ. అనవరతాభ్యుదయపరంపరాభివృద్ధిగా నారచింపం బూనినకృతికిం గథాసూత్రంబెట్టి దనిన. 37

చ. గురుతరవైభవోన్నతులఁ - గూడిన కోసలభూమియందునన్
సరయువు గల్గుఁ బుణ్యనది - సన్నుతికెక్కుచు దానిచేరువన్
సురపతివీటికిన్ మిగులు - సొంపు వహించుచు ముక్తికాంతతోఁ
బెరసి యయోధ్య నాఁగఁ - బుట భేదన మొప్పు రమానివాసమై. 38

క. ఓపునె యజుఁ డైన [2]నయో
ధ్యాపురవర మిట్టి దట్టి - దని వర్ణింపన్
శ్రీపతి తనపురి మెచ్చక
యాపురిలో నుండు వేడ్క - ననవరతంబున్. 39

చ. వలనుగ నప్పురంబు ఘన - వప్రసమున్నతి యర్కు తేరికి
న్నలవున దాఁటరామి నత - దందుల దిద్దులు దూరి రాకపో
కలు సతతంబుఁ జేయుటయుఁ - గాదె జగంబునఁ దేట తెల్ల మై
పెలుచన బాలభానుఁడనఁ - బిన్నతనం బొగిఁ గాంచె నెంతయున్. 40

1. జనగుణ. పూ.ము
2. యయోధ్యా - పూ.ము.





సీ. మారుతోద్ధూతవి - స్మయతరంగంబులు
మిన్నేటితోడుత - మేలమాడఁ
గమలనీలోత్పల - కైరవకల్హార
పుష్పవాసన లుర్వి - బుగులుకొనఁగ
మహదద్భుతగ్రాహ - మత్స్యకచ్ఛపములు
సంతతవిశ్రాంతి - సంచరింప
బకచక్రవాకష - ట్పదమరాళంబుల
నాదంబు చెవుల కా-నంద మొసఁగఁ 41

తే.గీ. బంత మొప్పఁగ బడబాగ్ని - బాధఁ బట్టి
యుదధియం దుండి తా వచ్చి - యున్న దనఁగఁ
బరపు నిడుపును లోఁతును - బరగఁ గలిగి
పరిఘ యొప్పును సాకేత - పురమునందు. 42

ఉ. వేదము లభ్యసించి సుక-విత్వవిలాసము నేర్పుమించి యా
హ్లాదముతో శతక్రతువు - లద్భుతలీలలుఁ జేయఁ గాంచి య
త్యాదరణంబుతో నతిథి - యాఁకలిఁ జేరిన నన్నమిత్తుర
య్యాదిమునీంద్రులో - యనఁగ నప్పురి విప్రజనంబు లొప్పుగన్. 43

చ. శరణము వేఁడుచోట పితృ - సంహరు నైనను గాతు రల్గినన్
దురమున నేగుదెంచినను - ధూర్జటి నైనను మాఱుకొందు రే
పరుషము లేక వేఁడినను - బ్రాణము లర్థుల కియ్యఁ జూతు ర
ప్పురమునఁ గల్గురాజకుల - పుంగవు లెంతయు సంతసంబునన్. 44

క. క్రొత్తగ నప్పురి వైశ్యుల
విత్తంబుల కలిమిఁ జెప్ప- విన నద్భుతముల్
తత్తరుఱు లెపుదు దీర్తురు
ముత్తియముల రంగవల్లి - ముంగిళులందున్. 45

క. నడువ రధర్మ మశరణుల
విడువరు చేపట్టియెట్టి - వేళల నైనన్
నొడువరు నాలుక నన్నృతము
నడవరు చలిచీమ నైన - నప్పురిశూద్రుల్. 46

సీ. తన నారి తుమ్మెద - తండంబులను గూర్చి
తిన్నఁగాఁగొప్పులు - తీర్చి తీర్చి
తన మేడమీఁది కాం-చనకుంభములు దెచ్చి
వలుదచన్నులమీఁద - నిలిపి నిలిపి
తన చేతి చిలుకబో - దల ముద్దుపలుకులు
కడు నింపు పుట్టంగఁ - గఱపి కఱపి
తనభటావళి యైన - వనమయూరంబుల
యలసయానంబులు - తెలిపి తెలిపి

తే.గీ. తనదువిల్లును శరములు - తగ నొనర్చి
బొమలు కన్నులు నై యుండఁ - బొందు పఱిచి
వారకాంతల నప్పుర - వరమునందు
మరుఁడు కల్పించె విరహుల - మరులు గొలుప. 47

క. రస మొలికెడు కెమ్మోవులు
పసిఁడిశలాకలను సిగ్గు - పఱపెడు మేనుల్
ఒసపరి చన్నులు నప్పురి
బిసరుహనయనలకుఁ గాక - పెరచోఁ గలవే? 48

చ. అనిమొన శాత్రవు ల్వరపు - నస్త్రసముద్ధతి కుల్క దెమ్మెయిన్
వననిధిమీఁదఁ దోలిన జవంబున దాఁటెడు పేర్మిగల్గి య
య్యనిలసమానవేగమున - నశ్వనికాయము వొల్చు నెప్పుడున్
బనివడి బ్రహ్మ యప్పురిని - బాదరసంబునఁ జేసెనో యనన్. 49

ఉ. సంతత సర్వలక్ష్మి గొన - సాఁగుచు నుండఁగ నున్నతస్ఫుర[1]
త్కాంతిదలంకఁ గ్రమ్మి మద - ధారలు చెక్కులవెంటఁ బర్వఁగా
దంతిసమూహ మప్పురిని - దారుణమూర్తులు దాల్చినట్లు మీ
ఱెంతయు నొప్పు నట్టిసెల - యేరులతోడి నగంబులో యనన్. 50

చ. తలిరులజొంపము న్మెసవి - తద్దయుఁబొల్చు పికవ్రజంబులన్
విలసితపుష్పవాసనల - వీఁకను బాడెడితేఁటిగుంపులన్
ఫలములు చప్పలించి రస - పానముఁ జేయుచుఁ బల్కు చిల్కలన్
గలిగి వనంబు లాపురిఁ ద్రి-కాలము నొప్పు సమీపభూములన్. 51

1. తత్స్ఫుర - పూ. ము.



వ. మఱియు ననేకవైభవంబుల కుతూహలంబుల నింపుసొంపారియుండు నక్కాలంబున.

క. శ్రీమత్ప్రతాపుఁడమర
స్తోమానిశసన్నుతాంఘ్రి - తోయజుఁ డుద్య
ద్భీమాసురకులనగసు
త్రాముఁడు రఘురాముఁడేలుఁ - దత్పురిఁ బేర్మిన్. 53

సీ. కలలోననైన న-వ్వులమాటకైనను
బొంకు నాలుక యందుఁ - బొరయనీఁడు
యాచకుం డేమైన - నడుగుచో నిచ్చుట
గాని లేదని చెప్పి - గడుపఁడురక
యంబుజాసనముఖ్యు - లనికి వచ్చిననైన
వెన్నియ్యఁడెప్పుడు - వీఁక కలిమి
నాశ్రితుఁడొకవేళ - నపరాధుఁడైనను
జేపట్టుటయె కాని- శిక్ష సేయఁ

తే.గీ. డతులగాంభీర్యధైర్యర - త్నాకరుండు
సత్యసంధుండు నీతివి- స్తారుఁ డలఘుఁ
డమరతేజుఁడు తామర - సాప్తకులుఁడు
రాజమాత్రుఁడె దశరథ - రామవిభుఁడు. 54

సీ. కన్నతల్లియు నన్య - కాంతాలలామయు
నుల్లంబులోపల - నొక్కరూప
శరణాగతుం డైన - శాత్రవుండును దోడ
నుద్భవించినవాఁడు - నొక్కపోల్కి
యన్యాయమున వచ్చు - నమరాచలంబును
జిడిపిరాయియు నొక్క - వడువె చూడ
నతిథికి నిడక తా - ననుభవించిన భుక్తి
కాలకూటము నొక్క - కరణి యరయ

తే.గీ. జనులమోదంబు ఖేదంబు - తనది యట్ల
చండదోర్దండపటుతరా - ఖండభయద

దనుజలకు వార్ధి బాడబానలుఁడు నగుచు[1]
జగతిఁ బెంపొందు శ్రీరామ–చంద్రునకును. 55

క. ఆరఘురాముఁడు భద్ర
శ్రీరమణికి హెచ్చు దైన సీతాసతితోఁ
జేరిన భోగేచ్ఛల నిం
పారఁగ వర్తించుచుండు – నాతనిభూమిన్. 56

సీ. తొలకరి నేఁటేఁట – దున్ని విత్తవలదు
రాలినధాన్యంబె – చాలుఁ బండఁ
[2]గుఱ్ఱులఁ బట్టఁగ – నుఱ్ఱుఁద్రాళ్లు వలదు
కుండ యొడ్డినఁ బాలు – నిండఁ గుఱియు
గ్రహయోగమున విప్ర – గణము వేఁడ వలదు
వలె నన్న యప్పుడే – వాన గురియు
ఔషధంబులు నేయ – నలజ డేమివలదు
వ్యాధు లాశింప వె–వ్వరికి నైన

తే.గీ. ధర్మమెప్పుడు నాల్గు పాదముల మోఁచి
నేల నెంతయుఁ బాయక –నిండి యుండు
జలజబాంధవవంశాబ్ధి – చంద్రుఁడైన
రామభూపాలుఁ డేలెడి – రాజ్యమందు. 57

క. గ్రహయోగము లపమృత్యువు
గృహకలహము లవధి బాల – మృతియును లేమిం
దహతహలు రామచంద్రుని
మహిలోపల లేవు తలఁప – మఱచిన నైనన్. 58

క. పామరులు మూర్ఖు లలసులు
తామసు లజ్ఞానమతులు – ధైర్యవిహీనుల్
సోమరులు లేరు దశరథ
రాముఁడు పాలించు నట్టి – రాజ్యమునందున్. 59

1. ఇక్కడ యతిభంగము. సరియగు పాఠ మన్వేషణీయము.
2. కుఱ్ఱి = పాఁడియావు. కుఱ్ఱుఁద్రాళ్ళు = ఆవుకాళ్ళుగట్టు త్రాళ్ళు. శ.ర.



వ. ఇట్లనేకధర్మనీతిప్రకారంబుల నారఘూద్వహుండు పరిపాలించుచుండి యొక్కనాఁడు భరతలక్ష్మణశత్రుఘ్నులను జతురంభోధిమధ్యంబునం గలసకలక్ష్మాపాల నివహంబును, సుగ్రీవాంగదపనసనీలాంజనేయజాంబవదాది మహాకపిముఖ్యులును, బంధుజనామాత్యపురోహితప్రకరంబును, ఋగ్యజుస్సా మాథర్వణ వేదవేదాంత వైశేషికభాట్ట ప్రాభాకరన్యాయమీమాంసా వ్యాకరణజ్ఞులును, భూతభవిష్య ద్వర్తమాన కాలప్రమాణవేదులును, భరతమతంగ 'కోహలదత్తిల'[1] చతుర్విధనృత్య విద్యాసమర్థులును, నాశుచిత్రమధురవాక్యకవితాప్రచండులును, నందదండెందంబున కానందంబు సందడింప నందం బగుమందానిలంబుచే ప్రుందు చామరంబులం బొందుపఱుచుసుందరీజనసందోహంబును బరివేష్టించి యుండఁ బేరోలగంబునం గూర్చుండిన యవసరంబున. 60

చ. బకసుబలాత్రిసూనుభృగు – భార్గవనారదనేత్రపాదకౌ
శికఘటజాతగాలవవ – సిష్ఠపరాశరవామదేవశౌ
నకకపిలాదిసమ్ముని–ణంబులు ప్రీతిగ నేఁగుదెంచి పా
వకనిభమూర్తి రాము జన – వల్లభుఁ గాంచిరి సమ్మదంబునన్. 61

ఉ. కాంచిన నారఘూద్వహుఁడు – గౌరవ మొప్పఁగ భక్తిఁదమ్ముఁబూ
జించి నమస్కరించుటయుఁ – జిత్తమెలర్పఁగఁ బ్రీతి తోడ దీ
వించి యనేక భంగులను – వేమరు సన్నుతిసేయ నంత న
క్తంచరవైరి వారిఁ గని – కౌతుక మొప్పఁగఁ బల్కె నెంతయున్. 62

చ. [2]అలకువ లేనినిష్ఠలను – యజ్ఞసుకర్మము లాచరించి వే
ల్పులకు సుఖంబులం దగిన – పూజ లొనర్చి భవాంబురాశిలో
వెలువడ నీఁద నేర్చి ఘన – వేదపథంబున సంచరించఁగాఁ
గలుగునె వేడ్కతోడుతఁద్రి–కాలము మీకు నిజాశ్రమంబులన్. 63

క. బృందారకు లనవరతము
గ్రందున మఖశాలలందుఁ – గడుపారంగాఁ
గొందురె భుక్తిని విఘ్నము
లెందును గైకొనక తపము – లీడేరుఁ గదా! 64

1. కాహళదంతి – పూ.ము. కోహలుఁడు, దత్తిలుఁడు సంగీత శాస్త్ర కర్తలు.
2. అలకువ = వైముఖ్యము శ.ర. ఇదే ప్రయోగము

చ. అన విని కుంభజుండు మది – హర్షపయోనిధి నోలలాడి య
 య్యినకులుఁ జూచి యిట్లనియె – [1]నేడ్గడ దైవము నీవు ప్రోవఁగా
మనికిని నేమి వెల్తి మిము – మానసవీథిని నెట్టిజంతు వై
నను నిమిషంబు నిల్పినను – నానుసుఖంబులు గాంచు రాఘవా. 65

ఉ. భానుకులేశ! దైత్యకుల – భంజన! మి మ్మొకజిహ్వవానికిన్
మానవమాత్ర మంచుఁ బలు – మాఱు నుతింపఁగ నెట్లు చెల్లు నా
జానకి యాదిలక్ష్మి జల –జాతదళాక్షుఁడ వీవు లీలతో
నీనిఖిలంబుఁ బ్రోవ జని – యించితి దేవ సురక్షణార్థమై. 66

వ. కావున మనుష్యావతారంబందు దుష్టనిగ్రహశిష్టప్రతిపాలనంబు సేయం గారణ పురుషుండవై. 67

ఉ. శైశవవృత్తిఁ దాటకిని – జట్టలుదీర్చి ప్రతిజ్ఞ దక్కఁగాఁ
గౌశికమౌనియధ్వరముఁ – గాచి సుబాహు నణంచివైచి యా
కాశనదీప్రవాహధరు – కార్ముక ముద్ధతిఁ ద్రుంచి సర్వభూ
మీశులు మెచ్చ సీతను గ్ర–హించవె భార్గవుత్రుళ్లడంచవే! 68

తే.గీ. తండ్రియానతి నెంతయుఁ – దలను మోచి
తపసివేషంబు ధరియించి – ధరణినాథ!
దుష్టదైత్యు విరాధుని – దొడరి చంపి
సంయముల కీవె యభయహ–స్తంబుఁ బేర్మి. 69

ఉ. ఆర్పులు నింగిముట్ట నొక – యప్పు డదల్చి జగంబు లన్నియున్
ఏర్పడ మ్రింగఁ జాలుకడి – మెంతయుఁ గల్గి చరించునట్టియా
శూర్పణఖన్ వడిన్బొడిసి – చోద్యము మీఱఁగ ముక్కు బొత్తిగా
దర్పముతోడఁ గోసి బలు – దానవకోటికి భీతిసేయవే. 70

క. ఖరదూషణాదిరాక్షస
వరులను దండించి కపట – వర్తన మెడలన్
శరవహ్నిని మారీచుని
దరికొల్పవె యెల్లవేల్పు – తండము వొగడన్. 71

1. ఏడ్గడ=ఏడుగడ = రక్షకము. శ.ర





శా. శుంభద్గర్వభుజప్రతాపదనుజ – స్తోమంబులన్ వేచి సం
రంభం బొప్పఁగఁ గ్రీడవోలె వడి సం–గ్రామంబులం ద్రుంచునా
జంభారాతితనూజు వాలిఁ గపిరా – ట్చక్రేశ్వరుం గూల్పవే
గంభీరార్ణవ! రామభద్ర! జగము – ల్గంపింప నొక్కమ్మునన్. 72

క. కర మర్థితో విభీషణుఁ
డరలే కేతెంచి కనిన – నభయం బీవే
శరణాగతి రక్షామణి
బిరుదాంకుఁడ వనుచు మిమ్ముఁ – బేర్కొనుటొప్పున్. 73

శా. ఉద్యజ్జ్వాలినదంబు సర్వసమరో – ద్యోగంబు మీఱన్ ధను
ర్విద్యాప్రౌఢిమతోడ మించి పటుదో – ర్వీర్యంబు రెట్టింపఁగా
ఖద్యోతప్రతిబాణ మేసి జలధిం గర్వం – బరంజేసి యు
ద్ధోద్యోగంబున లంకకున్ వనచర – వ్యూహంబుతో నేఁగవే. 74

గీ. కమలజాండంబు లన్నియుఁ – గనలి మ్రింగఁ
గలుగుశక్తిని నుగ్రుఁడై – మెలఁగునట్టి
కుంభకర్ణాదిరాక్షస – కోటిఁగినిసి
మాటమాత్రనఁ జంపవే – మనుజనాథ! 75

శా. కేలీలీలవిహార మొప్పఁగను సు–గ్రీవుండు దా మెచ్చఁగాఁ
గైలాసాచల ముబ్బ నెత్తి సురలం – గారించి దుర్వారుఁడై
చాలం గ్రొవ్విన రావణాసురుని ని–శ్శంక న్నణంగించి సు
శ్రీల న్నుండఁగ నీకె కాక కలదే – చింతింప నెవ్వారికిన్. 76

వ. అని యనేకప్రకారంబుల స్తోత్త్రంబు చేసిననమ్మునిపుంగవుఁ గరుణాకటాక్షామృత ధారాప్రవాహంబునం దేల్చి హనుమంతుం జూపి భూపాలుం డిట్లనియె. 77

క. మునినాథ వినుము చెప్పెద
హనుమంతుసహాయ మొప్ప – నసురులనెల్లన్
దునుమాడి సీతఁ గ్రమ్మఱఁ
గొనివచ్చితి నన్ను నేల – కొనియాడంగన్. 78

క. పరికింప మారుతాత్మజు
చరితము లిట్టిట్టి వనుచు – సన్నుతిసేయన్

గరుడోరగామరాసుర
వరులకు బ్రహ్మాదులకును వశ-మే? తలఁపన్. 79

క. కావున మునివర మాకును
నీవాయుసుతుండు చేయు - హితకృత్యంబున్
భావింపఁ గొఱంత వెట్టక
యీవొప్పఁగఁజెప్పఁగొంత - యెఱిఁగింతుఁదగన్ 80

సీ. సీతఁ గోల్పడి మేము - భూతలం బెల్లను
వెదకుచుఁ గిష్కింధఁ - గదిసి యుండ
మమ్ము నత్తఱిఁ గాంచి - మధురవాక్యంబులఁ
బ్రియము పుట్టంగ సం - ప్రీతిఁ బలికి
కమలాప్తసూనుండు - కపిసమూహంబుతో
సమ్మతి గొలువంగ - సంధిఁజేసి
యతిభక్తి నాచేతి - యంగుళీయక మంది
యవలీలతోడుత - నబ్ధి దాఁటి

తే.గీ. రక్కసులచేతిబాధలఁ - జిక్కువడక
జనకనందన కే మున్న -చంద మెల్లఁ
దెలియ వినిపించి యత్తన్వి - వలనివార్తఁ
దెచ్చె నీతఁడు మాకును - మెచ్చులొదవ. 81

సీ. తరులు శైలంబు లీ -తఁడు దేకయున్నను
బాథోధి తాఁగట్టు - వడునె తొలుత
నెగసి కోటలమీఁది - కితఁడు ప్రాఁకక యున్న
లగ్గపట్టఁగఁ జేరు - లాగు గలదె
దనుజసంఘ మితఁడు - దర్ప మడఁప కున్న
వడి గెల్వవచ్చునే - వాంద్రఁ బోరి
యేపుమై సంజీవి - నితఁడు దేకున్నను
సౌమిత్రి బ్రదుకునే - సమరభూమి

తే.గీ. నోడయును బోలె నితఁడొడ - గూడకున్న
రావణాంబుధి దాఁటంగ - నావశంబె





యనుచు హనుమంతు - నెంతయు నభినుతింప
నయ్యగస్త్యుండు విని యపు - డతనిఁ బలికె 82

క. శ్రీరామచంద్ర! సకల
క్ష్మారమణనతాంఘ్రిపద్మ - సంతతధర్మా
చారుం డగు నీ మారుతి
కారయ మీ రానతిచ్చి - నంతయు నొప్పున్. 83

క. [1]పుడమిదొర తపసు లైమీ
రడవికిఁ జని యిపుడు పురికి - నరుదెంచితి రీ
నడుమఁ గలవార్త లన్నియు
నెడపక మాయోగదృష్టి - నెఱుఁగుదు మరయన్. 84

క. హనుమంతుఁ దనఘ! తాఁజే
సినకార్యము మీకు నెఱుఁగఁ - జెప్పఁడు మీరున్
గని విని యెఱుఁగర యొక్కటి
వినుపించెద దాని వినుఁడు - విస్మయ మొదవన్. 85

ఉ. అంబుధిఁగట్టి లంకఁగడు - నాగ్రహమొప్పఁగఁ జుట్టుముట్టి ది
వ్యాంబకవహ్నిచేత నసు-రావళి నెల్లను మండఁ బెట్టి ఘో
రంబుగఁ గుంభకర్ణుని శి-రంబు దురంబున జొత్తువెట్టి వై
రంబున గిట్టి సర్వసుర - రాజి నుతింపఁగ మీర లుండఁగన్. 86

ఉ. భూవరచంద్ర యత్తఱిని - బోరఁగ నోపక వెచ్చనూర్చుచున్
రావణుఁడొంటిఁజిక్కి మఱి - రాత్రి రసాతలలంక యేలు మై
రావణు సంస్మరించుటయు - గ్రక్కున వాఁడును ధీరచిత్తుఁడై
రావణు వచ్చి కాంచె నను-రాగ మెలర్పఁగ నప్పు డెంతయున్ 87

వ. ఇట్లు పొడఁగాంచుటయు బహుప్రకారంబుల నాదరించి దివ్యరత్నాభరణంబులు గట్టనిచ్చి యర్హపీఠంబునం గూర్చుండ నియమించిన నతం డతికుతూహలంబునఁబొంగి రావణున కిట్లనియె. 88

క. ఏమిటికి రాత్రి నన్నును
నీమదిఁదలఁచుటకు నిపుడు - నిను గాచుట కే

1. 'పుడ మీశ' - అని వ్రాఁత ప్రతులలో నున్నట్లు పూర్వ పీఠిక.

ప్రేమమున నరుగుదెంచితి
నేమివిచారంబు చెప్ప - వే యని పలుకన్. 89

మత్తకోకిల. నీవు నాకును గల్గి యుండఁగ - నిష్ఠురాస్త్రచయంబుచే
దేవతావలి నెల్ల దోలితి - దీను లై చెడి పాఱ మై
రావణాసుర! యిప్పు డొక్క దు-రంబు గల్గెను దాని నే
త్రోవఁబెట్టెదొ కాక పొమ్మని - త్రోచిపుచ్చెదొ చెప్పినన్. 90

మత్తకోకిల. పాపదూరము గానిమంత్రము - భక్తి చాలని మైత్రియున్
గోపవర్జము గాని దానముఁ - గూర్మి గల్గని కాంతయున్
ఆప దైనను రాని చుట్టము - నాజ్ఞ మీఱిన పుత్రుఁడున్
దాపు లేనిరణంబు నేటికి - దానవోత్తమ చూడఁగాన్. 91

మత్తకోకిల. కావఁ బ్రోవఁగఁ జాలుసత్త్వము - గల్గి యాత్మజనంబులన్
బ్రోవనాడినవాఁడు క్రమ్మఱఁ -బుణ్యలోకవిహీనుఁడై
పోవునంచును బ్రహ్మ చెప్పఁడె - పూర్వకాలమునందునన్
గావునన్ నిను వేఁడు కార్యముఁ - గాకుసేయక చేయుమీ. 92

క. వినిపించెద నాకార్యము
దనుజేశ్వర! చేయవలయుఁ - దద్దయు ననినన్
వినయమున నతినితోడుత
ననియెను మైరావణుండు - హర్షం బొదవన్. 93

ఉ. ఆలములోన వజ్రి నుఱు - మాడి ధనంజయు నేపుమాపి యా
కాలుని గొట్టి కోణపతి - గర్వ మడంచి పయోధినాథునిం
దూలఁగఁ దోలి మారుతము - త్రుళ్ళణఁగించి కుబేరు మిక్కిలిన్
నేలను గూల్చి శూలధరు - నీఱుగఁ జేసితి వద్భుతంబుగన్. 94

ఉ. తోలితి వెల్లదేవతల - దూరగఁ బాఱఁగ విక్రమంబుగన్
వ్రాలితి వబ్జసూనుహరి వాసుకికంకణులట్లు పేర్మితో
నేలితి వెల్లలోకములు - నెవ్వరు మార్కొనకుండ ధీరతన్
జాలితి వెంతయున్ దనుజ - సంఘముఁ బ్రోవఁగ రావణేశ్వరా! 95

చ. కటకట! యిట్టినీకు నొక - కార్యము పుట్టఁగ రావణేశ! ధూ
ర్జటి యెదిరించెనో? కమల - సంభవుఁ డల్గెనొ? విష్ణుదేవుఁడు



త్కటపటుకోప మెత్తి వడిఁ - గ్రాలుచు వచ్చెనొ? కాక యిప్పుడే
మిటికిని నిన్నుఁ బోరుటకు - మిన్నక యెవ్వఁడు గ్రొవ్వెఁ జెప్పవే! 96

క. చెప్పిన నామాయలచేఁ
గప్పుదు బ్రహ్మాండ మంధ - కారము దోఁపన్
దప్పించి యెందుఁ బోయిన
నొప్పింతును బరగ నీకు - నుల్లం బలరన్. 97

క. నావుడు నా మాటలకును
భావంబున మెచ్చి పొంగి - ప్రస్ఫుటముగ మై
రావణు తోడుత నప్పుడు
రావణుఁడిట్లనియె రామ! - రవికులతిలకా! 98

సీ. దశరథుపంపునఁ - దపసివేషంబులు
ధరియించి జనకనం-దనయుఁ దాను
సౌమిత్రి గొలువంగఁ - జనుదెంచి రఘురాముఁ
డడవులలో నున్న - యవసరమున
మనశూర్పణఖ వోయి - తనుఁ గోరుటయు దాని
నాసికావిచ్ఛేద - నంబు సేయ
నందుకై ఖరదూష - ణాదులు మడసిన
నలఁగి మాయలు పన్ని - యతని దేవి

తే.గీ. లంక కేఁ దెచ్చి మిగుల ని - శ్శంక నుండఁ
బలవరించుచు జగమెల్లఁ - గలయ వెదికి
యంత నేఁ దెచ్చు టంతయు - నతఁ డెఱింగి
యాగ్రహంబునఁ గిష్కింధ - కరిగి యపుడు. 99

శా. దేవేంద్రాత్మజు వాలిఁ జంపి కపిరా - ద్దేశంబు పాలింప సు
గ్రీవుం బట్టముఁ బ్రీతిఁగట్టి సొరిదిం - గీశౌఘముల్ గొల్వఁ బా
రావారం బవలీల దాఁటి కడు దు-ర్వారంబునన్ లంక వా
పోవం గోటలు లగ్గపట్టి మఱియున్ - భూరిప్రతాపంబునన్. 100

సీ. అహితజయోపాయు - నతికాయు విస్ఫుట
సాంద్రమదోన్మత్తు - నింద్రజిత్తు

సంగ్రామకేళీవి-చక్షు విరూపాక్షు
 ఘోరసత్వసుపర్ణుఁ - గుంభకర్ణు
నఖిలజీవాంతకుం - డైనదేవాంతకు
 ఘనపరాక్రమధాము - ఖడ్గరోము
చిరబాహుబలగర్వ - జిహ్వు విద్యుజ్జిహ్వు
 రమణీయవిఖ్యాతు - రశ్మికేతు
తే.గీ. మహితవిక్రమసప్తఘ్ను - మకరదంష్ట్రు
నగ్ని కేతు మహాపార్శ్వు - నగ్నిపర్ణు
వజ్రకవచుఁబ్రహస్తుని - వజ్రదంష్ట్రు
నీఱుఁ జేసెను బాణాగ్ని - నిండ నెఱపి. 101

క. మఱియును బవరములందును
గఱ కెక్కినయట్టి దైత్య - గణముల నెల్లన్
బఱపుటయు నొంటబడి యీ
తఱి నాకును నిన్నుఁబ్రీతిఁ - దలఁపఁగవలసెన్ 102

క. భీమప్రతాప! నిన్నును
నామదిఁదలఁచుటకు నిపుడు - నావగ దీఱెన్
రాముని నాతనితమ్ముని
నీ మాయలు వన్ని చంపు - నిష్ఠురవృత్తిన్ 103

వ. అని యిట్లు చెప్పి విభీషణుండు మిమ్ముంగలసిన తెఱంగును జెప్పిన విని మనంబుననొండొకసేపు చింతించి మైరావణుండు రావణున కి ట్లనియె 104

క. మానుగను మాతృగర్భ
స్థానమునం దజుఁడు వ్రాయు - చందము దక్కన్
దా నింతవాఁడ ననుకొనఁ
గా నెటువలె వచ్చు నెట్టి - ఘనులకు నైనన్. 105

క. ఇనకులుల దాశరథులను
మనుజులు గాఁదలఁచి యల్ప - మతి వై చని సీ
తను నేలదెచ్చి తక్కట!
దనుజేశ్వర! కార్యమెల్లఁ - దప్పెం గదవే. 106





చ. పరులకు నవ్వుపట్టు తన - బంధుజనంబుల కెల్ల నింద య
స్థిరముల కాలయంబు కదు - సిగ్గులచేటున కాస్పదంబు స
త్పురమము త్రోవ గాక కదు - భాసురకీర్తికి మూలహాని యె
వ్వరికిఁ బరాంగనం గలియ - వర్తనయే బల మెంత గల్గినన్. 107

సీ. కరుణాకటాక్ష మే - ఘనునికన్నుల నుండు
 దాక్షిణ్య మేపుణ్యుఁ - దగిలి యుండు
సత్య మేప్రభువాత్మ - నిత్యమై యుండును
 శాంత మేధన్యుని - చెంత నుండు
నమృతవాక్యంబు లే - యధిపుజిహ్వను నుండు
 నుపకార మేధన్యు - నూహ నుండు
దాన మేబలియుహ-స్తమునఁ బాయక యుండు
 మాన మేయనఘు - నెమ్మది వసించు
తే.గీ. నతని జయలక్ష్మి చేకొను - నలఘుమహిమ
సకలలోకంబు లెల్లను - సన్నుతింప
నాయురారోగ్యసంపత్క - రాభివృద్ధి
మీఱి యుండుట యద్భుతం - బే తలంప. 108

క. ఈవిధిఁ జరించుపుణ్యుఁడు
గావున జయలక్ష్మి నతఁడు - గైకొనఁగా నీ
కీవిధమున వ్యథనుండం
గావలసెం గాదె క్రూర - కర్మము కతనన్. 109

క. సురలం బ్రోవఁగ దానవ
వరులం దనదివ్యబాణ - వహ్నిని గాల్పం
బరమాత్ముఁ డైన విష్ణుఁడు
నరుఁడై జనియించె రామ - నామం బలరన్. 110

ఉ. రాక్షసలోకనాథ! రఘు -రాముని నాజి నెదిర్చి గెల్వ ఫా
లాక్షుని నమ్మరాదు విను - మాగ్రహ మొప్పదు సీత ముందుగా
నక్షయదివ్యరత్నకన - కాంబరరాజిని గాన్కఁ గొంచు నీ
వీక్షణమందు నేగి కను - మెంతయు నాతనిపాదపద్మమున్. 111

క. శరణంబు వేఁడితేనియుఁ
గరుణారస మొప్ప నిన్నుఁ - గాచును జంపం
బరికింపఁడు రఘురాముని
సరి గలరే లోకములను - జర్చింపంగన్ 112

వ. అని యుపదేశించిన నతండు తొలుత మనంబునం బెనంగొని యున్న కోపంబు ముప్పిరిగొనఁ బదిముఖంబులం గలకన్నుల నెఱమంట లుప్పతిల్లవీక్షించి యిట్లనియె.

ఉ. ఇత్తునె సీత భీతి నిటు - లేటికిఁ బల్కెదు పందకైవడిన్
[1]ఇత్తఱి రామలక్ష్మణుల - యే పణఁగించి కృతాంతుఁ జేరఁగా
మొత్తి రణంబులోపలను - మ్రొగ్గినదైత్యులనెల్లఁగొంచు నే
వత్తునొ కాక నామనము - వాంఛితముల్ సమకూర శూరతన్. 114

క. ఇచ్చట నినుఁదలఁచినపని
మెచ్చఁగఁ జేసితివి చాలు - మెల్లన నిఁక నీ
వచ్చిన త్రోవనె క్రమ్మఱ
విచ్చేయుము వలవ దిచట - వెఱచెద వనినన్. 115

ఉ. రావణ! చిత్తగింపుము దు-రంబునఁ గన్గొన నాకు భీతె నే
లావుఁజలంబుపేర్మి సకలంబు - నెఱుంగనె బుద్ధిఁ గాంతు నా
భావములోనఁ దోఁచుటకుఁ - బల్కితి నంతియె కాక పోయి యో
ధావళి మెచ్చ నీరిపుల - నందఱఁజంపెదఁ గోప మేటికిన్. 116

క. కావున నామాయలచే
భూవరులం గొంచు నాదు - పురి కేగి మహా
దేవికిని భద్రకాళికి
రావణ బలియిత్తు నీకుఁ - బ్రమదం బెసఁగన్. 117

క. ననుఁ బంపు మీక్షణంబునఁ
జని కార్యముఁ జక్కపెట్టి - చతురత మతి నే
నినుఁ గాన వత్తు ననవుడు
దనుజేశ్వరుఁడతని బంపెఁ - దగఁబ్రియ మెసఁగన్. 118

1. వడిన్నిత్తఱి - పూర్వముద్రణము



వ. అని రావణువలనియవ్వార్త యంతయు నెఱింగి వేగులవారు మీరు రణశ్రమంబున నిద్రాసక్తు లైయున్న సమయంబున విభీషణుపాలికిం బోయి రావణమైరావణుల మాటలు సకలంబునుం జెప్పిన విని మనంబులోపల భీతిల్లి యతండు సుగ్రీవాంగద పనసనలనీలాంజనేయజాంబవదాదులతో నిట్లనియె.

క. నృపతులు నిద్రం జెందిరి
కపటము పుట్టె నని తెలుపఁ - గా రా దెందుం
గపులార! మనకు నిప్పుడు
విపరీతపువార్త వచ్చె - వింటిరె దానిన్ . 120

క. సుతబంధుమిత్రకోట్లును
జతురంగబలంబు దనుజ - సంఘము నట్టుల్
హతమైనను దానొక్కఁడు
గతి చెడియును రావణుండు - గర్వము పేర్మిన్. 121

క. పాతాళలంక యేలెడు
నాతని మైరావణాఖ్యు - నాత్మఁ దలంపన్
బ్రీతిని జయ్యన నతఁడును
నేతెంచి దశాస్యు గాంచె - నెంతయుఁగడఁకన్. 122

ఉ. కాంచిన రావణుండు తన - కార్యముభావము గానఁ జెప్పి ప్రా
ర్థించి దినేశవంశజులఁ - గృత్రిమలీలలఁ జంపు మంచుఁబు
త్తెంచిన వచ్చినాఁడఁట ప్రతిజ్ఞ చలంబును మీఱ నొందు భా
వించఁగ రాదు వాని నొక - వేషము దాల్చిన నేమి సేయుదున్. 123

క. మనలోన మనకుఁగలహము
పెనుపంగా నేర్చుమిత్ర - భేదము పుట్టన్
ఎనమంద్రలోనఁ బదుగురఁ
గనుమాయల మొఱఁగి తివియఁ - గా నేర్చుఁదగన్. 124

ఉ. చెప్పఁగరానిమాయల వి-చిత్రపురూపులు దాల్చి యింక వాఁ
డెప్పుడు వచ్చునో యిటకు - నేమఱి యుండినఁ గార్య మంతయుం
దప్పెడుఁ గాన రాఘవులఁ - దద్దయుఁ గాచువిధంబు గొబ్బునన్
జొప్పడఁ జెప్పుఁడా తెలియ - సూనృతవర్తనులార! నావుడున్. 125

మ. దిననాథాత్మజుఁ డాంజనేయుని లస – త్ప్రీతిం దగం జూచి ము
న్నును సౌమిత్రికి మాకుఁ బ్రాణము లొగి – న్నూల్కొల్పి రక్షించి తీ
వనఘా! నేఁడును నీవు కాక కలఁడే – యంభోజమిత్రాంశపా
వనులం బుణ్యుల రామలక్ష్మణులఁ గా – వన్నొక్కఁడిం దెమ్మెయిన్ 126

మ. పరమార్థంబుగ నీవిభీషణుఁడు దాఁ – బల్కెన్ మనం బింక సో
మరిచందంబున నుండు టొప్పదు వెస – న్మాయాసురాధీశుచే
ధరణీశుల్ మృతిఁ బొందకుండఁగ జయో – త్సాహంబునం గాంచి యా
[1]చిరకీర్తిన్ విలసిల్లవే యనుటయున్ – శీఘ్రంబునన్ ధీరుఁడై. 127

శా. నక్షత్రగ్రహపఙ్క్తులోలిఁబదవి[2] – న్యస్తంబులై యొప్పఁగా
నక్షీణస్ఫుటసత్త్వుఁ డై పెరిఁగి బ్ర – హ్మాండావళుల్ మీఱుచున్
రక్షోనాయకు మిమ్ము లక్ష్మణుఁ గపీం – ద్రశ్రేణులన్ లోనుగా
దక్షుండై ఘనవాలప్రము జగ – త్ప్రాణాత్మజుం డిచ్చినన్. 128

క. కరువలితనయునిఁ బాదప
చరులెల్లను బొగడి రాత్మ – సంతోషమునన్
సుర లపుడు పుష్పవర్షముఁ
గురియించిరి దివిని నుండి – గొబ్బునఁ బరవన్. 129

గీ. వరుసతోడుత నవ్వాల – వప్రమునకుఁ
బ్రహరివర్తించి రయ్యెడ – భయములేక
యర్కసూనుండు నారావ – ణానుజుండు
సమ్మదంబున నొక్కొక్క – జామునందు. 130

క. "చాలబల చాలబల యో
పాలంబులచార"యనుచుఁ – బదిలముతోడన్
మేలుకొనంగాఁబిలుచుచుఁ
గాలాచక తిరుగుచుండ్రి – ఘనసత్త్వమునన్. 131

వ. అక్కడ మైరావణుండు. 132

1. చిరకీర్తుల్విలసిల్లవే – పూ.ము
2. విపద విన్యస్తంబులై – పూ.ము





క. అంతటఁదనపురికిని జని
యంతఃపురమందు నొక్క – యనువగుచో నే
కాంతమున నుండి తనకుల
కాంతను మాతంగిఁ బిలువఁ – గాఁ బంపుటయున్. 133

ఉ. అన్నువకౌనుదీఁగయసిఁ – యాడఁగఁ బయ్యెద[1]ఁ బిక్కటిల్లుచున్
జన్నులు తొంగలింప మరు – సానను దిద్దినరూపులో యనన్
గన్నులు బిత్తరింపఁగను గం – దొకయించుక లేక తిన్ననై
[2]పున్నమ చంద్రు నొప్పిదముఁ – బోలెడుమోమున నవ్వుదేరఁగన్. 134

ఉ. మారునిమోహనంబునకు – మాడ్కిని బ్రాణము లైదు నున్నబం
గారపుబొమ్మరీతిఁదొలు – కారుమెఱుంగులప్రోకభంగి శృం
గారరసంబునం దొలచి – కట్టినపువ్వులయెత్తుభాతి న
న్నీరజగంధి వచ్చి తగ – నిల్చెను బ్రీతిని భర్తముందటన్. 135

[3]ఆ.వె. అతివ యిట్లు నిలిచి – యల్లన మోమెత్తి
మగనిదిక్కుఁజూచి – మనములోన
వగచి మిగుల దీన – వదనయై పల్కెను
వడఁకుకొనుచు నోరు – వడియు లేక 136

ఉ. కన్నుల వాడుదోఁచినది – కాంతిఁ దొఱంగిన దాననంబు మే
నున్నతి చాలఁదక్కినది – యొప్పక యున్నది గర్వరేఖ పై
కొన్నది మేనలక్ష్మి మదిఁ – గుందుచునున్నది నీకు నేల నా
కన్నియుఁ జెప్పవే తెలియ – నాత్మ గలంగెడు జీవితేశ్వరా! 137

క. అన విని మాతంగిని గనుఁ
గొని మైరావణుఁడు వల్కుఁ – గోమలి! నీకున్
మనమున బెగడఁగ నేటికి
విను మొకకార్యంబు తెఱఁగు – వినుపింతుఁదగన్. 138

1. పయ్యెద పిక్కటిల్లుచున్ – పూ.ము.
2. పున్నపుఁజంద్రు – పూ.ము
3. గీ – పూ.ము

ఉ. రాముని మోసపుచ్చి యభి-రామను సీతను గొంచు వచ్చి కై
కో మదిఁగుంద మర్కటులు- గొల్వ నతండును లంకఁ జొచ్చి సం
గ్రామములోన దానవని - కాయము నెల్లను వీటిఁ బుచ్చినన్
[1]డీమసమెల్లఁ దక్కి తన - డెందములోపల నుమ్మలించుచున్. 139

క. నను నిపుడు రావణాసురుఁ
డనురక్తిం దలఁప నచటి - కరిగితి నరుగన్
ననుఁ బెద్దఁజేసి యాతఁడు
తనకార్యము సెప్పి నాకుఁ - దగులము సేసెన్. 140

క. కావునను మొఱఁగి దశరథ
భూవరతనయులను నాదు - పూనిక దక్కన్
ఈవేళఁ దెచ్చి కాళిక
కే (వొ)ప్పన చేతుఁదలఁక - కిమ్ముల దరుణీ! 141

చ. అన విని కీలుబొమ్మగతి - నంబుజలోచన బిట్టు గూలి మే
దిని బడి మూర్ఛ నొంది - తను దెల్వఁగ మెల్లన సేద దేఱి య
ద్దనుజవరేణ్యుఁజూచి మది - తల్లడ మందుచు గద్గదస్వరం
బునఁ గనువిచ్చి పల్కెఁదన - బుద్ధిని దోఁచిన కార్యపద్ధతుల్. 142

చ. కటకట! యేటి కయ్య! యప - కారము పుట్టెఁగదయ్య! ప్రాణసం
కట మగుపూన్కి కిం దగవు - గాదన కిట్లు సహింతు రయ్య! నీ
పటుతరబుద్ధి యేల భువి - పాలుగఁ జేసితి వయ్య! నేఁడు నా
కిటువలె జేటువార్తవిన - నేటికిఁ జెప్పితి వయ్య! వల్లభా! 143

చ. చదువులు గొంచు సోమకుఁడు - సాగర ముద్ధతిఁ బాఱి చొచ్చినన్
వదలక మీనమై కినిసి - వారిధిలోపల వానిఁజంపి య
చ్చదువులు గ్రమ్మఱం - గమల జాతుని కిచ్చిన యాదిదేవునిన్
సదమలమూర్తి దైత్యకుల - సంహరు రాముడుఁగా నెఱంగుమీ! 144

చ. బలిమిని దేవదానవులు - పాలసముద్రముఁద్రచ్చుచోట న
గ్గలికకు మందరాచలము - గ్రక్కునఁ గ్రుంగిన కూర్మరూప మై

1. దీమసమెల్ల - పూ.ము. యతి భంగము.
'దిగ్గు-డిగ్గు', 'దొంగ-డొంగ' మొదలగువానివలెఁగవి ప్రయోగముననుసరించి 'దీమస-డీమస' రూపముల నంగీకరింపవలెను.



యలవడ నుబ్బ నెత్తిన కృ-పాంబుధి నవ్యయు నాదివిష్ణునిన్
జలజదళాక్షు నచ్యుతుని శౌరిని - రాముఁడుగా నెఱుంగుమీ! 145

చ. అనుపమలీల భూమిఁ గన - కాక్షుఁడు గొంచు రసాతలంబుఁ జొ
చ్చినను వరాహరూపమున - శీఘ్రత వానిని ద్రుంచి దేవతల్
దనుఁ గొనియాడఁ దొంటి గతి - ధారిణి నిల్పిన యట్టి దేవునిన్
సనక సనందనాది ముని - సన్నుతు రాముఁడుగా నెఱుంగుమీ! 146

చ. సకలము విష్ణుదేవుఁ డని - సన్నుతి సేసెద వంచునా హిర
ణ్యకశిపుఁ డాత్మజుం గినిసి - నంతటిలో నరసింహరూప మై
ప్రకటవిచిత్రఘోరనఖ - పఙ్క్తిని వానిని జీఱినట్టి పా
వకశతకోటితుల్యు బుధ - వత్సలు రాముఁడుగా నెఱంగుమీ! 147

చ. త్రిదశులఁ బాఱఁదోలి బలి - తేజముతో దివి నేలుచుండ న
య్యదనున గుజ్జురూపమున - నాతనిఁగాంచి రసాతలంబునన్
ముదమున నుండఁ జేసి తన - మూర్తి జగంబులఁ బిక్కటిల్ల స
మ్మదమున నుండుదేవు నల - మాధవు రాముఁడు గా నెఱంగుమీ148

చ. మునికి జనించి రాముఁడన మూర్తి - వెలుంగఁగఁ గార్తవీర్యునిం
దునిమి ధరిత్రి విప్రులకుఁ - దోరపుభక్తిని ధారవోసి య
త్యనుపమధీరుఁ డైన పరు - నాగమసన్నుతపాదపద్మునిన్
ఘనకరుణాకటాక్షుఁద్రిజ - గత్పతి రాముఁడు గా నెఱంగుమీ! 149

వ. వెండియు నొక్కరహస్యంబు పెద్దలు చెప్పినవిధంబునఁ జెప్పెద నాకర్ణింపుము.

చ. పలుమఱు రావణాసురుని - బాధల కోర్వక యెల్లదేవతల్
దలఁకుచు దుఃఖవార్ధి నహి - తల్పముపై శయనించుదేవునిన్
జెలువుగఁ గాంచి విన్నపము - చేసిన నాతఁడు వానిఁ జంపఁగా
జలజహితాన్వయంబునను - సంభవ మయ్యెను రాఘవుండనన్. 151

క. సురలెల్ల నపుడు పాదప
చరు లై జనియించి రధిక - సత్వములలరన్
దురమునను వాని గెల్వఁగఁ
దర మే బ్రహ్మాదులకును - దలపోయంగన్ . 152

క. కారణపురుషుఁడు లోకా
ధారుఁడు కరుణాకరుండు – దనుజాంతకుఁ డా
శ్రీరాముఁడు నీ కాతని
మైరావణ! చెనకితేని – మనరా దెందున్. 153

క. వడి బ్రాను విఱిచి మీఁదికిఁ
బడఁదివుచుకొనంగఁదలఁచు – పాలసుభంగిన్
కడుఁ బోరి రాముబారికిఁ
దొడిబడఁ జూచెద విదేల – దుర్మతి పుట్టెన్. 154

క. జననాథునకును నీకును
మనమునఁ దలపోయ హస్తి – మశకాంతరముల్
విను మెఱుఁగ కేల పోయెద
వనినన్ విని యతఁడు వలికె – నంగనతోడన్. 155

గీ. ఏల చెప్పెదు నీ వింత – జాలిపడుచు
నేను విన్నాఁడ మదినిండ – నీకు మున్న
యాదివిష్ణుండు రఘురాముఁ – డౌట సురలు
మర్కటోత్తము లగుటయు – మధురవాణి! 156

చ. దనుజవరేణ్యుఁ డిష్టుఁ డని – తద్దయు న న్నొగి గారవించినన్
వనరుహమిత్రవంశజుల – వావిరిఁజంపెద నంచు శూరతన్
బనివడి వచ్చి యింక మగ – పాడి దలంకఁగ నీతిశాస్త్రముల్
వినినను నవ్వరే యకట! – వీరజనంబులు నన్ను మేదినిన్. 157

క. ఈ కాయము నిజ మని యొరు
దూఁకొని విడనాడి కాంచు – దుర్గతి మేలో!
కాకుత్థ్సుచేతఁ దెగినను
వైకుంఠపదంబు మేలొ – వారిజనేత్రా! 158

క. కావున నాదుప్రతిజ్ఞయు
రావణుని చలంబుఁదక్క – రయమునఁ జని నే
నా వసుధేశుని దెచ్చెద
నీ వేగుము లోని కనిన – నెఱి దూలంగన్. 159



గీ. కమ్మకస్తురి చెక్కులఁ – గరఁగి జాఱఁ
జన్నుగవ మీఁది పయ్యెద– చంగలింప[1]
నడుగుదమ్ములు మిక్కిలి – తడబడంగ
నరిగె లోనింటి కడలుచు – నలరుబోఁడి 160

వ. అని చెప్పఁ దరువాతివృత్తాంతం బెట్లని యడిగిన. 161

చ. యవనకళింగవంగమగ – ధాంధ్రపుళిందదశార్ణకోసల
ద్రవిడవిదేహకుంతలవి – దర్భయుగంధరభోజమేదినీ
ధవవరమంత్రివర్గనిర – తస్తుతచారుకవిత్వకారస
త్ప్రవిమలవాగ్విలాసఘన – బంధుర! కాండవవంశవర్ధనా! 162

క. రామాంబికామనోహర!
రామాజననికరనూత్న – రతిరాజ! లస
ద్రామానుజమతసువ్రత!
రామానుజకీర్తిహార! – రసికవదాన్యా! 163

మాలిని. సుకవిజనమహీజా! – శుద్ధసత్కాంతిరాజా!
ప్రకటమతిఫణీంద్రా! – భవ్యభోగామరేంద్రా!
సకలగుణసముద్రా! – సంతతైశ్వర్యభద్రా!
వికచకమలనేత్రా! – విద్విషద్ధ్వాంతమిత్రా! 164

**గద్యము**

ఇది శ్రీభీమేశ్వరవరప్రసాద కవితాధురీణ సకలశాస్త్ర
ప్రవీణ సుకవిజనమిత్ర సర్వయామాత్యపుత్త్ర
మాడయనామధేయప్రణీతం బైన మైరావణ
చరిత్రంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

1. చంగలించు = చలించు. శ.ర. ఇదే ప్రయోగము.

# మైరావణచరిత్రము
## ద్వితీయాశ్వాసము
---



పతిసంభృతవరకరు
ణాపూరవిశేషలబ్ధ – నవగుణమూర్తీ!
రూపవతీజననవసుమ
చాపా! లేజెర్లయబ్బ[1] – సచివుని గోపా! 1

వ. అక్కలశోద్భవుండు రామభద్రున కిట్లనియె నాసమయంబున మైరావణుండు దృశ్యాంజనాకర్షణంబులును, వాదవశ్యవయస్స్తంభనంబులును, భృగుమత భేతాళమతంబులును, నింద్రజాల మహేంద్రజాలంబులును, బరకాయప్రవేశ కామరూపగమనంబులు నాదిగాఁగల వివిధవిద్యలు దనకు సాధనంబులుగా నలవరించుకొని బహు దివ్యశస్త్రంబులు ధరియించుకొని తన ప్రధానులయందుఁ గపటమాయోపాయంబులం బ్రచండు లైననూచీముఖ ఘటకుల రావించి యవ్వివరం బెఱింగించి వారును దానుం గూడుకొని చనునట్టియెడ. 2

క. సురగాలి యెదురు వీఁచెను
వఱ డొక్కటఁగూఁక వెట్టె – వసుమతి వణఁకెన్
ఉరగంబులు పొడచూపెను
హరిణసమూహంబు త్రోవ – కడ్డము దాఁటెన్. 3

ఆ.వె. ఎడమనుండి పాల[2] – కుడికి నేతెంచెను
[3]బసిఁడికంటి వీఁచె – బయలు రొప్పె
విఱిగి పడియెఁదరువు – దొరలుచు ధరమీఁద
గుండె లవియ మింటఁ – గొఱడు దోఁచె. 4

క. మఱియును దుశ్శకునంబులు
తఱచుగఁ బొడచూపఁ – దలఁపకయే క్ర
చ్చఱ హనుమంతుఁడు వెట్టిన
గుఱి గడచినతోఁకకోట – కును డగ్గరగన్. 5

---

1. లేజెర్లయప్ప – పూ.ము
2. పాల = ఒకానొక పిట్ట, చాషము. శ.ర.
3. పైఁడికంటి పక్షి = విశేషము. కనకాక్షి శ.ర.





చ. కలరవగృధ్రఘూకశుక – కాకపికాదివిహంగభీమసం
కులముల నొప్పుచున్న యొక – కుంజగుహాంతమునందు ధీరతన్
నిలిచి నిశాచరేంద్రుఁడతి – నిర్దయుఁ డప్పుడు కృత్రిమంబు లి
మ్ములఁ దలపోయుచున్ ఘటకు – మోముఁ గనుంగొని పల్కె నెంతయున్

చ. తరుచరు లేమి చేసెదరొ – తామరసాప్తకులాబ్ధిచంద్రు లే
సరవిని నున్నవారొ దను–జప్రభుతమ్ముఁడు నావిభీషణుం
డరయుచు నెందు నుండెఁజని – యంతయు నీవొగిఁ గాంచి వేగమే
మర లిట కేఁగి రమ్మనుచు – మన్నన నంపిన వాఁడు నంతటన్. 7

క. అల్లనఁ గపివేషముతో
బల్లిదుఁడై పోయి కోట – పరికించి మదిం
దల్లడ మందుచు రాక్షస
వల్లభుతోఁదిరిగి పోయి – వాఁడిట్లనియెన్. 8

ఉ. దేవ! నిశాచరేంద్ర! జిత – దేవగణేశ్వర! చిత్తగింపు నేఁ
బోవుట కేటి కొక్కకపి – పుంగవుఁ డాహనుమంతుఁ డెందు దై
త్యావళి జేరకుండ వసు – ధాధిపచంద్రుల కీశసేనకున్
దా వలయంబు గాఁగ భయదం – బగువాలపుఁగోట వెట్టినన్. 9

క. అనుపమ మగునక్కోటను
బనివడి యొక్కొక్కజాము – బలసంపదలన్
దనుజాధీశ్వరుతమ్ముఁడు
వనజాప్తసుతుండు ప్రహరి – వర్తించునెడన్. 10

క. ఉడుమండలంబుదాఁకను
వడి నేఁగితిఁ గోట దాఁట – వచ్చునొ యంచుం
గడ తెగక యంతకంతకుఁ
బొడవయ్యెను నాకు దాఁటి – పోరా దయ్యెన్. 11

చ. అన విని నేత్రకోణముల – నగ్నికణంబులు రాల నుగ్రుఁడై
దనుజవరేణ్యుఁ డాఘటకుఁ – దప్పక చూచి మనంబులోపలన్
వనరుచు భీతిఁ బొంది కపి – వాలపుఁగో టొకయద్భుతంబుగాఁ
జెనఁటి! దురాత్మ! యిట్లు కడుఁ – జెప్పెద వేటికి నాకు నావుడున్. 12

చ. ఎలిమిదలిర్ప సూచిముఖుఁ డిట్లని పల్కెను రాక్షసేంద్ర! నీ
యలఘుతరప్రతాపమున - నాజిని గెల్చితి లోకపాలురన్
బలువిడి సప్తశైలములు - బంతులకైవడిఁబట్టి యాడితిన్
వల నగుమర్కటాధముని - వాలపుఁగో టది నాకు నడ్డమే. 13

క. ననుఁబంపు మీక్షణంబున
వనచరకీటంబు వాల - వప్రము దునియం
గను గన్నవెట్టి యటు చని
దిననాయకకులుల నిటకుఁ - దెచ్చెద నని నన్. 14

క. సూచిముఖు నపుడు కరుణా
లోచనుఁ డై చూచి నాదు - లోకములోనన్
నీచను విచ్చెదఁ దెమ్మిట
కేచందమునందునైన - నినవంశుజులన్. 15

చ. అని యిటు గారవించి తగ - నంపిన వాఁడును నేగి యంజనా
తనయుని వాలవప్రమటు - దగ్గరి[1] త్రిమ్మరి చూచి మిక్కిలిన్
మనమునఁ జోద్య మంది తన - మానుష మూఁతగఁ జేసి ధాత్రి ము
క్కునఁదగఁ గన్న పెట్టె నల - కోమలభంగిని వేయు క్రోశముల్. 16

ఆ.వె. [2]ఇట్లు కన్నపెట్టి - యిక్క చక్కఁగఁ ద్రవ్వి
లోని కేగుఁగాక - నే నటంచుఁ
గడఁకతోడఁ ద్రవ్వఁ - గడలేక యవ్వాల
వప్ర మచట నున్న - వాఁడు భ్రమసి. 17

క. అరుదుగఁ బదియోజనములు
ధరఁగ్రమ్మఱ లోఁతుఁ బరపుఁ - ద్రవ్వుచు నచటన్
గరువలితనయునివాలముఁ
బరికించి నిశాచరుండు - భావములోనన్. 18

క. జగతీతలంబుఁ ద్రవ్వఁగ
మొగ మోర్చుంగాక యంచు - ముట్టుదు నింకన్

1. దగ్గరి - పూ.ము. యతి భంగము
2. గీ - పూ.ము.





నగచరునివాలమధ్యముఁ
దెగఁ ద్రవ్వకపోదు ననుచు - ధీరతతోడన్. 19

ఆ.వె. [1]మొరయుకొనుచు సూచి - ముఖుఁ డంతలోపలఁ
దగరు చేరి కొండఁ - దాఁకుభంగి
మానితఘనవజ్ర - మయ మైన కపితోఁక
మోరచాపి తాఁక - ముక్కు విఱిగె. 20

ఉ. భూవర! యిట్లు నాసికము - పోయన రక్తముచేత బ్రుంగుడై
జేవుఱుఁగొండచందముగఁ - జెయ్యులు దక్కి నిశాచరుండు వా
పోవుచు లోన సిగ్గుఁదల - పోయుచు వచ్చినత్రోవ నేగి మై
రావణుఁ గాంచి మ్రొక్కి కడుఁ - గ్రమ్మినభీతిని బల్కె నెంతయున్. 21

చ. ఘటకునిమాట నిశ్చయము - గా దనవచ్చునె రాక్షసేంద్ర! మ
ర్కటపతితోఁకకోటతుద - గానఁగ నోపక నేను ముక్కునన్
గిటివిధమొప్ప భూమి తల - క్రిందుగఁ గన్నము చాలఁదీర్చి యం
తటఁ జనుచోటఁ గ్రమ్మఱను - దారుణవాలపుఁగోటఁ గాంచితిన్. 22

ఆ.వె. [2]కాంచి దానినడుమ - ఖండింతు ననిపూని
వీఁకఁ దాఁక ముక్కు - విఱిగిపోయె
నెన్నఁ డిట్టిదాని - నెఱుఁగ నేమనిచెప్ప
వచ్చు హనుమవాల - వప్రమహిమ. 23

చ. పనివడి యేటికిన్ మనకుఁ - బాఱెడిబండ్లకుఁ గాళ్లు సాఁపఁగా
వినుము నిశాచరేంద్ర! యొక - విన్నప మొక్కటి పక్షికంతుఁ డే
వననిధిఁ గూలె నేమి జన - వల్లభు లేవిధిఁ బోయి రేమి వ
చ్చినగతి దప్పకుండఁగను - శీఘ్రమ వెళ్లుట మేలు నావుడున్. 24

ఉ. ఓరి దురాత్మ! నాయెదుర - నోటమితో ముని మించి శూరతన్
బీరము లాడి యిప్పు డతి - భీతిని బల్కెదు పంద కైవడిన్
వారక సప్తశైలములు - వప్రములైన నగద్దలందు న
వ్వారిధు లేదునైన జన - వంద్యులఁ దెచ్చుట నా కసాధ్యమే. 25

1. గీ. - పూ.ము.
2. గీ. - పూ.ము.

క. అని కడురోషావేశం
బున వాని నదల్చి తన్నుఁ - బోనివ్వక చు
ట్టిన కాలపాశఘనబం
ధనములు ప్రేరేపుచున్నఁ - దా నొక్కరుఁడున్. 26

క. మాయావిభీషణుం డై
వాయుతనూభవునివాల - వప్రముకడకున్
డాయంగఁ బోయి మాయో
పాయంబులు మనములోనఁ - బరికించుతఱిన్. 27

క. కర మర్థి నిజవిభీషణుఁ
డరయుచు నటవచ్చి కోట - యవ్వలి కరుగన్
దురితాత్ముఁడగుచు నవ్వల
నరిగి మరుత్తనయుఁగాంచి - యతఁడిట్లనియెన్. 28

చ. కరువలిపుత్ర! యేమఱకు - కంజహితాన్వయుఁ డెల్లసేనలున్
బరమసుఖంబునన్ నిదుర - పండువు సేయుచు నున్నవారు భా
స్కరుఁడుదయించు నింక నఱ - జామున నంతటఁ బఙ్క్తికంఠునిన్
దురమున రాఘవుండు వెసఁ - ద్రుంచును నీకును గీర్తి దక్కెడున్. 29

క. శరణాగతవత్సలు లతి
తరుణారుణకోటినిభులు - దశరథసుతు లే
పరిణయమున నుండుదురో
కరుణాకర! యేను వారిఁ గనివత్తుఁ దగన్. 30

సీ. అని యిట్లు పలుకఁగ - ననఘ! మైరావణు
  మాయఁ గానఁగలేక - వాయుసుతుఁడు
నొక్కింత తనదేహ - మోహటించిన వాఁడు
  నమ్మార్గమునఁజొచ్చి - యలఘుఁడగుచుఁ
బ్లవగవల్లభుల వా - గ్బంధనంబులతోడ
  బ్రాఁగన్నువడఁజొక్కు - మందుఁ జల్లి
సమ్మోహనము చేత - సౌమిత్రి మిమ్మును
  జేష్టలు దక్కించి - చేరఁ దీసి





తే.గీ. మంత్రయంత్రంబులందును - మాయలందు
గట్టిపడి యున్నయొకయుక్కు - పెట్టె నునిచి
బాహుమూలంబునందునఁ - బదిలపఱిచి
తడయ కేతెంచి మారుత - తనయుఁ బల్కె. 31

చ. పవనతనూజ! యెంతయును - భవ్యభవద్ఘనవాలవప్రసం
భవచటులప్రతాపమున - భానుకులేశులు నెల్లసైన్యముల్
ప్రవిమలనిద్రలం దగిలి - భద్రసుఖంబున నుండి రాత్మలోఁ
దివిరెడుసంశయంబు చనఁ - ద్రిమ్మరి చూచితి సమ్మదంబునన్. 32

క. క్రూరాత్ము లైనరాక్షసు
లేరూపముతోడ నైన - నేతెంతు రొగిన్
బారి [1] దిరుగంగ నేగెద
మారుతి పదిలుండ వగుచు - మఱువకు మెందున్. 33

చ. అనుటయు నోహటించి తెరు - వప్పటి నిల్చిన నందువెంటఁ జ
య్యనఁ దగ వెళ్లి మంత్రుల ర - యంబునఁ గూర్చుక తొంటిరూపుఁ గై
కొని తనలంక లోపలికిఁ - గ్రూరత వాఁడును మిమ్ముఁ గొంచు న
త్యనుపమవాయువేగమున - నప్పుడు వోయె నిగూఢవృత్తిగన్. 34

చ. వివిధములై చెలంగుపరి - వేష్టితభూతపిశాచఢాకినీ
నివహము లట్టహాసములు - నిండి తొలంకెడి భద్రకాళికా
భవనములోన డాఁచి యురు - బాహుబలోన్నత మైనక్రూరదా
నవతతిఁ గాపువెట్టి వద-నంబునఁ దేజము మిక్కుటంబుగన్. 35

వ. తనప్రధానులం గనుంగొని సకలప్రాకారద్వారపాలకులకుఁ బదిలంబుగఁ గాపై యుండుం డని నియోగించి యంతఃపురంబునకుం జనుటయు వాండ్రును నట్లచేసి తమనివాసంబులకుం జనుటయుఁ బట్టణంబునం గల యాబాలగోపాలంబును నవ్వార్త యెఱింగి పదిలంబులై యుండి రయ్యవసరంబున. 36

సీ. కలఁగి వారిధుల పం-కము నివ్వటిల్లెను
  గులపర్వతములు కొం - గోదుపడియె [2]

1. బారితిరుగు - ప్రహరి తిరుగు - అనునర్థములో వాడఁబడినది.
2. కొంగోదుపడు = ఒడ్డగిల్లు, ఒఱఁగు. శ.ర. ఇదే ప్రయోగము.

గగనంబు నక్షత్ర – గణములతో వ్రాలెఁ
జక్రంబుగతిని భూ – స్థలము దిరిగె
దిగ్గజంబులు గుండె – దిగులెత్తి మ్రొగ్గెను
శేషాహి బిట్టుల్కి – చెవుడువడియె
నాహారవంబున – నఖిలభూతావళి
భీతిచేఁ గుందుచుఁ – బ్రేలిపడియె

తే.గీ. వెఱచె గ్రహరాజి మిక్కిలి – వీఁక నడచె
సురసమూహంబు మునిఁగెను – శోకజలధి
సకలలోకంబు లెంతయు – జలదరించెఁ
గమలగర్భుండు మదిలోన – గళవళించె. 37

వ. తదనంతరంబ విభీషణుండు తోఁకచుట్టునుం బరికించి మనంబునం గలఁకపుట్టెడు రామలక్ష్మణుల కేమియుం గాదుగదా యని చింతించుచు నేతెంచి హనుమంతుం జూచి యిట్లనియె. 38

క. పేరిన నిద్రలఁగూరెడు
భూరమణుల కడకు నొరులు – వోకుండంగా
భూరిబలంబునఁ గాచుచు
మారుతి! యున్నాఁడవయ్య – మఱువక యెందున్. 39

చ. అనవుడు వాయుసూనుఁ డసు – రాధిపుతమ్మునిదిక్కుఁ జూచి నీ
వనఘచరిత్ర! రాఘవుల – కర్మిలి భృత్యుఁడవంచు లోనికే
నిను నొక మాటికిం గడుప – నేరక పంపితి నింతెకాక య
వ్వవరుహసంభవాదులిట – వచ్చిన నవ్వలి కేఁగనిత్తునే. 40

క. జనపతుల నరయ లోనికిఁ
జనివచ్చితి విపుడు ప్రహరి – చక్రము భంగిం
గనుగీటినంత మాత్రన
దనుజేశ్వర తిరిగి తెట్లు – తడయక పేర్మిన్. 41

చ. అన విని వజ్రఘోషముల – కద్రి తలంకెడునట్లు భీతిచే
ననయము భీతిఁబొంది యతఁ – డల్లనఁ దెప్పిఁటి చూచి పల్కె నే





నినకులు లున్న చోటికిని – నెప్పుడు పోయితినయ్య! చెల్లఁబో
నిను మది నమ్మియుండఁగను – నీవును నేమఱితయ్య! పావనీ! 42

ఉ. ఈవిట నుండఁగాను మఱి – యేటికిఁ బల్మఱు రానటంచు నే
నావల నీవలం దిరిగి – యాడఁగ నాకలరూపుఁ దాల్చి మై
రావణుఁడేగుదెంచి మన – రాజుల నెత్తుక వోయెనో కదా
పావని! యేమియేయుదును – భావము లోపల జాలి వుట్టెడున్. 43

మ. అనినన్ వాయుతనూభవుండు మదిలో – నాశ్చర్యముంబొంది య
త్యనుకంపం దగఁ జూచి యంతఁ గడుఁ దా–త్పర్యంబుతోఁ[1] బల్కెనో
దనుజాధీశ్వర! నీవు వచ్చి చని నా – ధైర్యంబు శోధింప ని
ట్లనుచున్నాఁడవొ కాక నిశ్చయమొ మా–యాదైత్యురా కెంతయున్. 44

గీ. అనిన హనుమంతుఁ గనుఁగొని – దనుజవిభుఁడు
దండ్రి! యిట్లాడ నాకును – దగునె నిన్నుఁ;
బాపకర్ముండు చనుదెంచి – భానుకులుల
నేమిసేయునో రావయ్య – యెఱుఁగవలయు. 45

క. అనుటయుఁ బెదవులు దడపుచుఁ
చనువునఁ జెమటొదవఁ – గాళ్లు దడబడ శోకం
బున నతఁడును దానును నో
జనవర! యక్కోటఁజొచ్చి – చని యచ్చోటన్. 46

సీ. చంద్రుఁడు లేనట్టి – శర్వరిభంగిని
వనజబంధుఁడు లేని – దినము పగిది
ధవుఁడు వాసినపద్మ – దళనేత్రచందాన
జనపతి లేని రా–ష్ట్రంబు పగిది
జలములు లేనట్టి – జలజాకరముభాతి
విద్య యేమియు లేని – విప్రుమాడ్కి
నుడివోయి యుండిన – యుర్వీరుహముపోల్కి
ప్రాణంబు లేని గా–త్రంబులీల

---

1. నాశ్చర్యంబుతో – పూ.ము. పునరుక్తి. యతిభంగము. దాత్పర్యంబుతో – శుద్ధపత్రిక.

తే.గీ. శుభములను బాసి సర్వంబు - శూన్యమగుచు
సోలి పడియున్న కపిసేనఁ - జొచ్చి చూచి
మిమ్ముఁ బొడగాన కక్కడ - మిగులభీతిఁ
బుడమిపైఁ బడి పెనుమూర్ఛఁ - బొంది తేఱి 47

సీ. హా! రామ ఘనతాట- కాటవీపావక!
హా! దిననాథవంశా - బ్ధిచంద్ర!
హా! ఘోరదైత్యకులా - ద్రివజ్రాయుధ!
హా! జానకీహృద - యాబ్జభృంగ!
హా! సర్వలోకాశ్రి - తామృతపదహస్త!
హా! కృపారసలోచ - నాబ్జయుగళ!
హా! భవ్యవేదవే - దాంత సన్నుతమూర్తి!
హా! చారుపరమస - త్యాలవాల!

తే.గీ. మమ్ము నందఱఁబోరిలో - వమ్ముపఱచి
దుష్టరావణుఁ బ్రాణంబు - తోడ డించి
పావనుండైన తమ్ముఁడు - నీవుఁగూడి
పోయితటవయ్య! రాక్షస - మాయఁదగిలి. 48

ఉ. లంకకు నాఁడు పోయి కమ - లానిభ జానకిఁ గాంచి రావణుం
బొంక మడంచి నిన్నుఁగొని - పోయెడు రాముఁడు తల్లి! నీవు ని
శ్శంకను నుండుమంచును ని-జంబుగఁ బల్కిన నా ప్రతిజ్ఞ యే
వంకకుఁ బాఱఁదోలి యిన - వంశజ! యేఁగితి విప్పు డెక్కడన్. 49

వ. అని విభీషణుదిక్కుఁ జూచి. 50

సీ. మైరావణుం డను - మరకాఁడు[1] చనుదెంచి
యొరపైనమాయల - యోడ నెక్కి
మద్వాలవప్రాబ్ధి - మాటమాత్రనె దాఁటి
తరుచరద్వీపంబుఁ - దనరఁ జొచ్చి
పొందుగాఁ దనచేతి - మందుమంత్రంబుల
సరకులు పచరించి - చాలఁ జల్లి

1. మరకాఁడు = నావికుఁడు. శ.ర.





రామలక్ష్మణరాజ - రత్నంబులను గొంచుఁ
దనదీవి కేఁగెనే - దండితోడ

తే.గీ. నేమి సేయుదు సాధింప - నేమి వెరవు
నిమిషమాత్రంబు గడచిన - నీచదనుజుఁ
డకట వధియింపకుండునే - యనుచు మఱియు
భూమిపై వ్రాలి పెనుమూర్ఛ - వొంది యుండె. 51

గీ. అప్పు డెంతయు శోకాబ్ధి - దొప్పదోఁగి
సత్యనిధి యైన యవ్వి-భీషణుఁడు దాను
జేరి యవ్వార్త నప్పుడు - చెప్పఁదొడఁగె
వాయుసూనుండు ధీరత - వానరులకు. 52

సీ. ఘనులార! రండు రా-ఘవనిధానంబును
మోసపోయితి మొక్క - మొఱఁగు[1]చేత
బలసమున్నతులార! - తెలిసి చూడుఁడి దైత్యు
పాలు చేసితి మబ్జ - బంధుకులుల
ధర్మాత్ములార! ని-ద్రలు మానుఁడింతటఁ
బోనాడితిమి రాజ - పుంగవులను
కపివీరులార! మే - ల్కనుఁడింకఁ జెయ్యార
నప్పగించితి మింతె - యవనిపతుల

తే.గీ. ననుచుఁ దెలుపంగఁ గర్ణంబు - లందు వాఁడి
భల్లములు వైచి మెదిపిన - పగిదియైనఁ
గలఁగి బిట్టుల్కి యోలిని - కళవళించి
[2]బ్రమసి భీతిల్లి మర్కట - పతులు లేచి. 53

క. హారామ! రామ! యనుచును
ధారిణిపైఁ బొరలి పొరలి - తనువులు వణఁకన్
[3]బోరున నేడ్చిరి కన్నుల
[4]నీ రేఱులరీతిఁ బాఱి - నీరధిఁ గలయన్. 54

1. మొఱఁగు - వంచకుఁడు. శ.ర. 2. భ్రమసి - పూ.ము.
3. భోరున - పూ.ము. 4. నీరేరుల - పూ.ము.

వ. మఱియు ననేకదుఃఖావేశంబులం గపిసైన్యంబులు వదనరంధ్రంబులు వాడి కరువఱ్ఱువట్టి హస్తాంబుజంబుల నవనీతలంబుఁ బుఱుకుచు ముందర వెనుకయుం గానక తమ్ముందాము మఱచియుండ నధికశోకాక్రాంతుండై సుగ్రీవుండు విభీషణుం జూచి. 55

సీ. అయ్యయో! మనరాజ – హవ్యవాహనులను
  గాల్చెగా రాక్షస – కాననంబు
చెల్లఁబో! మనరాజ – సింహపోతంబుల
  మట్టెఁగా దానవ – మత్తగజము
కటకట!మనరాజ – ఖగకులాధీశులఁ
  గఱచెఁగా దైత్యోర–గంబు చెలఁగి
అక్కట! మనరాజ – హంసమండలములఁ
  గప్పెఁగా దైత్యాంధ – కారమెలమి

తే.గీ. ఎంతశౌర్యంబు గల్గిన – నేటి కొక్కొ!
యమరపతికైన హరికైన – నజునికైనఁ
బూర్వకర్మానుభవములఁ – బొదల కేల
దప్ప దనుమాట లిప్పుడు – తథ్యమయ్యె. 56

క. ఆ విష్ణుఁడైనదశరథ
భూవరతనయునకుఁగీడు – వొందునె తలఁపన్
దైవమునకన్నఁ గర్మమె
భావింపఁగ నధిక మగుట – పరమం బరయన్. 57

క. వాలిని ధారిణి వ్రాలఁగ
వాలమ్ముల నేసి నన్ను – వరసత్కృపతో
నేలినఫలమున కసురుల
పాలుగఁ జేసితిని యిట్టి – బంటుం గలఁడే. 58

క. నమ్మెను బతి నన్నును నే
నమ్మితి హనుమంతు నతఁడు – నమ్మెను నిన్నున్
నమ్మి కలకార్య మెల్లను
వమ్మయ్యెను నొరుల నమ్మ – వల దెచ్చోటన్. 59





ఉ. త్రుళ్లిన రావణాసురుని – ద్రుంపక సంతతశోకమగ్నయై
తల్లడ మందుచున్న వసు–ధాసుతఁ గావక వీరధర్మమున్
బొల్లుగఁ జేసి రాఘవులు – వోయినయప్పుడె యేను బ్రాణము
ల్వల్లను నంగదుం గొనుచు – వారిధి మెల్లనె దాఁటుఁడిందఱున్. 60

వ. అని ప్రలాపించుచుండ నంగదజాంబవంతసుషేణాదులు[1] హనుమంతుం జూచి యిట్లనిరి. 61

సీ. ఏతండ్రి తండ్రియై – యేప్రొద్దు మనకును
  రమణతో సత్కృపా – రసముఁ జిలుకు
నేతండ్రి భవ్యుఁడై – ప్రీతితోఁ జనువిచ్చు
  నుచితంబు నెడనెడ – నొప్పుమిగుల
నేతండ్రి యాప్తుఁడై – హృదయంబులోపలి
  మర్మంబు లెల్లను – మనకుఁ జెప్పు
నేతండ్రి దైవమై – యిహపరంబులు రెండు
  మనము రంజిల్లంగ – మనకు నొసఁగు

తే.గీ. నట్టి తండ్రిని రఘురాము – నతని యనుజుఁ
దెచ్చి మాలోని భయములఁ – దీర్పు మింక
నెవ్వరున్నారు నీవిపు – డిట్లు మూర్ఛ
వొంది యుండంగఁ బవమాన – పుత్రతిలక! 62

క. దిననాథవంశజులకును
దిననాథసుతుండు వగచి – ధృతిఁ దూలెడు నీ
వనఘాత్మ! యితని వలదని
ఘనసత్వము మీఱ నొక్క – కడఁ జేర్పు తగన్. 63

క. నావుడుఁ దెప్పిఱి[2] మారుతి
భావంబును గొంత పదిల – పఱుచుక వారిన్
గైవార ముడుగుఁ దని సు
గ్రీవునితోఁ బల్కెఁజిత్త – గింపు మటంచున్. 64

---

1. 'జాంబవత్సుషేణాదు' లని యుండవలెను.
2. తెప్పిఱి = తెప్పిఱిల్లి – అపాయము నుండి తేఱి. శ.ర.

క. దానవశేషం బెక్కడఁ
గానంబడకుండఁ జంపి – కడు వేగముతో
భానుజ! భానుకులేశుల
నేనిటఁదేకున్న యాంజ – నేయాఖ్యుఁడనే. 65

వ. అట్లు గాకుండిన.

ఉ. పట్టుదుఁ జేత నాగగన – భాగము ధారుణి నొక్కముద్దగాఁ
గట్టుదు వాలరోమముల – గర్వముఁ దక్కఁగ లోకపాలురం
గొట్టుదు నబ్జజాండ మిటు – గుల్లలకైవడిఁ గూలి డొల్లఁగా
మట్టుదు రావణాసురుని – మస్తకపఙ్క్తులు వ్రక్కలై చనన్. 67

శా. సాధింతున్ మఱి దైత్య గంధవహదృ – త్సామామరాధీశులన్?
గ్రోధింతుం గ్రహతారకాగణమరు – ద్రుద్రాదిసంఘంబులన్
శోధింతున్ బెగడొంద వారిధిహరి – త్క్షోణీధరశ్రేణులన్
బాధింతున్ భువనత్రయంబు వణఁకన్ – బ్రహ్మాదిదైవంబులన్. 68

వ. అని [1]విజృంభించి విలయకాలాగ్నికణంబులచందంబున నక్షుల నిప్పు లుప్పతిల్ల సమరదుర్వారాభీలవాలంబుఁ దిగిచి యల్లార్చి భుజంబు లప్పళించి చతుర్దశభువనంబు లొక్కకడి చేసి మ్రింగునట్టియుద్యోగంబున నున్న సమయంబున విభీషణుం డిట్లనియె.

చ. అలఘుతరప్రతాప! పవ – నాత్మజ! నీకు నసాధ్య మెందునుం
గలుగుట పోల దైన బలు – కార్యము శౌర్యమునందుఁజేయ మొ[2]
క్కల మగుఁ గాన శాంతుఁడవు – గమ్ము రసాతలలంకకేఁగు మ
త్తులువ నడంచి రాఘవుల – దోడ్కొని వత్తువు నీవు నావుడున్. 70

క. హనుమంతుండు విభీషణుఁ
గనుఁగొని యుత్సాహ మొప్పఁ – గా నిట్లను నో
దనుజాధినాథ! యొక్కటి
కినుకను బల్కెదను జిత్త – గింపు మటంచున్. 71

క. పూతాత్మ! నీవు చెప్పిన
నీతితెఱం గుత్తమంబు – నేఁజేసెద నా

1. విజ్జుంభించి – పూ.ము. 2. మొక్కలము = ముష్కరత్వము. శ.ర.



పాతాళలంక కరుగఁగ
నే తెరు వటఁ గలదు దాని – నెఱిఁగింపు తగన్. 72

ఆ.వె. అనిన నట్లకాక – యని విభీషణుఁడాంజ
నేయుఁ దోడుకొనుచు – నెమ్మితోడ
లంక కుత్తరంబు – వంకను విలసిల్లు
నబ్ధితీరమునకు – నరిగి యచట. 73

వ. వీనులకుఁ జల్లనిగానంబుల నింపు సొంపారం గొసరి కొసరి కుహూత్కారంబులు సేయుకొదమకోకిలతండంబులకు నాలయంబులై యతిమృదుమధురామృతరసంబులు చిలుకం బలుకకలికిరాచిలుకపిండునకు నాస్పదంబులై యనంగకేళీసమయంబునకు మనోహరంబుగా నెచ్చరించి పరిపరివిధంబులఁ గులుకరించుకప్పువారంపుఁగదుపులకు వీడుపట్టై కెరలి పొరలి పురివిచ్చి మురియుచు బహువిధనర్తనంబులం జెలంగు మత్తమయూరంపుమందలకుఁ బట్టుఁగొమ్మలై గురువిందలతలం బెనంగొనియున్న లేమావిజొంపంబుల కెలంకుల విరవాదితీవల ననుకరించుప్రేంకణంబులగుంపులం గదిసిజాజులనెత్తావిం బొదలినసురపొన్నల క్రీనీడలం బరగుచంద్రకాంతోపలంబులను చంద్రోదయంబునం గరంగి ప్రవహించినతియ్యనినీటిచలిమిరిం బరిపక్వంబులై పొరలువిచ్చిన కర్పూరంపుఁ దరువులమొల్లంబులు గల యుభయతటంబులవలనను మఱియుఁ గందర్పుండు విటవిటీజనంబులమీఁద దండెత్తందలంచి కొండికప్రాయపుఁదుమ్మెదల తండంబుల రమ్మని పిలువంబంచిన నవి మెందుగులపూఁదేనియలు గ్రోలి చొక్కిపోలేకుండిన నతండు వానిం గోపించి దండింపం దలంచిన వెఱచిపోయి శరణంబు వేఁడిన నుండుండని యెఱుఁగకుండ దాఁచినవిధంబున గర్భంబుల నిమిడికొని ముకుళించిన దండిగలపుండరీకంబులవలనను మారుతాత్మజునకుఁ బాతాళలంకకుఁ ద్రోవయెఱింగింప నుపశ్రుతిదోఁపంబలుకు పలుకులుగల బకక్రౌంచకారండవాది పక్షిసంకులంబులవలనను మృణాళంబు లాహారంబులుగ మెసఁగి యెరగొని సుఖించురాజసంహంసంబులుం గలపులిన స్థలంబులవలనను క్రూరాసురసంఘంబు లేఁగు మార్గంబునకు సోపానంబులు చేర్చి యొండొంటితో డాసిన భయంకరరూపములుగల కమఠనక్రగ్రాహమండూకపన్నగంబులవలనను నేత్రానందంబై పొలుపుదీపించి. 74

క. సల్లిలతకమలకైరవ
హల్లకమకరందపరిమ - ళాకీర్ణమిళ
త్కల్లోలమాలికాంచిత
ఫుల్లం బగునొక్క సరసి - పొలు పెసఁగంగన్. 75

వ. అప్పుడు చూపి. 76

చ. అనిలజ! కంటె యాసరసి - జాకరమధ్యమునందు నల్లనై
తనరెడునొక్కనాళ మొగి - తత్పరమందున సూక్ష్మరూపమై
చనుము రసాతలంబునకుఁ - జయ్యన నంచును ద్రోవ చూపి య
ద్దనుజవరేణ్యుఁ డేఁగుటయుఁ - దానును వేగమె సూక్ష్మరూపమై. 77

ఉ. శూరత నొక్కనాళ మొగిఁ - జొచ్చి చనంగ నెఱింగి లోకముల్
ఘోరుకలంగ నార్చి యిట - పోకుము పోకుమటంచు వారిధిన్
వారిధి దాఁకుచందమున - వచ్చి మహాభుజసత్త్వ మొప్పఁగా
వారిచరాధిపుండు వడి - వానరనాథుని దాఁకి యిట్లనున్. 78

ఉ. అంబుజసంభవాదులకు - నైనను దప్పక చూడరాని యీ
యంబుజనాళ మొక్కఁదవు - నాత్మ నొకింతయు భీతిలేక గ
ర్వంబునఁ జొచ్చి పోయెదవు - వానరకీటమ! నిన్ను నింక మ
త్స్యంబుల పాలు సేయ కిటు - సాగిచనంగఁ దొలంగ నిత్తునే. 79

మ. అనిన న్వాయుతనూభవుండు విని యు - ద్యత్క్రోధకాలాగ్నిలో
చనుఁడై యాతనిఁజూచి మండి సమరో - త్సాహప్రతాపస్ఫుట
ధ్వనవాలంబునఁ గంధరంబు బిగియం - గాఁ జుట్టి పద్మాకరం
బున ముంచెత్తి విదిర్చి వేగ దరికిం - బోవైచె మూర్ఛిల్లఁగన్. 80

క. తడయక తెప్పిరి కనుగొని
యుడుపథమున దిగ్గజములు - నుర్వీతలముం
గడగడ వడఁకఁగ ననిలజుఁ
బిడుగుగతిం బాఱుతెంచి - పిడికిటఁ బొడిచెన్. 81

క. పొడుచుటయు నతఁడు వానిని
నడఁచెం బెడచేత దాని - కలయక వాఁడున్
బెడిదముగఁ బెనఁగి పవనజుఁ





బొడువుగ వెస నెత్తి యార్చి - పుడమిన్ వైచెన్. 82

ఉ. వైచిన లేచి ధీరతను - వానరనాథుఁడు మత్స్యవల్లభున్
జూచి యదల్చి వక్త్రమున - శోణితధారలు గ్రమ్మ నంఘ్రులం
దాచె నురంబు దాని కటు - తద్దయుఁ గంపమునొంది లేచి వాఁ
డేచినయల్కతోఁగపికు - లేశ్వరుఁ గొట్టెఁజలింప కెంతయున్. 83

లయవిభాతి. వడిఁగపికులాధిపుఁడు - జడియక చలంబునను
[1]జడచరునివాలమున - నడరఁగను మోదెన్
దొడిబడక వాఁడు తన - కడిఁదిభుజసత్త్వమున
నొడిచి పవమానసుతుఁ - బిడకిటను నొంచెం
దడయక మతిద్దఱును - బెడిద మగుజంకెలను
నుడుగనిమహోగ్రముల - కడుధృతిని బోరన్
దొడరునురువేగమునఁ - గెడసి పెనురక్తములు
వెడలి వసుధాస్థలిని - బడి యలుక నుర్విన్. 84

తరల. చెనకి కొట్టుదు రెలమిఁ జేతురు - చేయిచేయియు వీడ్వడన్
బెనచి పట్టుదు రుదరద్రోతురు - భీమహుంకృతు లొప్పఁగన్
మొనసి పాయుదు రంటి దిగుతురు - ముష్టిముష్టియు మీఱఁగన్
గినిసి తాఁకుదు రొండొరున్ రణ - కేళిచిత్రము దోఁపఁగన్. 85

లయగ్రాహి. వెండియును రోషమునఁ - గొండలవిధంబునను
నొండొరులఁజేరి తమ - మెండు గనువేల్పుం
దండములకన్నులకుఁ - బండువులుగాఁ గమల
జాండమదరం బుడమి - మండలము గ్రుంగన్
భండనము సేయు నెడ - నండజకులేశ్వరుఁడు
చండజయశాలిఁ - గపిదండధరుపోల్కిన్
మండుచును రక్తములు - గండలును గ్రక్కుచును
గుండె లవియించి తన - దండ మిగులంగన్. 86

వ. ఇవ్విధంబున నయ్యిరువురుం బ్రళయకాలానలార్చులవిధంబునం జేరి సింహనాదంబులు చెలంగించి పాయనిమచ్చరంబులం గలయుచును

1. జలచరుని - పూ.ము. ప్రాసయతి భంగము.
'లడయోరభేదః', జడధి = జలధి = సముద్రము. శ.ర.

బాహుదంష్ట్రాముష్టిపాదాలింగనంబులచే మిక్కుటంబుగా జర్మంబు లుడుకెత్తి రాఁ జఱచియును గుండియలు కలంగిపాఱంబొడిచియును మస్తకంబులు బీటలువార నడఁచియును గాత్రంబులు నేలంబడఁ ద్రొక్కియును గంఠంబులు బిగియఁ గదియనొక్కియును నఖదంష్ట్రలంజీరియును పరస్పరఘాతంబులకుఁ దప్పిజాఱియును ననేకఘోరయుద్ధంబులు సేసి యలసి యున్నసమయంబున హనుమంతుడు తనసత్వంబునకు నతనిసత్వంబు సమంబైయున్న మనంబున నాశ్చర్యంబు నొంది. 87

క. నరఖేచరామరాసుర
వరులందును నిట్టిశౌర్య - వంతునిఁ జూడన్
ధరలో వీఁడును నెవ్వఁడొ
పరికించెద ననుచు మత్స్య - పతితో ననియెన్. 88

ఉ. ఎవ్వఁడు తండ్రి? నీకు జన - నెవ్వతె? నీ నిజనామ మేమి? నీ
వెవ్వనిఁగొల్తు వీసరసి - నేటికిఁ గాచెద విట్టివిక్రమం
బెవ్విధిఁగల్గె నీకుఁ దగ - నేర్పడఁ జెప్పుము నాకు నావుడున్
నవ్వుచు ధీరుఁడై పవన - నందను కండజనాథుఁడిట్లనున్. 89

చ. కలహముఁ గోరి బాహుబల - గర్వముతోడుతవచ్చుశూరులన్
జలమునఁ గిట్టి పట్టి వెసఁ - జంపుట సచ్చుట రెండుదక్కఁగం
గలనను గోత్రనామముల - కారణ మే మడుగంగ నిస్సిరో!
చెలఁగుచు వియ్యమందెదవొ - చెప్పిన నిప్పుడు నీవు నావుడున్. 90

ఉ. పేరును బెంపునుం దెలిసి - పేర్కొన కూరక యెట్టివారితోఁ
బోరుట గాదటంచు బుధ - పుంగవు లెప్పుడు నంద్రుగావునన్
వారిచరేంద్ర! చెప్పినను - వాసి దొలంగదు వీరధర్మ మే
యూరికిఁ బోదు నిక్కముగ - నున్న తెఱం గెఱిఁగింపు మెంతయున్. 91

వ. అనిన నొడంబడి నీ వడుగంగా నాకుం జెప్పరాదే యని యతం డిట్లనియె 92

చ. విను మిది నాదువర్తనము - వృక్షచరాధిప! పోలఁ జెప్పెదన్
జనని తిమింగిలం బనఁగ - సన్నుతికెక్కిన మీన మంజనా
తనయుఁడు గన్నతండ్రి పతి - దానవనాథుఁడు మత్స్యవల్లభుం
డనఁదగువాఁడ నీసరసి - నన్యులు దగ్గరకుండ నుండుదున్. 93



క. ఘనుఁ డైనయాంజనేయుని
తనయుఁడ నగుకతన బాహు - దర్పము మెఱయన్
దునుమాడుదు ననిలోపల
దనుజామరఖచరమనుజ - తరసంఘములన్. 94

సీ. అనిన మారుతి మన-మున కసంగతమైన
జలచరేంద్రునితోడఁ - బలికె నగుచుఁ
బవమానతనయుండు - బ్రహ్మచర్యులు సల్పుఁ
గొదలేక పుట్టిన - మొదలుగాఁగ
సతి నేదినంబున - నతఁ డాస వరియించి
పుత్రునిఁ గాంచె న - ద్భుతముగాను
జలచరంబుల కద్రిచ-రులకు నేకాల
మునఁ గల్గుసంయోగ - ములు దలంపఁ

తే.గీ. గూర్చి సారెకు నిన్ను నే - గ్రుచ్చి గ్రుచ్చి
యేమి యడిగితి నీవు నా - కేమి చెప్పి
తింత మాత్రన నోరుకూ - రేమి పోయె
నకట! నిజమాడ కిట్లేల - యంటి నీవు. 95

క. బొంకిన నాయువు తేజము
నింకును సిరి దొలఁగు కీర్తు - లెల్లను మాయుం
బొంకంబుఁ దూలి రౌరవ
పంకంబునఁ గూలు జముని - బాధలచేతన్. 96

వ. కావున నెవ్వరికిం బొంకం దగ దనిన నతం డిట్లనియె 97

సీ. కపినాథ! నీతోడఁ - గల్లలాడఁగ నేల
నమ్మవేనియుఁ గార-ణంబు వినుము
తనదేవి నరయంగ - దశరథాత్మజుఁ డంప
నంబుధి దాఁటుచో - ననిలజునకు
స్వేదంబు వొడ మబ్ధిఁ - జెందిన నాఁకట
నలి దాని నటఁ దిమిం-గిలము మ్రింగె

నట్లు మ్రింగిన ఘర్మ – మది యమోఘము గాన
నద్భుత మొదవంగ – నాక్షణంబ

తే.గీ. మిక్కుటం బగుగర్భ మీ – మీనమునకు
నైన ననుఁగాంచెఁగాంచిన – యప్పు డేను
దల్లి యెవ్వండు నాకును – దండ్రి యంటి
ననిన నెఱిఁగించె హనుమంతుఁ – డనుచుఁ బ్రీతి. 98

క. అంతట నాజన్మము నే
నెంతయు విని యతులసత్వ – మెసఁగఁగ నిచటన్
బంతమునఁ బోరి దనుజుల
నంతకుపురిఁ జూడ నరుగ – నంపుచు నుండన్. 99

వ. మైరావణుం డొక్కనాఁడు రావణాసురుఁ బొడగనంబోవుచు నన్ను వీక్షించి నా భుజబలంబున కలరి నామంబున మత్స్యవల్లభాఖ్యానంబు పేరువెట్టి ప్రియోక్తులఁ దన్నుఁ గొలువ నొడంబడంబలికి తనయాజ్ఞలేక యీపంకజనాళంబు చొచ్చి పోరాకుండ నియమించి పెట్టిన నుండుదు ననిన విని హనుమంతుండు మనంబున నత్యాశ్చర్యంబు నొంది యిట్లనియె. 100

క. ఇనవంశజు పంపున మును
వనవిధి దాఁటితిని నేనె – వాయుసుతుండన్
వనజజు వ్రాఁతఫలంబునఁ
దనయుఁడవై తీవు నాకు – ధర్మవిచారా! 101

గీ. తండ్రిబిడ్డలు తమలోనఁ – దగవు దప్పి
కలహమెక్కించఁగారాదు – గాన నాకుఁ
బుత్త్ర!నినుఁజూచి! మోహంబు – పుట్టఁదొడఁగె
నలిగి పోరాడఁ జిత్తంబు – గొలుపదింక. 102

చ. అనవుడు సంతసిల్లి యతఁ – డద్రిచరాధిపుఁజూచి యంజనా
తనయుఁడ నంచుఁ బల్కితివి – దైవకటాక్షమువల్ల మిమ్ము నా
కును బొడగాంచఁ గల్గెఁ – గపికుంజర! ధన్యుఁడ నైతి నైననా
మనమునఁ గొంతయున్నదను – మానము నీనిజమూర్తిఁ జూపవే 103

వ. అనుటయు నయ్యవసరంబున. 104





సీ. బాలభానుప్రభా – పటలంబు కైవడి
నుగ్రలోచనముల – నొప్పుమిగుల
ఘనతరనీలమే–ఘంబు చందంబునఁ
జటులవిస్ఫుటతను – చ్ఛాయ దనరఁ
జండదిగ్వేదండ – తుండంబులట్టుల
నురుభయంకరబాహు – యుగ్మ మమర
నిరుపమాయత లస – ద్వరుణపాశముమాడ్కి
వరుస నుద్దీపిత – వాల మెసఁగ

తే.గీ. మృత్యుదేవత కత్తుల – రీతి మెఱసి
నిశితఘనదంష్ట్రపంక్తులు – నీటుకొనఁగ
ధైర్యభర్మాద్రి మారుత – తనయుఁ డపుడు
పెరిగె నక్షత్రగణములు – పేర్లు గాఁగ. 105

గీ. అంత హనుమంతుఁగన్నుల – నలరఁ జూచి
మత్స్యవల్లభుఁడానంద – మగ్నుఁ డగుచు
నంఘ్రిసరసీరుహంబుల – కర్థి మ్రొక్కి
హస్తములు మోడ్చి యిట్లని – ప్రస్తుతించె 106

ఉ. శ్రీరఘురామపాదసర – సీరుహకోమలమత్తభృంగ! సం
సారనికుంజపుంజపటు – సాంద్రధనంజయ! సర్వపాపదు
ష్టోరగవైనతేయ! చటు –లోన్నతబాహుబలప్రతాప! వి
స్ఫారమహోగ్రదైత్యకుల – భంజన! పావనవాయునందనా! 107

చ. సురుచిరజానకీహృదయ – శోక నివారణ! యక్షరాక్షసా
మరవరకిన్నరప్రముఖ – మానితసన్నుతపాదపద్మ! భీ
కరనిజవిక్రమస్ఫురణ! – కారణపూరుష! వీరవర్య! సం
గరధరణీతలప్రళయ – కాలసమాన! కపీంద్రశేఖరా! 108

మత్తకోకిల. ము న్నెఱుంగక బేలనై కదు – మూఢభావముతోడుతన్
నిన్నుఁ బోరితి నాత్మలోపల – నేర్చునేరము లాత్మలో
నెన్న కెంతయుసత్కృపారస – మేర్పడన్ ననుఁదండ్రి! నీ
కన్నుదమ్ములఁ జూడవే తను – కంప మెల్లను వీడఁగన్. 109

ఆ.వె. [1]అనుచుఁ బ్రస్తుతింప - ననురాగమును బొంది
పులక లంగమునను - బొంగలింపఁ
గొడుకుఁ జేరిఁదిగిచి - గ్రుచ్చి కౌఁగిఁట జేర్చి
పలికె నిట్లు భక్తిఁ - బవనజుండు. 110

గీ. వత్స! మనలోన నజ్ఞాన - వశమునందుఁ
గలహ మొక్కటి పుట్టిన - కారణమున
నాత్మ కడుఁబొక్క నప్పటి - కాత్మజునకు
నలుగ నేర్తునె తప్పులు - గలిగె నేని. 111

క. సుతుఁడగుటఫలము తండ్రికి
నతిముద మొదవంగఁజేయు - టది యుచితము నీ
యతివినయశౌర్యధైర్య
స్థితిఁ జూచిన యపుడె నాకుఁ - జిత్తం బలరెన్. 112

క. వరచామీకరచామర
కరిఘోటకసుభటరత్న - కాంచనదివ్యాం
బరభూషణములు వడసినఁ
బరలోకము లేదు సుతులఁ - బడయక యున్నన్. 113

క. కావున నీ వొగి నాకును
దైవానుగ్రహము కతనఁ - దనయుఁడ వగుటన్
బావనుఁడ నైతి మిక్కిలి
భావంబునఁ బ్రమద మిపుడు - పర్వెఁ గుమారా! 114

వ. నే వచ్చినకార్యంబు నీ కెఱింగించెద వినుము. 115

ఉ. రావణపంపు పూని కపి - రాజును నన్నును మోసపుచ్చి మై
రావణుతస్కరుం డిపుడు - రాఘవులం గొనిపోయె నేను దై
త్యావలితోడ వాని నురు - మాడి పరాక్రమమొప్పఁగ్రమ్మఱన్
భూవరచంద్రులంగొనుచుఁ - బోయెదనంచును నేను వచ్చితిన్ 116

ఉ. వచ్చి సుపుత్త్రు నిన్ను బుధ - వత్సలుఁ గాంచితిఁ బ్రొద్దువోయె వాఁ
డచ్చట ధారిణీపతుల - నల్పమతిం దెగఁజూడకుండ నేఁ

1. గీ - పూ.ము.



జెచ్చెరఁ బోయి రాజులను - శీఘ్రతఁగొంచును వచ్చి వేడ్క నీ
కిచ్చెదఁ గోర్కి నన్ను నపు - డేమఁట వేఁడుము నీవునావుడున్. 117

క. జనపతుల పోకకును దన
జనకుం డగు వాయుసుతుని - సాహసమునకున్
మనమున విస్మయ మందుచు
వనధిగభీరుండు మత్స్య - వల్లభుఁ డనియెన్. 118

క. అరుదారఁ దొంటిరూపము
కరమొప్పఁగఁ దాల్చి నిన్ను - ఘనభుజశక్తిన్
ధరియించి లంక చేరువ
సరభసమునఁ బెట్టి మగుడఁ - జనుదెంతుఁ దగన్. 119

వ. అనుటయు ననిలజుండు సూక్ష్మరూపంబు ధరియించిన.

ఉ. ఆహవకాంక్షుఁడై కడిమి - నాగ్రహ మొప్పఁగ మున్ను దానవ
వ్యూహముమీఁదఁ బోవుపురు - షోత్తముఁ దాల్చిన తార్క్ష్యుకైవడిన్
బాహుబలందు మత్స్యపతి - పావని నప్పుడు వేడ్క సద్భుజా
రోహణుఁజేసి కొంచుఁ జనె - రూఢి రసాతలలంక యొద్దకున్. 121

వ. ఇవ్విధంబునం గొనిపోయి యాలంక బహిర్భాగంబునఁ బొలుచు సరోవరంబున డించి ముకుళితహస్తుండై యిట్లనియె. వినుండు ఘోరరాక్షసపాలితం బైనయప్పుర ద్వారంబున నొక్క త్రాసు గలదు. అది శత్రుజనంబు లెక్కిన విఱిగి పడుం గావున పదిలుండవై పోవలయు; మొక్కలంబునం బోవలవదు; ఇక్కడ నుండుసకల రాక్షసస్త్రీజనంబు దీని యుదకంబునం జనుదెంతురు; వారివలన రామలక్ష్మణుల వార్త వినంబడియెడు; విని మఱి సాధింతురుగాని యని చెప్పి మత్స్యవల్లభుండు వీడ్కొనుటయు హనుమంతుం డాత్మగతంబున. 122

సీ. అసువుల నున్నారు - వసుధేశు లనువార్త
వీనులు చల్లఁగా - విందు నొక్కొ?
విని వారికడకును - దనుజు లెవ్వరు నాదు
పొల మెఱుంగక యుండఁ - బోదు నొక్కొ?
పోయి కన్నులకాంక్ష - వోవంగ నంతట
నాతపఃఫలములఁ - జూతునొక్కొ?

చూచినప్పుడె వారిఁ – జోద్యంబుగాఁ బోయి
వనచరావళిలోన – నునుతు నొక్కొ?

తే.గీ. యనికిఁ జనుదెంచు మైరావ–ణుని వధించి
చెనఁటిదైత్యుల నీఱుగాఁ – జేతు నొక్కొ?
కాక దైవాజ్ఞ యేమిగాఁ – గలుగు నొక్కొ?
యనుచుఁ జింతించుచుండు న – య్యవసరమున. 123

గీ. రాక్షసేంద్రుండు కాళికా – రాధనంబు
సేయఁ జింతించి యేకాంత – సీమ నుండఁ
జేటికావృత్తిఁ గడలేని – పాటువడుచుఁ
బేదగతి నున్నదుర్దండిఁ – బిలిచి పలికె. 124

చ. దశముఖుపంపుఁ బూని ఘన – దారుణవానరసేనఁజొచ్చి నే
దశరథరాజనందనుల – దర్ప మెలర్పఁగఁ దెచ్చినాఁడ నీ
నిశి గొని భద్రకాళికిని – నిండిన భక్తిని వారిఁ బెట్టెదన్
విశదనవోదకంబు లతి – వేగముతోడుతఁ దెమ్ము నావుడున్. 125

ఉ. అంచితహేమకుంభము క–రాబ్జమునందు ధరించి యాత్మఁ గో
పించఁగఁ బాదయుగ్మమునఁ – బెట్టిన సంకెలజోడు ఘల్లుఘ
ల్లంచును మ్రోయఁ గోట లొగి – నల్లన వెల్వడి యాలకించి న
క్తంచరచంచలాక్షి కడు – దైవముదూఱుచు నుమ్మలింపుచున్. 126

సీ. మటుమాయదైవంబ! – మైరావణుని బారిఁ
జంపెదే రామల–క్ష్మణుల నేఁడు
కట్టిఁడిదైవంబ! – కడతెగ మ్రింగెదే
వనజబాంధవవంశ – వర్ధనులను
కష్టంపు దైవంబ! – కరుణ యింతయులేక
కోరెదే దశరథు – కూర్మిసుతుల
నీచ దైవంబ! దు – ర్నీతి నాశించెదే
రాజీవనేత్రుల – రాఘవులను

తే.గీ. చెనఁటిదైవంబ! ధర్మవ–ర్తనము విడిచి
సత్యసంధుల లోకర–క్షామణులను





గలుషచిత్తంబుతోడుతఁ – దలఁచె దేల
యనుచు దైవంబు దూఱుచు – నడలియడలి. 127

సీ. అనుపమజయశాలి – యవ్వాలితోఁబుట్టు
సుగ్రీవుఁడే వంక – సురిగె నొక్కొ
సంతతపతిహిత – సంపన్నుఁ డైనట్టి
వాయుసంభవుఁ డెందుఁ – బోయె నొక్కొ
దానవమర్మజ్ఞుఁ – డైన విభీషణుఁ
డలసుఁడై తా నెందు – నరిగె నొక్కొ
గణుతింపరానట్టి – కపిసమూహంబులు
తొలఁగి యేగొందిని – దూరె నొక్కొ

తే.గీ. దిక్కు లేనట్టి దీనులఁ – దెచ్చురీతి
రాఘవులఁ దెచ్చి చంప మై–రావణుండు
కనలుచున్నాఁడు వాని ను–గ్రతను దాఁకి
యకట! యొకఁడైనఁ గాపు సే – యంగ వలదె? 128

క. గతిమాలిన నాకును నా
సుతునకుఁ జావైన నేఁడు – చొప్పడుఁగా క
ద్భుతకపిసైన్యములుం గల
పతులకు నేఁ డిట్టి చావు – పాడియె తలఁపన్. 129

క. ఎవ్వరితోడుతఁ జెప్పుదు
నెవ్వరు గల రాప్తు లిందు – కెవ్వరు ముఖ్యుల్
ఎవ్వరు గల రీరాజుల
కివ్విధిఁ దప్పింప ననుచు – నేడ్చుచునుండన్. 130

గీ. అనిలసూనుండు గనుఁగొని – యాత్మలోన
దీనిచే నాదుకార్యంబుఁ – దెలియవచ్చు
పగిదినున్నది మాటల – భావ మరయ
ననుచుఁ జేరంగఁబోయి య – వ్వనిత కనియె. 131

ఉ. ఎవ్వరిదాన వీవు? కమ – లేక్షణ! నిర్దయ నిట్టి సంకెలల్
ఎవ్వఁడు నీకుఁ బెట్టె దను – జేశ్వరచిహ్నలు గాననయ్యెడున్

మవ్వపు నీశరీరమున - మానవనాథునికార్యభారమై
నెవ్వగ నేలగుందెదవు - నిక్కము చెప్పుము నాకు నన్నియున్. 132

క. వెఱవక చెప్పుము చెప్పిన
నఱిముఱి నీశత్రువులను - నాహవభూమిన్
నుఱుమాడి నాప్రతాపము
నెఱయఁగ నీపట్టణంబు - ని న్నేలింతున్. 133

వ. అనవుడు దుర్దండి హనుమంతుం గనుంగొని 134

క. చెన్నారు నీదుపలుకులు
విన్నంతనె చల్లనయ్యె - వీనులు మఱియుం
గన్నులు ముదమందెడు నీ
వన్నా! యెవ్వఁడవు చెప్పు - మని పల్కుటయున్. 135

ఉ. రావణవైరి బంటఁగపి - రాజహితుండను వాయుపుత్త్రుఁడన్
రావణుపంపునన్ మొఱఁగి - రావణవైరులఁ దెచ్చినట్టి మై
రావణుఁ గిట్టి యద్భుతప-రాక్రమమొప్పఁగఁ జంపివైతు నై
రావణవాహనాదు లను - రాగముఁ బొందఁగ నంచువచ్చితిన్. 136

వ. కావున. 137

క. చింతింపవలదు నీ తెఱఁ
గంతయు వినిపింపు మనిన - నంగన మదిలో
సంతోషమగ్నయై హను
మంతునితోఁ బల్కె నొగి స-మస్తముఁ దెలియన్. 138

వ. కృపారసా! నిన్నుఁ గనుంగొనినయప్పుడే నామనంబు నిశ్చింతం బయ్యె నా వృత్తాంతంబంతయుఁ జెప్పెద నాకర్ణింపుము; సకలలోకకంటకుం డైన మైరావణుతోడంబుట్టి కాలదండుం డనురాక్షసేంద్రునకుం బత్నినై దుర్దండీనామంబునం బ్రవర్తింపుచుండి యనేకకాలంబు గొడ్డువీఁగి దైవకృతంబున నొక్క కుమారుని నీలమేఘాకారుం గాంచి నీలమేఘం డనుపేరు పెట్టి పెనుచుచుండఁ దదనంతరంబ యాకాశవాణి మైరావణుం జూచి నీసహోదరికిం బుట్టిన నీలమేఘుఁడు నీసుతంబరిణయించి యిప్పాతాళలంకారాజ్యంబునకుఁ బట్టభద్రుండై నెగడంగలవాఁడనిన నప్పాపాత్ముండులికి యాక్షణంబున. 139



క. పొత్తులలోపలఁ బొదలెడి
నెత్తురుకం దనక యలిగి - నెఱి నాబిడ్డం
గుత్తుక పిసుకఁగ వచ్చిన
నత్తఱి నాపతియు నేను - నతిశోకమునన్. 140

గీ. పాదయుగ్మంబు చేతులఁ - బట్టి విడువఁ
జాల కేలయ్య మమ్మును - జంపవయ్య
యఖిలనిర్జరభీమ మై - నట్టిహస్త
సరసిజంబున శిశువును - జంపవలదు. 141

మ. అని ప్రార్థించినఁ జంపనోడి కృపతో - నావేళకుం బోయె నా
తనయుం డెంతయుఁ బూటపూటకు సము - ద్యత్కాంతి నీడేరఁగాఁ
గని చూపోపక చావుతో సరియకా - కారాగృహం బందులో
నునిచెన్ శృంఖలబంధపాదములతో - నుండం జలం బొప్పఁగన్. 142

ఉ. అంతటఁ బుత్రశోకమున - నారడిఁ గుందుచునుండలేక మే
మెంతయు వేఁడినం గరుణ - మింతయు లేకను నల్గి నావిభుం
డెంతలఁ జేరనీక నను - శీఘ్రము చంపక క్రూరకర్ముఁడై
సంతతమున్ విచారమునఁ - జావఁగఁ బెట్టెను శృంఖలంబులన్ 143

వ. వెండియు 144

క. బంటును బానిసఁ బోలుచుఁ
గంటికిఁ గలనైన నిదురఁ - గానక పొగులన్
గంటకుఁడై నిత్యముఁ దన
యింటం గలపనులకెల్ల - నీడ్చుచుఁ బెలుచన్. 145

ఆ.వె. [1]ఇపుడు నన్నుఁ బిల్చి - యినవంశజులఁ బట్టి
వదనుపూన్కిఁ గొంచు - వచ్చినాఁడ
భద్రకాళి కేను - బలియిత్తుఁ బొమ్ము వే
వేగ నుదకమునకు - వెలఁది యనిన. 146

క. ఏతెంచి నీళ్లుగొని చనఁ
జేతులు కాళ్లాడకున్న - శ్రీరాఘవులన్

1. గీ - పూ.ము.

ఓ తండ్రి! తలంచి వగచెద
నాతనయుని దుఃఖమునకు – నాకున్ వగవన్. 147

చ. అనవుడు వాయుసూనుఁ డసు – రాంగనఁ గన్గొని నీకృపారసం
బునకును మెచ్చి తింకమదిఁ – బొందకు దుఃఖము వీనిఁ జంపి నీ
తనయుని రాజుఁ జేసెదను – దప్పదు నావచనంబు నన్నుఁ గొం
చును జని రెండు కన్నులను – జూపుము రాజుల నీవు నావుడున్. 148

చ. అనిలజ! యట్టివాఁడ వగు – దైనఁ ద్రిలోచనునంతవానికిం
[1]గనుఁగొనరాద యెవ్వరికిఁ – గా మయనిర్మిత మిప్పురంబు నీ
కనఘ! తలంపఁ జూడఁ జన – నద్భుత మీ వది యెట్లు చెప్పుమం
చన వినుపించెదన్ వినుము – సత్యముగా మొదలింటినుండియున్. 149

క. మేరునగప్రాంతంబున
వారిజభవుఁగూర్చి పెక్కు – వర్షము లమలా
చారము తోడుతఁ బాయక
మైరావణుఁ డుగ్రతపము – మానుగఁ జేసెన్. 150

సీ. ఆపద్మసంభవుఁ – దరుదెంచి ప్రత్యక్ష
మైవచ్చి నీకిష్ట – మైనవరము
నడుగు మన్నను మ్రొక్కి – హస్తాబ్జములు మోడ్చి
మితిలేని యట్టి స – న్నుతులు సేసి
దనుజనిర్జరయక్ష – మనుజపన్నగతార్క్ష్య
సిద్ధవిద్యాధర – శ్రేణివలన
మరణంబు లేకుండ – మాకును వరమిచ్చి
పాతాళమున నొక్క – పట్టణంబు

తే.గీ. మెచ్చులొదవంగఁగణఁక ని–ర్మింపు మనిన
నతఁడు నట్లనె కా కంచు – నడిగినట్టి
వరము కృపనేసి మిక్కిలి – వరదుఁ డగుచుఁ
బురము గల్పింప మయునంపె – గురుతరముగ. 151

1. రాదుఎవ్వరికి – పూ.ము. విసంధి.



వ. పంపిన నతండును బాతాళంబునకు నేతెంచి పంచాశద్యోజనవిస్తీర్ణంబును నష్టాశీతియోజనాయతంబునుం గాఁ బురస్థలంబేర్పఱిచి యం దేడుకోట్ల శివాలయంబులును గోమేధిక పురంబులను మరకతమంటపంబులును మాణిక్య కుడ్యంబులును మౌక్తికకేళీగృహంబులును వజ్రసోపానంబులును విద్రుమకవాటంబు లనేకంబులు నిర్మించి యంబుధిసన్నిభంబు లగుపరిఘాచతుష్టయంబులం గలపాషాణంబులకోటయు నైదుకోట్లదంచనంబులచేత [1]సంచితం బగునినుప కోటయు మిక్కుటంబగు నున్నతంబగు నున్నతంబునఁ గ్రిక్కిరిసి మూఁడుకోట్లబిరుదు టెంకెంబులచేతం బొలుపెక్కిన యుక్కుకోటయును నేఁబదికోట్ల కాంచన సోపానంబులు గలయోవరిచేత [2]రమ్యం బగుకంచుకోటయు నెనిమిది గోపురంబులు గలరజతంపుఁగోటయు నమితదివ్యరత్నస్థాపితం బైనపసిఁడికోటయు ననంగల యేడుకోటలు గల్పించి యక్కోటకోటకు నెనిమిదేసిగవనుల నలవరించి యగ్గవనిగవనియందు నహోరాత్రములు నిద్ర లెఱుంగక పదిలంబుగఁ గాపుండు నట్లుగా సెలయేఱులతోడి నడగొండలుంబోలు మదద్రవదంతావళంబులు రెండు కోట్లును వాయువేగంబున కధికవేగంబునుంగల జవనాశ్వంబులు నాలుగు కోట్లును బటు భయంకరకాలకింకరుల నహంకరించి బింకంబులు గల్గువివిధ శస్త్రాస్త్రపారీణు లైనవీరదానవు లెనిమిదికోట్ల నుండ సృజించిన నతండు సంతోషస్వాంతుం డై పాదపద్మంబుల కెరఁగి ముకుళితహస్తుం డై యిట్లనియె 152

చ. సరసిజగర్భ! దేవగణ – సన్నుత!నీకృపచేతఁ జాలన
చ్చెరువుగ నామనోరథముఁ – జేకుఱు నింక మహావిభూతినిం
బరగితి నొక్కటింకమిముఁ – బ్రార్థననేసెదఁ జిత్తగించి నా
కరిజనుఁ డెవ్వఁ డాతనిన – యానతి యిం డెఱుంగంగ నెంతయున్.

చ. అనుటయు భూమికోట యొక – టప్పుడు చాలసృజించి దానికిన్
ఘనముగ నొక్కవాకిలియ – కా నొనరంగ నొనర్చి యుక్కునం
దనరెడునట్టి త్రాసు బెడిదంబుగ నొక్కటి యందుఁ బెట్టి య
వ్వనరుహగర్భుఁడిట్టులనె – వానరనాయక! దైత్యనాథునిన్. 154

క. హితజనుఁ డెక్కినఁ గడు నిది
జతనంబున నుండు శత్రు – జనుఁ డెక్కినచో

1. దంచనము = పెద్ద పిరంగి. శ.ర.
2. ఓవరి = లోపలిగది, చంద్రశాల. శ.ర.

గతిదప్పి విఱుగుఁ గావునఁ
ప్రతిపక్షుని నెఱుఁగు మపుడు - పరమార్థముగన్. 155

క. అని చెప్పి యతఁడు వోయిన
దనుజాధీశ్వరుఁడు ఘోర - దైతేయులఁ బ
ద్ధనిమిదికోటులఁ ద్రాసున
కనిశంబును గావలుండు - నట్లుగఁ బెట్టెన్. 156

క. పెట్టి చలంబున ఫణులకుఁ
గొట్టెను గలనైన మారు - కొనకుండంగాఁ
బట్టెను మనుజులఁ జెఱలను
బెట్టెను గంధర్వయక్ష - బృందారకులన్. 157

క. కావున నిన్నును గొని యే
నేవెఱవునఁ జొత్తు నీవు - నేగతితోడన్
భూవరుల కడకు వచ్చెదు
పావని యెఱిఁగింపు మనినఁ - బడఁతుక కనియెన్. 158

ఆ.వె. [1]కోట లెట్టివైనఁ - గుంజరతురగంబు
లెన్నియైన దైత్యు - లెందఱైనఁ
గన్నుగీటినంతఁ - గడతేర్తు నామాట
నిక్కువముగ నమ్ము - నీరజాక్షి! 159

క. అని పల్కి నాదురూపముఁ
గనుఁగొను మిది యంచు నింగి - కడవఁగఁ బెరిఁగెన్
ఘనతర మగు తద్రూపముఁ
గని యది వెఱఁగంది పలికెఁ - గపివీరునితోన్. 160

సీ. అంజనాగర్భర - త్నాకరహిమధామ!
కుటిలదానవమేఘ - పటలపవన!
రామలక్ష్మణపాద - రాజీవసేవక!
గిరిజాధినాయక - వరకుమార!

1. గీ - పూ.ము.



సురగరుడోరగా - సురనిత్యసన్నుత
పదపద్మ! మిత్రజ - ప్రాణమిత్ర!
దశకంఠపట్టణ - ద్వారదావానల!
రౌద్రభీషణరణ - రంగధీర!

తే.గీ. వేయుఁగన్నులు గలయట్టి - వేల్పునకును
గుఱుతు వెట్టంగ వర్ణింపఁ - గొలదిఁగాని
కోటిరవితుల్య మైన నీ - మేటిరూపుఁ
గంటి నెంతయుఁ గన్నుల - కఱవు దీఱ. 161

క. తడయఁగ నేటికి నింకన్
గడుసూక్ష్మం బైనరూపుఁ - గైకొను మిపు డీ
కడవంచునందు నిను నే
నిడుకొని పోయెదను ధారు - ణీశులకడకున్. 162

క. అనవుడు విని దుర్దండిని
గనుఁగొని మదిలోనఁ బొంగి - కరుణాకరుఁడై
ఘనమైన శృంఖలంబులు
దునిమెన్ దుత్తమురుగాఁగ - దోర్బలమొప్పన్. 163

గీ. పవనసూనుండు తింత్రిణీ - పర్ణమాత్రుఁ
డయ్యె నయ్యంతి యాశ్చర్య - మందుచున్న
నట్టు లొఁగాదొయొకవేళ - నణఁగి యుండు
నెట్టిఘనుఁడైనఁ గార్య మీ - డేఱుదాఁక. 164

వ. అని చెప్పినఁ దరువాతివృత్తాంతం బెట్టిదని యడుగుటయును. 165

చ. కవిజనమిత్ర! బంధుజన - కల్పమహీరుహా! సర్వధారిణీ
ధరవరసత్సభాంతరప్ర-ధాననుతస్ఫుటధీవిచార! కాం
డవకులకంజభాస్కర! దృ-ఢవ్రత! నిష్ఠురమంత్రిభీకరా
ర్ణవబడబాగ్నిరూప! సుర - రాజనుతప్రతిమానవిక్రమా! 166

క. శ్రీవత్సగోత్రజలనిధి
జైనాత్మక! విపులసకల - శాస్త్రాగమవి

ద్యావాణీప్రియ! విశ్రుత
దేవేంద్రసమానభోగి! ధీవరచంద్రా! 167

మాలిని. అతులసుగుణహారా! - యబ్బమాంబాకుమారా!
రతిపతిసమరూపా! - రమ్యసంపద్దిలీపా!
[1](?) ధృతసుమనసగోత్రా! - ధీజనస్తోత్రపాత్రా!
వితతవసుమతీశా! - విష్ణుభక్త్యంబరీషా! 168

## గద్యము

ఇది శ్రీభీమేశ్వరవరప్రసాద కవితాధురీణ సకలశాస్త్రప్రవీణ సుకవిజనమిత్ర సర్వయామాత్యపుత్త్ర మాదయనామధేయ ప్రణీతం బైన మైరావణచరిత్రంబునందు ద్వితీయాశ్వాసము.

---

1. ధృతిసుమనోగోత్రా - అనుట సాధువు.
సుమనోగోత్రా - అన్నచో ఛందోభంగము.
సుమనోగోత్రము = దేవతల పర్వతము. మేరువు.
'ధైర్యములో మేరు పర్వతము వంటివాఁడా!'
అని కవి యుద్దేశము.



# మైరావణచరిత్రము

## తృతీయాశ్వాసము

---



పతిపదాబ్జభృంగా!
కాపాలిజటాంతరంగ - గంగాసదృశా
టోపయశా! నుతజంబూ
ద్వీపా! లేజెర్లయబ్బ - ధీమణిగోపా!

వ. అక్కలశోద్భవుండు రామచంద్రున కిట్లనియె. రఘురామా! చిత్తగింపు మప్పుడు దుర్దండి కాంచనకుంభంబున నిర్మలోదకంబులు ముంచుకొని యక్కలశంబు లోని యంచున నాంజనేయు నిడుకొని మహాప్రళయావసరంబున మృత్యుదేవత తనకు సహాయంబుగ జంతుసముదయంబుమీఁద నంతకుఁగొనిపోవుచందంబునఁ గోటయొద్దకుంగొనిపోయి యమ్మయమాయాకారం బైనత్రాసు మెట్టుకొని చనునెడ నది విచిత్రంబుగా భంగం బగుటయుఁ దద్ద్వారపాలకు లత్యంతరౌద్రాకారు లై నేత్రకోణంబుల నగ్ని కణంబులు రాల నీక్షించి యొఱలు వెడలంగ నడిదంబులు పెఱికి జళిపించియు సంబళంబులు ద్రిప్పియుఁ గుంతంబు లెగవైచియు గుణరావంబు లెసంగఁ జాపంబు లెక్కువెట్టియు బాణంబులు తెగనిండ సంధించియు హుంకారములతోఁ జుట్టుముట్టి యోసి! కులద్రోహి! తొలుత సరోవరంబునకుఁ జనునప్పు డున్న సంకెల లిప్పు డూడ్చుకొని నిశ్శంకం జనుదెంచి దానవమయనిర్మితం బైన యిత్తులాపాత్రంబు విఱుగం ద్రొక్కితి నీవలన శత్రుభావంబు గానంబడి యున్నది యెఱింగింపు మెఱింగింప కుండిన నిన్ను ఖండంబులు సేసి మాంసఖండంబులు భక్షింతు మనుచు నిర్బంధించిన. 2

గీ. కడవయంచున మణిఁగిన - కపివరుండు
ధరణి మీఁదికి లంఘించి-దర్పమెసఁగ
బ్రళయకాలంబు నాఁటి భై - రవునిరీతి
మిన్నుముట్టంగ నెంతయు - మేను వెంచి. 3

సీ. వీరదానవమత్త - వేదండముల మీఁదఁ
గంఠీరవము మాడ్కిఁ - గవిసి కవిసి
చక్రవాళాచల - సముదీర్ణ మగు వాల
పాశంబుచేఁ జుట్టి - పట్టి పట్టి

చండనిష్ఠురకాల - దండంబుగతి నొప్పు
పెడచేత లోచేత - నడఁచి యడఁచి
చటులవజ్రస్తంభ - సన్నిభం బగునట్టి
పదయుగంబునఁ ద్రొక్కి - మెదిపి మెదిపి

తే.గీ. ఘోరకాలాభ్రభూరిని - ర్ఘోషతుల్య
సింహనాదంబు చెలఁగించుఁ - జిక్కు జీరు
పడఁగ నిమిషంబులోపలఁ - దొడరి చంపె
నుక్కుకైనను బీరువో - కుండఁ దరిమి. 4

ఉ. అంతట దైత్యకాంత పవ - నాత్మజుఁగన్గొని పొంగి దేవ! నీ
వెంతయు దైత్యులం గడిమి - నిప్పుడు చంపినవార్త విన్న న
త్యంతబలోగ్రదైత్యు లిట - కడ్డము వత్తురు రాకమున్న భూ
కాంతుల రామలక్ష్మణులఁ - గానఁగఁ బోదము రమ్ము వేగనన్. 5

మ. అనుచుం దోడ్కొనిపోవుచోఁ బవనజుం - డాపట్టణంబొప్పుఁ దా
మును విన్నంతకు నేత్రపద్మములకున్ - మోదంబు పుట్టింపఁగాఁ
గనుఁగొంచు న్నెదురైనఁదైత్యవరులం - గర్జించి భంజింపుచుం
జనియెన్ వేగనఁ గాళికానిజనివా-సం బుగ్రతం జేరఁగన్. 6

ఆ.వె. [1]అట్లు చేరఁబోయి - యాలోనఁగలకలం
బాలకించి దైత్యు - రాలిఁ జూచి
మధ్యరాత్రి నిద్ర - మాని యీగుడిలోన
నెలమి నున్నవార - లెవ్వరనిన. 7

సీ. ఇది భద్రకాళికా - సదనంబు దీనందు
మనిచినాఁ డధిపుల - దనుజనాథుఁ
డిప్పు డాకలకలం - బెసఁగంగ మేల్కాంచి
యున్నవారలు కావ - లున్నవారు
ఇంక వారికి నీకు - నిచ్చోట ఘనమైన
యుద్ధంబు గలుగక - యుండ దరయ

1. గీ - పూ.ము.





బలసత్వ మొప్పంగఁ - బదిలుండవై చను
మనువుడుఁ బవమాన - తనయుఁ డపుడు

తే.గీ. భీకరాకారదైతేయ - లోకనికర
తీవ్రకరవాలతుల్యంబుఁ - ద్రిప్పుకొనుచు
నమితభుజసత్వసంపన్నుఁ - డగుచు భద్ర
కాళికాద్వార ముద్ధతిఁ - గదియుటయును. 8

వ. ఆద్వారపాలకు లతనిం గనుంగొని. 9

క. ముప్వురు వేలుపులకుఁ జొర
నెవ్విధమున రానియట్టి - యీపురికిని వీఁ
డెవ్వఁడొ నిర్భయవృత్తిని
గ్రొవ్వున నేతెంచె ననుచుఁ - గోపం బెసఁగన్. 10

సీ. ప్రవిమలబ్రహ్మాండ - పఙ్క్తులు చెదరంగ
భీకరస్ఫూర్తితోఁ - బేర్చి యార్చి
కరవాలముసలము-ద్గరచక్రపట్టిస[1]
ధనురస్త్రశూలకుం-తములు దాల్చి
చండబాహాదండ - సంరంభ మొప్పఁగ
నొక్కఁడొక్కఁడు కన్న - నుక్కుమిగిలి
భానుబింబము నభ్ర - పటలంబు వొదివిన
కైవడి గర్జించి - కదియఁ బొదువఁ

తే.గీ. జెనకుటయుఁ జూచి పావక - శిఖలమీఁద
నాజ్యభాండంబు వైచిన - నధికముగను
మండుచందాన మారుతి - మండుకొనుచు
నుగ్రదైత్యులమీఁదికి - నుఱికి యుఱికి. 11

క. సోలుచుఁ దలుపుల మీఁదికిఁ
గూలఁగఁ బదయుగమునందుఁ - గొందఱఁ దన్నెన్
వాలమునఁ జుట్టి కొందఱఁ
గాళికి బలిద్రిప్పి నేలఁ - గదియం గొట్టెన్. 12

1. పట్టెస - పూ.ము.

క. వనరుచుఁ గాళ్ళుంజేతులు
పెనుచుక ధరమీఁద బీన్గు – పెంటలు గాఁగా
మనమునఁ గోపము ముప్పిరి
గొన వడిఁ బిడికిళ్లచేతఁ – గొందఱఁ బొడిచెన్. 13

ఉ. వెండియుఁ దత్సమీపమున – వృక్షశిలాదులు నేల రాల్చి యు
ద్దండపటుప్రతాపమున – దానవసైన్యముఁ జొచ్చి రక్తముల్
కందలు గ్రక్కికొంచుఁబడి – కట్టలు కట్టలు గట్టి పీనుఁగుల్
గొండలపోల్కి నుండఁ గపి – కుంజరుఁ డందఱఁ జంపె నుగ్రుఁడై. 14

చ. తొలఁగక దైత్యకాంత తన – తోడనె ప్రీతిని నేగుదేరఁగా
బలువడి కాళికాలయము – బంధురవృత్తిని జొచ్చి యెంతయుం
గలయఁగఁ జూచి మిమ్ముఁ బొడఁ – గానక మిక్కిలి యాత్మలోపలన్
గలఁగుచు నంతఁ గాళిఁ బొడ – గాంచి కరంబులు మోడ్చి యిట్లనున్.

సీ. ఘనశూలఖడ్గకం–కాళహస్తాంబుజ!
నాగకంకణవామ – భాగపీఠ!
లాలితోజ్జ్వలరుండ – మాలికాలంకృత!
సంపూర్ణసితభాను – సన్నిభాస్య!
సకలబృందారక – సన్నుతపదయుగ్మ!
ఢంకానినాదతాం–డవవినోద!
కమనీయసంతత – కరుణారసాపాంగ!
స్ఫుటసమంచితపరం – జ్యోతిరూప![1]

తే.గీ. యఖిలలోకంబులకుఁ దల్లి – వైననీదు
సదనమందున దైతేయుఁ – డదయుఁ డగుచు
ధారిణీశులఁ గొనివచ్చి – దాఁచినాఁడు
వారిఁ బొడసూపి నాలోని – వగపు మాన్పు . 16

వ. అని మ్రొక్కి యనేకవిధంబులఁ బ్రార్థించి యడిగిన నమ్మహాదేవి కైకొనకున్న చందంబున నున్న నుత్కటకోపాక్షుం డై హనుమంతుడు గాళికం గనుంగొని. 17

1. పరంజ్యోతీరూప – అనునది సాధురూపము.



క. నినుఁ బెద్దసేసి వేఁడినఁ
గనికర మొదవంగ నన్నుఁ – గనుఁగొన కాత్మన్
మనుజేశునిపై నలిగిన
ఘనకర్మికి నీకుఁ గరుణ– గలదే తలఁపన్. 18

చ. పరహితమొప్ప రాఘవులఁ – బ్రార్థన సేసినఁ జూడవైతి ని
ర్భరచటులోగ్రవాలమునఁ – బట్టి విదల్పఁగఁ గూలి చూర్ణమై
యరుగుచు దైన్యభావమున – నప్పుడ చూపెదుగాక యంచుఁద
త్పరిజనభూతము ల్వెఱచి – పాఱఁగ హుంకృతితోడఁ జేరఁగన్. 19

గీ. ఉరగలోకంబు బిరబిరఁ – దిరుగఁ దొడఁగె
నదరె భూదేవి దిక్కులు – బెదరె నంత
నమ్మహాశక్తి కడుఁగంపి – తాత్మ యగుచుఁ
బవనపుత్త్రుని వీక్షించి – పలికెఁ బ్రీతి. 20

క. ఓహో! సహింపు మేటికి
ద్రోహము నామీఁద నూని – రోషింపఁగ నే
నాహా! భానుకులేశుల
నాహారముఁ గొనఁగఁ దలఁచి – యణఁతునె నీకున్. 21

క. దనుజుఁడు రాజులఁ గొనిరాఁ
జనునప్పుడు తెచ్చి దాఁచి – చనునప్పుడు నే
ననఘాత్మ! యెఱుఁగ నెఱిఁగిన
నొనఁగూడని పాపమునకు – నొడికట్టుదునే. 22

వ. అని యొక్కింతతడవు ముకుళితలోచనయై తనమనోవీథి సకలంబునుం బరికించియుం గానక తనభోజనాగారంబునందు దాఁచుట యెఱింగి యాక్షణంబున భూతసంఘంబులం బనిచి తెప్పించి తొలుత వాఁడు పెట్టినయుక్కు పెట్టితోన యిచ్చిన జాత్యంధునకు దృష్టి గలిగినఁ గడలేనికాంక్షతోడుతం జూచుచందంబునం జూచుచు నంకురితపులకాంగుం డై యానందంబునుం బొంది నిద్రాభంగంబు గాకుండగఁ గ్రమ్మరం బెట్టి మూసి భజంబున నిడుకొని యద్దేవికిఁ బునఃపునః ప్రణామంబులు సేయుటయు సకలరాక్షసుల కజేయుండవు గమ్మని దీవించి యంపుటయు దుర్దండితోడనే చనుదేరఁ బట్టణంబు వెడలి యనతిదూరంబున

నొక్క నిగూఢం బగులతాగృహంబునఁ బెట్టిక డించి పదిలంబుగా దాఁచి దుర్దండిం
గనుంగొని. 23

క. అలరఁగ మును నీతోడుతఁ
బలికిన నా ప్రతిన దక్క - బవరములోనన్
గలదైత్యవరుల నెల్లను
బొలియించక కొంచుఁ బోను - భూమీశ్వరులన్. 24

క. ఉపకారికి నీకును బ్ర
త్యుపకారము సేయుదాఁక - నుల్లములోనం
దపియించుచుండుఁ గావునఁ
గపటాత్ముని ద్రుంతు రమ్ము - కనుఁగొను నన్నున్. 25

ఆ.వె. అనుచు ధీరుఁడగుచు - నప్పుడు నప్పట్ట
ణంబుఁ జొచ్చి గోపు - రంబు లవని
డుల్లఁ దన్ని మేడ - లెల్లయుఁ బడఁద్రోచి
మేటికోట లొక్క - పాటు సేసి 26

సీ. ద్వారపాలక దైత్య - వర్గంబులను నొండు
మొన కట్టకుండంగఁ - బెనచి కొట్టి
వీథులయం దున్న - వీరదానవకోట్లఁ
బాఱిపోవక యుండఁ - బట్టి చంపి
ప్రహరి వర్తించెడి - రాక్షసవ్యూహంబు
తల చెడి పాఱంగఁ - దరిమి కూల్చి
పాలెంటు లున్నట్టి - భయదానవావలిఁ
గిట్టి మార్కొనకుండఁ - గీటడంచి

తే.గీ. భద్రవేదండఘోటక - ప్రకరములను
మట్టిమల్లాడి సంగరో - న్మత్తుఁ డగుచుఁ
దిరుగుచుండంగ నయ్యెడ - దీనవృత్తిఁ
దల్లడించుచు హతశేషు - లెల్లఁ బాఱి. 27

ఉ. అంతిపురంబువాకిట మహా - ధ్వనితోడుత మొఱ్ఱవెట్టు చో
నంతట నిర్జరారి విని - యాత్మ గలంగఁగఁ బాఱుతెంచి నే



త్రాంతములందుఁ గెంపెసఁగ - నందఱఁ జూచి యదేల మీరు వి
భ్రాంతిని మొఱ్ఱవెట్టెదరు - పట్టెనొ మిమ్ముల భూతసంఘముల్. 28

క. అనవుడు భూతంబులు మా
కును మీకృపఁ జేయ వెట్లు - కొట్నంబులు[1] మ
మ్మును బట్టనోపునే యవి
యని పదముల కెఱఁగి పలికి - రంతయుఁ దెలియన్. 29

సీ. విను చిత్తగింపుము - దనుజాధినాయక
యురుబాహుబలుఁ డొక్క - తరుచరుండు
పంకనాళముఁ జొచ్చి - శంకలే కేతెంచి
ద్వారనిర్మిత మైన - త్రాసు విఱిచి
కావ లున్నట్టి ర-క్కసితండములఁ జంపి
కాళికాలయము ను-గ్రతను జొచ్చి
యద్దేవి నదలించి - యవనీశతిలకులఁ
గొనిపోయి క్రమ్మరఁ - గోప మెసఁగ

తే.గీ. వచ్చి పురిఁ జొచ్చి గోపుర - వప్రహర్మ్య
సదననికరంబు లన్నియుఁ - జదును సేసి[2]
కడిఁదిదైత్యులఁ బెక్కంద్రఁ - బొడ వడంచి
మదగజాశ్వంబులను ద్రుంచి - యెదురులేక. 30

క. వేటాడుచుఁ బురవీథుల
[3]ఘోటింపుచు వారి లెక్క - గొనఁ డెవ్వరి నీ
యాటోప మొప్ప నాకపి
కీటంబును ద్రుంచి మమ్ముఁ - గృపఁ బ్రోవఁగదే. 31

చ. అనవుడు దానవాధిపతి - యాత్మగతంబున నిట్టివాని న
య్యనిమిషసిద్ధయక్షఖచ - రాద్భుతపన్నగముఖ్యులందునం
గని విని యెన్నఁడు న్నెఱుఁగ - గాఢపరాక్రముఁడీతఁ డంజనా
తనయుఁడు తప్ప దంచు నతి - ధైర్యము శౌర్యము మీఱ వేగనన్. 32

1. కొట్నము = ఊడిగము. సేవ. శ.ర.
2. అన్నియు సదును - పూ.ము.
3. ఘోటించు = తిరుగు. సూ.ని. ఇదే ప్రయోగము.

ఆ.వె. కలితవిమలరత్న - కాంచనమయ మైన
కొలువుకూటమునకు - నలర వచ్చి
యతులసింహపీఠి - నాసీనుఁ డై మంత్రి
పుంగవులను బిల్వఁ - బుచ్చుటయును. 33

సీ. అఖిలకంటకుఁ దష్ట - హస్తుండు బహుముఖి
సూచీముఖుఁడు రత్న - లోచనుండు
ఘటనాసికుఁడు శూర్ప - కర్ణుండు ద్విశిరుండు
కాండుండు నగభయం - కరుఁడు బలుఁడు
నిర్జరాంతకుఁ దూర్ధ్వ - నేత్రుండు శార్దూల
దంష్ట్రుండు సింహకే - తనుఁడు విజయుఁ
దుష్టభోజనుఁ డాహ - వోన్మత్తుఁ డభయుఁడు
సూకరవదనుండు - శూలజిహ్వుఁ

తే.గీ. [1]దధికదంతుండు మొదలుగాఁ - గలప్రధాన
ముఖ్యు లేతెంచి పొడగాంచి - మ్రొక్కి నిలిచి
గర్వదుర్వారసంరంభ - కలితు లగుచు
నసురపతి తోడ నిట్లని - రెసక మెసఁగ. 34

వ. దేవా! యీయర్ధరాత్రియందు మమ్ముం బిలువంబంప నవధరించితిరి యభియాతి గలిగుండుఁగదా కలిగెనేని. 35

చ. జలధులు పుక్కిలించి కుల - శైలము లేదును నుగ్గుసేసి రు
ద్రులఁ బరిమార్చి దేవతల - త్రుళ్లడఁగించి దినేశ చంద్రులం
బొలుపుఁదొలంగఁ గొట్టి ఫణి - పుంగవుచేదు దలంగ మట్టి ది
క్కులు పగిలించి బ్రహ్మనొక - [2]కొక్కిఁకిఁ దెచ్చెద మీక్షణంబునన్. 36

ఆ.వె. [3]సెలవు వెట్టు దేవ - చింతింప నేటికి
శత్రువరులమీఁదఁ - జనుట మాకు
వేడుకొదవఁ బెండ్లి - యాడంగఁ బోయెడు
నట్లు కాదె నీదు - కరుణ ననిన. 37

1. ఉలికెదంతుండు - పూ.ము. అధికదంతు (3-46)
2. కొక్కి = విషమస్థితి. సూ.ని. ఇదే ప్రయోగము. 'కొల్కికి' - సరియగు పాఠమేమో!
3. గీ - పూ.ము.





క. జననాథుల నేఁ దెచ్చుట
హనుమంతుం డెఱిఁగి వచ్చి - యసురావలులన్
దునుమాడి వారిఁ గొనిచని
కనలుచు నిటవచ్చినాఁడు - క్రమ్మఱ ననికిన్. 38

క. వాహినులతోడఁ జని మీ
రాహవమున నతనిఁజంపుఁ - డటు గాకున్నన్
బాహుప్రతాపవిజయో
త్సాహముతోఁ బట్టితెండు - సయ్యన నిటకున్. 39

చ. అని ఘటనాసికున్ ఘటకు - నష్టభుజున్ బలునూర్ధ్వనేత్రునిం
బనిచిన వాండ్రు లోకములు - భస్మము సేయఁగ నేగుభంగి న
త్యనుపమఘోరరాక్షసభ - టావలి గొల్వ రథంబు లెక్కి మే
దినియును మిన్నుఁ గ్రక్కదల - దిక్కులు మ్రొగ్గఁగ నేగి యార్చుచున్. 40

చ. అనిలజుఁ జుట్టుముట్టుకొని - యద్భుతదివ్యశరంబు లుద్ధతిన్
ధనువున నిండనేయుచును - దారుణఖడ్గము లెత్తి వైచియుం
గొనకొని వాఁడిశూలముల - గ్రుచ్చియుఁ గుంజరఘోటకంబులన్
మొనయఁగ డగ్గరించియును - ముష్టియు దృష్టియు మీఱఁ బోరుచున్.

ఉ. భానుకులేశ! యప్పు డతి - బాహుపరాక్రముఁ డాంజనేయుఁ డ
ద్దానవనాథుమంత్రులను - దద్భటులం గరిఘోటకంబులన్
ఊనినయల్కతోఁ బొదలు - చుండఁ గనుంగొని మేను వెంచి తో
డ్తోన మహీజము ల్వెరికి - దోర్బల మొప్పఁగఁ దాల్చి ధీరుఁడై. 42

సీ. కుంభినీభృత్సమా-రంభంబు నణఁగించు
దంభోళిగతిని సం-రంభ మలరి
భూరివిస్ఫుటమరు - ద్భుగ్బృందములఁ జెండు
ఖగకులాధిపుమాడ్కిఁ - గడిమి గలిగి
చటులనిర్భరమేఘ - పటలంబుఁ దూలించు
జంఝూనిలము రీతి - జవము మిగిలి
గురుతరాద్భుతగాఢ - ఘోరాటవిని గాల్చు
కార్చిచ్చులీల ను-గ్రత వహించి

తే.గీ. కాల్బంబుల నురుమాడి – కరుల హరుల
నేపణింగించి రథముల – నెల్లఁజదిపి
వాల మంకించి బలునేల – వ్రాలఁగొట్టి
ఘటకు నెంతయు రక్తంబుఁ – గ్రక్కఁ జంపె. 43

గీ. ఊర్ధ్వనేత్రునిఁబడఁ దన్ని – యుదరకుండఁ
బట్టి నేత్రంబు లుద్ధతిఁ – బగులఁబొడిచి
హతముఁ గావించి మఱి యష్ట – హస్తుఁగినిసి
పుడమిపై డొల్లఁబిడికిటఁ – బొడుచుటయును. 44

క. ఘటనాసికు నాసిక ము
త్కటముగ బెదరంగఁ బొడిచెఁ – గడువేగముతో
నటయిట చనకుండఁగ నం
తట వక్షముఁ బొడిచె బిట్టు – ధరణిం గూలన్. 45

వ. అప్పుడు హతశేషు లైనదైత్యులు భీతి గదురం బాఱి మైరావణున కెఱింగించిన నతం డంత రౌద్రాకారుం డై యష్టభుజు శూర్పకర్ణు నరభయంకరు నిర్జరాంతకు శూలజిహ్వు నఖిలకంటకు నభయు శార్దూలదంష్ట్రు నధికదంతు సింహకేతు సూకరవదనుం గనుంగొని మీ రమ్మర్కటాధముం జంపి రం డని పంపుటయు వారును బ్రళయకాలాభీలకరాళపావకోజ్జ్వలులచందంబున నడచుచు వజ్రకవచంబులు దొడిగి వివిధశస్త్రాస్త్రపాణులై మహనీయకేతనాకీర్ణంబు లైనదివ్యరథంబు లెక్కి యుభయపార్శ్వంబులఁ జతురంగబలసహస్రంబులు గొలువ భేరీనిస్సాణాదిరవంబులు చెలంగ నార్పులు నింగిముట్ట జగంబులు తల్లడం బంద మహోద్ధతింబోయి మరుత్తనయుందాఁకి పుంఖానుపుంఖంబులై పర్వనిశిత విశిఖజాలంబులవృష్టిఁ గప్పిన నక్కపిరాజకంఠీరవుండు సింహనాదంబు సెలంగ భుజం బప్పళించి కాల్బలంబులమీఁదఁ గవిసి మహాభయంకరవాలంబునఁ బదుర నూర్వుర వేవుర నొక్కొక్కమాఱు గుదియంబట్టి బంధించి నభోమార్గంబునం జరజరంద్రిప్పి విసరిఘోటకంబులమీఁద వైచిన నవి జఠరంబులు ద్రెస్సి యొరలుచుఁ గరిఘటంబులమీఁదఁద్రెళ్ళఁద్రెల్లినయుద్ధతినవి మదంబులుడిగిపొంకంబులుదొరంగి వజ్రపాతహతింగూలు ధరాధరంబులుచందంబుధరమీఁదం గూలం గూలిన వేగంబుననవితుత్తుమురుగా విఱిగి చాపకట్టువడియెఁ బడినయప్పుడ





యయ్యోధవరులు ధరాతలంబునకు లంఘించి [1]క్షురికాతోమరచక్రశూలభిండి వాలముసలముద్గరగదాద్యాయుధంబులచేతం గుప్పింపందొడంగిన వానికి మనంబునం జలింపక మారుతాత్మజుండు త్రిపుర దైతేయులం బరిమార్చునట్టి యాదిరుద్రుండునుంబోలె రౌద్రానలస్ఫురితాక్షుండై యొక్క యున్నతసాలవృక్షంబు వెఱికి కేలంబూని బారిసమరినవిధంబున నొక్కొక్క పెట్టున నొక్కొక్కని నుక్కణంగించి [2]విజృంభించి యార్చి వెండియు రణకౌతుకంబునం దిరుగుచున్న యెడం జెదరి పాఱినదైత్యులతి భయాతురులైపోయి మైరావణుంగాంచి యిట్లనిరి. 46

ఆ.వె. [3]దైత్యవంశనాథ! – తరుచరమాత్రుండు
గాఁడతండు మంత్రి – గణమునెల్ల
మితము లేనియట్టి – చతురంగబలముల
తోడఁగినిసి జమునిఁ – జూడఁ బంపె. 47

క. అనవుడు దానవనాయకుఁ
డనికిని దాఁ బోవఁదలఁచు – టది యెఱిఁగి మనం
బున భీతినొంది యాతని
వనితామణి వచ్చి కాంచి – వగచుచు ననియెన్. 48

క. ఏలయ్య! జీవితేశ్వర!
కాలము కొలఁ దెఱుఁగ కిట్లు – కదలెద వనికిన్
వాలిన కడిమిని ననిలజుఁ
గైలాసనివాసుఁ డైనఁ – గలఁడే గెలువన్. 49

చ. మదిమదినుండి చెప్పినను – మానక రాజులఁ దెచ్చి యెన్నఁడున్
ఉదరనియిప్పురంబునకు – నొప్పమిఁ దెచ్చితి వింక నైన దు
ర్మదముఁ దొఱంగి నీవు హను–మంతుని దివ్యపదాబ్జయుగ్మముల్
ముదమునఁ గాంచు దానవస–మూహముఁ గాచును నాతఁడెంతయున్50

ఆ.వె. [4]దనుజలోకనాథ! – తర్కింపఁగా నీకుఁ
జలము మేలొ కాక – ఫలము మేలొ

1. క్షురిక – పూ.ము.
2. విజ్జృంభించి – పూ.ము.
3. గీ – పూ.ము. 4. గీ – పూ.ము.

కలఁగుచున్న నాకుఁ – దెలియంగఁజెప్పవే
యనిన నతఁడు వలికె – నబలతోడ. 51

సీ. బలభేదిఁ బట్టి దు–ర్బలునిగా ఝాడించి
పావకుఁ బెనుమంట – పాలు సేసి
సమవర్తి బింకంబు – సమయఁగా నదలించి
దనుజేంద్రు నొకకోణ – మునకు నొత్తి
నీరధీశ్వరువాఁడి – నీఱుగా భర్జించి
గాలిని గాలించి – తూలఁగొట్టి
విత్తాధిపతిని గ్రొ – వ్వెడలంగ బాధించి
చంద్రశేఖరుని భి–క్షకుని జేసి

తే.గీ. బ్రహ్మ మెప్పించి వరములు – వడసినట్టి
నాకు లక్ష్యంబె యొక్క వా–నరుఁడు నేఁడు
కడక నేతెంచి యిట్లేల – పలికి తబల!
నాప్రతాపంబుఁ దలఁపక – నాతి నీవు. 52

వ. అదియునుం గాక 53

క. క్షాత్రంబు విడిచి భీతిని
శాత్రవుఁ బొడగాంచి లజ్జఁ – జచ్చుటకంటెన్
జిత్రాసిధారచేఁ దెగి
వృత్రారిపదంబు గాంచి – వెలయుట యొప్పున్. 54

క. కావునఁ బ్రత్యుత్తర మొగి
నీవల దలివేణి లోని – కేగుమటన్నన్
దైవాజ్ఞ గడువనోపను
నీ వశమే యనుచు నరిగె – నెవ్వగ తోడన్. 55

వ. అయ్యవసరంబున మైరావణుండు మహాప్రళయాంతకుచందంబునం గోపించి నిష్ఠురప్రథనచేతో ముదంబునం బొంగుచు దివ్యచందనమాల్యాంబరాలంకృతుం డై బాలారుణకిరణచ్ఛవి నపహసించుకిరీటంబు ధరియించి విద్యుల్లతానికరప్రతి మానశోభితంబు లగుపతకంబులు వెట్టి నవరత్న ఖచితంబు లగు కేయూరంబులు కంకణంబులు దొడిగి చతుర్దశలోకభీకరంబు లగుగండపెండేరంబులు వెట్టి





కరవాలశూలముసలముద్గరగదా ఖడ్గ [1]చక్రక్షురికాభిండివాలతోమర శరశరాసనాది వివిధశస్త్రాస్త్రప్రాణియై నీలాంబు దోన్నతబంధురజవ నాశ్వసహస్రాభీలంబును సమంచిత బహుఘంటికాకీర్ణ నినదంబును సముత్తుంగ భీషణస్ఫుటాష్టాదశ చక్రభాసురంబును నైనయనలార్క సంకాశం బగురథం బట్టహాసుండు సారథియై నడుపఁ దద్రథారూఢుండై బ్రహ్మాండభాండంబు లదరఁ బ్రస్థానభేరి వేయించి వందిజనకైవారంబును మాగధమంజులగానంబును మంగళపాఠకపఠనంబును బెరసి వీనులకుం జల్లనైపొలయఁ జటుల భేరీనిస్సాణపటహశంఖకాహళాది భేరీరవంబులు మిన్నంది భోరునగలంగ [2]నతులోద్యత్ స్ఫారనిర్మలమణిదీపికా సహస్రంబులు వెలుంగ ధవళవిచిత్రచ్ఛత్ర[3]చామరధ్వజంబులు తండోపతండంబులై మెండుమిగుల వేత్రహస్తులసందడి జడియం జెలంగుచు బరాబరులు సేయ నాహవోన్మత్తుం డై సూచీముఖరక్తలోచనవిజయకాండు లద్భుతదేదీప్యమానరథంబు లెక్కి యుభయపార్శ్వంబులఁ గ్రందుకొని నడువ మదగజాశ్వశరభ గండభేరుండ భల్లూకలులాయగార్ధభోష్ట్రశునకసూకరకుక్కుట ప్లవంగ మార్జాల జంబుక మకరదర్వీకరవృశ్చికాదివాహనంబుల నెక్కి వీరదానవసముదయంబులు పంతంబులు వలుకుచు బిరుదులు వక్కాణించుచుఁ బ్రతాపోద్దీపితులై నేల యీనినవిధంబున బలసి నల్గడలంగొల్వఁ దత్సైన్యసంభ్రమస్ఫురితనిర్ఘాత ధూళిపటలంబు సకలలోకంబుల కంధకారంబు దోఁచుచందంబునం గలయం బర్వ నురుతరస్యందననేమీస్వనంబులును దురంగహేషారవంబులును [4]మదభద్రగజఘీంకారంబులును నుగ్రభటసింహనాదంబులును రాహుత్తుల వీరాలాపంబులు నొండింటిం గలిసి విభేదంబు లేక యేకధ్వనితోడ మించి దిక్కులకు భయంబు పుట్టింపం గదలి మహోద్ధతిం బోయి యప్రతిమప్రతాపుం డగు నక్కపివీరపుంగవుండాఁకి చుట్టుముట్టిన. 56

క. మృగముల నాఁకటఁ గనుఁగొను
మృగపతిచందమునఁ జూచి – మే నుద్ధతితో
గగనంబు దాఁటఁ బెంచుచు
నగసప్తక మడల నొక్క – యద్భుత మొదవన్. 57

1. క్షురకభిండినాల – పూ.ము.
2. నతులోద్యస్ఫార – పూ.ము
3. విచిత్ర ఛత్ర – పూ.ము
4. మదభద్రఘుంకారంబులును – పూ.ము.

సీ. భానుబింబంబులు – పంద్రెండు నొక్కటై
తరుచరరూపంబుఁ – దాల్చె నొక్కొ!
మొగిమీఱ నగ్నులు – మూఁడును నొక్కటై
యగచరాకృతి యొప్ప – నయ్యె నొక్కొ!
కడుజవంబున నేడు – గాడ్పులు నొక్కటై
ప్లవగపుంగవురీతిఁ – బరఁగె నొక్కొ!
హరునిచిచ్చుఱకన్ను – గరళంబు నొక్కటై
యలవడఁ గపిచంద – మయ్యె నొక్కొ!

తే.గీ. యనుచు దైతేయసైన్యంబు – లదరి చెదరి
యల్లకల్లోలమై పాఱ – నాంజనేయుఁ
డుగ్రదుర్వారపటునిష్ఠు – రోగ్రభీమ
వాల మంకించి సంగర – లోలుఁ డగుచు. 58

సీ. రథములమీఁదికి – బృథుశక్తినలరించి
యరవరలైపాఱ – విఱఁగ ద్రొక్కి
కుంభికుంభములపైఁ – గుప్పించి కుప్పించి
నఖపఙ్క్తిచేఁ జించి – నష్టపఱిచి
మేటిఘోటకరాజి – మీఁదికి నురువడి
నురికి యచ్చో నేల – నొరల నులిపి
పటుభయంకరదైత్య – భటకదంబముమీఁది
కెగసి రక్తము లొల్క – నేపుఁ జూపి

తే.గీ. యంకమున కుబ్బి యదరించి – యస్త్రశస్త్ర
తతుల నొప్పించుయోధులఁ – దరిమి పట్టి
కాళ్లువ్రేళ్లును శిరములుఁ – గరము లురము
లొక్కవర్ణంబుతో నుండ – నుక్కడంచి. 59

వ. మఱియు మనంబులోనం బెనంగొనియున్న యుత్కటరోషంబు రెట్టింప నప్పవనతనయుండు విజృంభించి సింహనాదంబు చెలంగించి దక్షాధ్వరంబునాఁటివీరభద్రుండునుంబోలె నంతకంతకు సైన్యంబులోఁ జొచ్చి నిర్భరసంగరలోలుం డగుచు నాభీలవాలంబునం బదురం బదిపదుల వేల లక్షలం



బెనఁచి పట్టి నభోమార్గంబునం జిరజిరం ద్రిప్పి వసుంధరాతలంబున రయంబునం గట్టలకట్టఁ ద్రెళ్లవైచుచున్నంతఁ దత్సైన్యంబు లెక్కడెక్కడం గనుంగొనియె నక్కడక్కడ [1]హనుమంతసహస్రంబలై యుండిన [2]బ్రమసి తమలో నొక్కఁడొక్కఁడుం దలపడి యద్భుతదివ్యశస్త్రంబులు వేసియు నడఁచియు వ్రచ్చియుఁ గ్రుచ్చియుఁ బీరంబు వొలివోని చలంబునం బోరుచు ఖండవిఖండంబులై కాలునుం గాలునుం బెనచుకొని కూలుకాల్బలంబులును నక్కాల్బలంబులమీఁదం గవిసి నుగ్గునూచంబులై దొర్లురథంబులును రథంబులమీఁదం బడి సోలి మదంబున వ్రాలుతురంగంబులును నత్తురంగంబులమీఁదం దునిసి మ్రొగ్గు కళేరంబులును నక్క ళేబరంబులమీఁదం బడి చూర్ణంబులగు సింహశరభశార్దూలగండభేరుండాది క్రూరజంతువాహనంబులునునవ్వాహనంబుల సందడిం జడిగొని ముడివడం దొఱంగు [3]ఛత్రచామరాలవర్తధ్వజంబులు నై యెల్లసైన్యంబులుం దెగటారె నప్పుడు రక్తలోచనుం డధికరక్తలోచనుం డై కనుంగొని రథంబు డాయం దోలించి యిట్లనియె. 60

చ. నిలు నిలు పోకు వానరమ! – నీచులఁ గొందఱఁ జంపి యుబ్బునన్
మెలఁగెడునట్లు కాదు కడు – మించినమచ్చరవృష్టిచేత నీ
తల నుఱుమాడి రక్తమును – ద్రావెద సత్కృప నీకు నడ్డమై
జలజభవుండు వచ్చినను – సైరణసేయక సంహరించెదన్. 61

క. అనవుడు మారుతి నిప్పులు
గనుగవలం దురల దైత్యుఁ – గని రోషముతో
ఘనసాలవృక్ష మొక్కటి
యనువొప్పఁగఁ దాల్చి యరద – మవనిం గూల్చెన్. 62

గీ. కూల్చి వాలంబు మెడఁజుట్టి – కుదియఁ బట్టి
జన్మభూమికి బలిద్రిప్పి – సకలభూత
కోటి వినుతింపఁ బెల్లార్చి – కూఁకలిడఁగ
విసరివైచిన హతుఁడయ్యె – విహ్వలించి. 63

ఉ. అంతటఁ గాండుఁ డల్గి ప్రళ – యాంతకురీతిని నేపుమీఱి య
త్యంతకఠోరభూరివిశి – ఖావలిచే హనుమంతుదేహ మా

1. హనుమత్సహస్రంబులై – అని యుండవలయును.
2. భ్రమసి – పూ.ము
3. ఆలావర్తము = ఆలవట్టము. శ.ర. సూ.ని.

వంతయుఁ దప్పకుండఁ గడు - నద్భుతలీలల నేసి ధీరుఁడై
యెంతయు మించిన న్నతఁ డ-హీనపరాక్రమమానసంబునన్. 64

క. అట తనతనువున నాటిన
చటులాస్త్రము లవని నురుల - ఝాడించి మహో
త్కటకోపుఁ డగుచు దిక్కులు
పెటపెటపగులంగ నార్చి - పృథుసత్త్వమునన్. 65

శా. చక్షుశ్శ్రోతను జూచునంతఁ గడు ను-త్సాహంబుతోఁ బొంగున
ప్పక్షీంద్రుండును బోలెఁ గాండుభుజద - ర్పంబెల్ల వీక్షించి స
ద్వృక్షం బొక్కటి దాల్చి పూచిపటుదో - ర్వీర్యంబునన్ ధీరుఁడై
రక్షోవర్గము తల్లడింపనొగి సం-రంభంబునన్ వైచినన్. 66

గీ. గుఱ్ఱములు నాల్గు తేరు నుగ్గులుగఁ జెదర
ధనువు పేడెత్తి సారథి - ధరణిఁ బడినఁ
గడిమిఁగాండుండు పలుకయు - నడిద మొప్పఁ
దాల్చి హనుమంతు నుద్ధతిఁ - దాఁకుటయును. 67

క. పిడుగుఁ దడఁబఱుపఁజాలెడు
పిడికిట నడినెత్తిఁ బొడువఁ - బెదవుల వెంటన్
వడి రక్త మొలక ధరపైఁ
బడి ప్రాణంబులకుఁ బాసెఁ - బార్థివతిలకా! 68

క. భజనసెడి వాఁడు గూలిన
విజయుఁడు నని ఘోరబాణ - వితతుల నేయన్
భుజసత్త్వ మొప్పఁ బాటల
కుజ మొక్కటి దాల్చెఁ బ్లవగ - కుంజరుఁ డంతన్. 69

చ. కడుఁ దనమేన నొక్కవిశి-ఖంబును మూఁడకమున్న రథ్యముల్
దొడిదొడి ధారుణింబడఁగఁ - ద్రుంచి మహాద్భుతవాల మెత్తి కీ
ల్మడఁగఁగఁ జుట్టిపట్టి రథ - మండనముల్ చెదరంగఁ ద్రిప్పి బ
ల్విడి నెగనెత్తి వైచెఁబల - వించుచు రక్తము వెళ్ళి త్రెళ్లఁగన్. 70

సీ. అప్పు డుద్ధతితోడ - నాహవోన్మత్తుఁడు
సూచీముఖుం డంతఁ - జూచి మండి

70



గుణరావమున మించు - గురుచాపమున దివ్య
శరములు సంధించి - చక్కఁ గదిసి
పోరిపోరి పుంఖాను - పుంఖమై పర్వంగ
నేయుచోఁ గోపించి - వాయుజుండు
వాలముఖంబున - వడి వాని బంధించి
బలుచాపములు ద్రుంచి - పాఱవైచి

తే.గీ. యరద మరదంబుతోడుత - నంటఁ దన్ని
యెగసి యిద్దఱ నొక్కట - నిరియఁ బట్టి
పక్కటెముకలు విఱుగంగ - నొక్కి చంపి
సింహనాదంబు సెలఁగించె - సృష్టి గలఁగ. 71

వ. అనంతరంబ మైరావణుండు నిశ్శేషంబుగా సైన్యంబు దెగటారిన నధికరోషావేశంబుతో నెఱమంటలు గన్నుల న్వెడల నాంజనేయు న్వీక్షించి రథంబుఁ గదియందోలించి భూభాగనభోభాగంబు లాకంపింప నురుతరశరాసనంబు గుణారావంబుసెలంగ నెక్కుపెట్టి సింహముఖ శార్దూలముఖ భల్లూకముఖ వరాహముఖాది మార్గణపరంపరలు కులనగేంద్రంబుమీఁదఁ గాలాభ్రంబు వర్షించుచందంబున నిగుడింప నక్కపివీరకంఠీరవంబు గనుంగొని యిప్పుడుగదా! మత్కోపబడబానలంబునకు భవద్దేహసాగరంబు గ్రోలంగలుగుట యని భయద్వియోగదుఃఖావేశంబునం బొరలు శాఖామృగసైన్యకోటి శోకనదీకూలం బగుమహాభీలవాలమల్లార్చియార్చి యబ్బాణంబులు ఖండించి తత్సమీప శైలవృక్షంబులు రెండు చేతులం బూనిన తండతండంబులై పాఱఁ బ్రచండకోపమున న్వైచిన నద్దానవేంద్రుండు చలింపక నిష్ఠురాంబకంబుచే నవి నడుమనే త్రుంచి విజృంభించి యి ట్లనియె. 72

ఉ. పంకజగర్భుఁ డొండె బలి - బంధనుఁ డొండె పురారి యొండె ని
శ్శంకను మీఱినట్టినృప - చంద్రుఁడు రాఘవుఁ డొండె కాక నా
పొంకపుబాణవహ్ని నినుఁ - బోటికిఁ జేరఁగ నెట్లువచ్చు బొ
మ్మింకను లావుసేసితివి - యింతయె చాలును నీకుఁ బావనీ! 73

క. చలమునఁ బోక యెదిర్చినఁ
గలశాంబుధి దాఁటినట్టి - గతియును ద్రోణా

చల మెల్ల పెటికి తెచ్చిన
బలిమియు వెడలింతు ననినఁ - బవనజుఁ డనియెన్. 74

చ. దనుజదురాత్మ! నీకు నిఁకఁ - దస్కరవృత్తిని జొచ్చి మాయ నీ
దినకరవంశ్యులం దొడరి - తెచ్చినపద్ధతిఁ బోవరాదు నా
ఘనతరవాలరోమమునఁ - గట్టి జగంబులు మెచ్చ నిన్ను న
య్యనిమిషు లెల్ల భీతి నిట - నడ్డము వచ్చినఁ గావఁ జంపెదన్. 75

మ. అని శైలంబులు వీఁకఁ దాల్చి యతులో - ద్యద్వేగసంరంభ మొ
ప్పన మీఁదం బడవైచి తన్ని భుజద - ర్పం బాఱఁగా నిల్చినన్
దనుజేంద్రుండు దలంక కార్చి యలుకం - దట్టించి దుర్వారుఁడై
హనుమంతున్ సకలాంగము ల్దడిపె ఘో - రాస్త్రౌఘవర్షంబులన్. 76

క. నిండిన చలమున నతఁ డొక
కొండ వడి న్వైచె వైవ - గొబ్బున నడుమన్
ఖండించె నసుర నాలుగు
ఖండంబులు గాఁగ దానిఁ - గడుచిత్రముగన్. 77

ఆ.వె. అంతఁ బవనసూనుఁ - దత్యంతరోషంబు
మనములోనఁ బొడమి - పెనఁగొనంగ
దనుజుమీఁద వైచె - ఘనవృక్షపంక్తులు
తోడ నేయఁ జేతు - లాడకుండ. 78

వ. ఇట్లు వైచిన. 79

ఉ. క్రూరనిశాటుఁడస్త్ర మరిఁ - గొంకక తిన్ననఁబోసి నారి వి
స్తారముగాఁగ విల్దిగిచి - దిక్కులు తల్లడమంద నార్చి వి
స్తారమహోగ్రకోపశిఖ - చక్షులఁ బర్వఁగఁ జూచి యేసినన్
మారుతి బాహుమధ్య మస - మానగతిన్ వడి గాడిపాఱఁగన్. 80

ఉ. దానఁ గడంక దూలి బెడి - దంబుగ మూర్ఛఁ బెనంగి తేరి య
ద్దానవనాథునప్పటిని - దారుణభూరుహశైలసంఘముల్
వూని యదల్చి వైవ నవి - భూరిశరంబుల నేసి వాఁడు తో
డ్తోడన త్రుంచివైచెఁ గడు - దోర్బల మొప్పఁగ సాహసంబునన్. 81

వ. అంత 82



క. పుట మెగసి తాళవృక్షము
చటులోద్ధతిఁ బూనిపెటికి - సారథి నవనిన్
విటతటముగఁ బడవైచెను
బటుభుజసత్వంబు మెఱయఁ - బవనజుఁ డల్కన్. 83

చ. చలమున దానవుం డపుడు - సారథియున్ రథికుండు దాన యై
జలధులు నబ్జజాండములు - ఝల్లనఁగా నొకబొబ్బ వెట్టి భూ
తల మదరంగ దేరు గడుఁ - దార్కొన బీరమువాఁడు డోలి చే
తుల కసి వోవ నేసెఁబలు - తూపుల మారుతపుత్త్రు గాడఁగన్. 84

వ. ఇట్లేసినం గడిమిఁదొరంగ కతండు నంతకంతకు భుజాటోపంబునం బొంగుచు హుంకారంబుతో రథోపరిభాగంబున కుప్పరం బెగసి పదఘట్టనంబులచే ఘోటకంబులఁ గీటడంచి చక్రంబులు వక్రంబులుగా విఱిచి నిష్ఠురప్రథనభీకరం బగు వాలం బంకించి యొడసి చాపంబులు దుస్సిపోవైచి లలాటకర్ణమధ్యంబులఁ బిడికిటం బొడిచెఁ బొడుచుటయు సమస్త భూషణంబులు చెదరి కొండొక సేపు జిరజిరం దిరిగి రక్తంబులు గ్రక్కుకొనుచు వసుంధరాతలంబునం బడి మూర్ఛంబొంది యాక్షణంబునం దెలసి విరథుం డయ్యు మహాప్రతాపంబునం బదాతి యై నిలిచి యిట్లనియె. 85

చ. వెలసిన నాదు వర్తనము - వీనులసోఁకినయంత మాత్రలో
వలసలు వోదు రుక్కణఁగి - వాసవుఁ డాదిగ దేవసంఘముల్
గలఁగక భూరిబాహుబల - గర్వము సూపితి వీవు మేలు కొం
దలపడకుండు మింక బెడి-దం బగు మద్ఘనశస్త్రరాజికిన్. 86

మ. అని మార్తాండ మరుత్సురాభ మగు ను - ద్యచ్ఛూల ముగ్రాకృతిన్
దనుజాధీశుఁడు కేలఁ బూని పటుసాం-ద్రస్ఫారసత్వంబునన్
హనుమంతున్ వడి వైచె వైచిననతం - డాభీలవాలంబునన్
దునిమెం దానిని గంద్రలైపడ వెసం - దుర్వారుఁ డై యార్చుచున్. 87

ఉ. అంతట నిర్జరారి విల - యాంతకురీతిని బేర్చి విశ్వభృ
ద్దత్తగదాయుధంబు భయ - దంబుగఁ జేత ధరించి పూన్కితో
నెత్తి యదల్చి వైవ నది - యేపున మండుచు నేగి యాప్లవం
గోత్తము ఫాలదేశము మ - హోద్ధతి మీఱఁగఁ దాఁకె నెంతయున్. 88

క. అగ్గదతాఁకున కలయుచు
నగ్గిరిచరుఁ డవని వ్రాలి - యతివేగముతో
నగ్గలిక లేచి యురువడి
[1]నగ్గిరిరిపురిపుని వైచె - నచ్చటిగిరులన్. 89

చ. దనుజవిభుండు వెండియును - దట్టపుఁ గోపముతోడ శూరతం
గని యొకశక్తి వైవ నది - కాలగళస్ఫుటఫాలనేత్రసం
జనితమహాదవాగ్నిసదృ - శంబుగ మండుచు క్షుద్రఘంటికా
నినదము లుప్పతిల్ల నతి - నిష్ఠురవృత్తిని రాఁగ నెంతయున్. 90

క. తూలక తచ్ఛక్తిం గని
వాలం బంకించి యపుడు - వసుధం బడ మై
రాలఁగ బిట్టడఁచెను వడి
వాలిసహోదరుని మంత్రి - వాలిన కడిమిన్. 91

క. దనుజాధీశ్వరుఁ డప్పుడు
హనుమంతుపరాక్రమమున - కచ్చెరువడుచున్
మును భద్రకాళి యిచ్చిన
సునిశితఖడ్గంబు వైవఁ - జూచిన నంతన్. 92

మ. దిగిభేంద్రంబులు మ్రొగ్గె మిన్నగిలె న-ద్రిశ్రేణు లల్లాడెఁ బ
న్నగనాథుండు దలంకె వార్ధు లినికెన్ - నక్షత్రముల్ రాలె లోఁ
బగిలెం ధారిణి పంకజాప్తశిబిం-బంబుల్ గడు న్మొగ్గె ము
జ్జగము ల్తల్లడమందె బ్రహ్మ దలఁకెన్ - స్వాంతంబు పేదెత్తఁగన్. 93

చ. అనిలతనూభవుండు వెస - నంతకుమున్ను నిశాటు వైవఁ బ
ట్టినతనచేతికొండఁ గని - డెందములో భయ మింతలేక య
య్యినకులుఁ డైనరాఘవుల - కే నిజభృత్యుఁడ నైతినేనియుం
జని యిది వానిఖడ్గమును - జయ్యనఁ ద్రుంచెదుఁగాక యుగ్రతన్. 94

క. అనుచున్ వైచె నతం డె
త్తినచెయ్యిఁ గదల్పకుండ - దిక్కులు వడఁకన్

1. గిరిరిపురిపుఁడు = పర్వతములకు శత్రు వింద్రుఁడు. ఇంద్రునకు శత్రువు మైరావణుఁడు.



జని ఖడ్గముఁ బరిమార్చెను
జనవర! నీ నామమంత్ర - సామర్థ్యమునన్. 95

చ. త్వరితముతోడ దానవుఁడు - వాలు కరంబునఁ బట్టి దీన నే
సురగరుడోరగామరుల - శూరుల శత్రులఁ జంపినాఁడ వా
నరవర! నిన్ను గెల్చుటకు - నాకు భరంబె యటంచు నవ్వి ని
ర్భరచటులాగ్రహం బెసఁగఁ - బల్కిన నాతఁడు ధీరచిత్తుఁడై. 96

ఉ. అల్పనిశాచరేంద్ర! వెస - నాలములోపల నీకు నిర్వ్యథా
జల్పము లాడనేల బల - సంపదఁ జూపెదఁగాక నాదుసం
కల్పము సెప్పెద న్వినుము - కంజభవాద్రిసుతేశవాయుభు
క్తల్పులు దోడువచ్చినను - దాఁగినఁ బోరిన నిన్నుఁ జంపుదున్ 97

వ. అని మరుత్తనయండు సమస్తలోకంబులుం బగుల సింహనాదంబులు నేసి మైరావణుం గదిసి వాలు వాలంబునం దిగిచికొని విఱిచి పాఱవైచిన నతం డాననంబునఁ బావకజ్వాలలు భుగులు భుగులన వెడల్ప వీక్షించి యట్టహాసంబుతోడుతం బిడికిళ్లు సాఁపుచుఁ గదియుటయు విజృంభించి పావని గని కరకమలంబు లవనీతలంబున జమరియు భుజం బప్పళించుకొని యుల్లంబు మల్లడిగొనుకోపంబు వెల్లివిరియ మల్లయుద్ధంబునకు బల్లిదుం డై తొడంగె నప్పు డయ్యిరువురు ప్రచండమార్తాండబింబంబుల చందంబున మండుచు మహాప్రళయకాలమేఘద్వయంబును గులమహీధరయుగ్మంబును గంభీరవయుగళంబును దంభోళియుగళంబును దలపడువిధమ్మునందలపడి వృత్రామరేంద్రాదులభాతిని గుమారతారకుల మాడ్కిని శంకరగజాసురేంద్రులకైవడి నంకకంతకుం బొంగుచు నొండొరుంజేరుచుఁ బాయుచు రాయుచు డాయుచుఁ బట్టుచుఁ గొట్టుచుఁ గఱచుచుఁ బొడచుచు నడచుచుఁ ద్రొక్కుచుంబోరుచో రక్తసిక్తాంగు లై వసంత సమయంబునం బూచినశాల్మలీకింశుకావనీరుహంబుల చాడ్పున నుండి రాసమయంబున. 98

క. కదు నలిగి గాలికూరిమి
కొడుకు వడిం దాఁకి యార్చి - గురుసత్వమునన్
బిడికిటను దనుజవక్షముఁ
బొడిచిన నపు డేపుదొఱఁగి - పుడమిన్ వ్రాలెన్. 99

క. ప్రాలిన నంతట వానిం
గాలునిపురి కంప నాకుఁ - గల్గె నటంచున్
ఆలోకింపఁగ దానవుఁ
డాలోనన తెలిసి మీఱి - యతికోపమునన్. 100

చ. పటుగతి కాలదండనిభ - బాహువు లెంతయుఁ జాఁపుకొంచుది
క్తటములు చెంగలింప బెడి - దంబుగ నార్చుచు వచ్చి తాఁకి మి
క్కుటముగ జుట్టువట్టుకొని - కుమ్మరిసారెవిధంబుఁ దోఁప మ
ర్కటవరుఁ ద్రిప్పి వైచెఁ దను - కంపముతోడ ధరిత్రిఁ ద్రెళ్లఁగన్. 101

ఉ. ఆకపిసింహుఁ డంతట ర-యంబునఁ గంపము మాని లేచి యు
గ్రాకృతితోడ నింకఁ దెగ - టార్చెదఁ గాకని చూచి దైత్యునిన్
భీకరవాల మెత్తి వడిఁ - బేర్చి గళం బవలీలఁ ద్రుంచె ద
ర్వీకరమస్తకంబుఁ గడు - వీఁక సుపర్ణుఁడు ద్రుంచుకైవడిన్ 102

క. చటుల మగు వీని కడి మిం
తటఁ దీఱె నటంచు నలరి - తరుచరుఁ డరుగన్
గుటిలనిశాటుఁడు క్రమ్మఱ
నట యెక్కడఁ బోయె దంచు - నడ్డము దాఁకెన్. 103

ఉ. మచ్చర మొప్ప నంత హను-మంతుఁడు రాక్షసుఁ జూచి యాత్మలో
నచ్చెరు వంది వీనిఁ దెగ - టార్చిన నెప్పటియట్ల వీఁడు గా
ర్చిచ్చువిధంబునం గవిసెఁ - జెచ్చెర వాలము పెంపుఁ దప్పెనో
జచ్చుట కల్లయో యిది ని-శాచరమాయయొ యంచు ధీరుఁడై. 104

చ. చఱచెను వాల మెత్తి ఘన - సత్త్వము మీఱఁగ దైత్యు నుగ్రతన్
గఱచెను వాఁడు వాయుజుని - కంఠ మతం దమరారిదంతమున్
విఱచెను రక్తము ల్దొఱుగ - వీఁకను దద్దనుజుండు పావనిం
బఱచెను ముష్టిఘట్టనలఁ - బావని వ్రచ్చెను గోళ్ల నాతనిన్. 105

ఉ. వెండియు వానరేంద్రుఁ డతి - విక్రమశాలి మదంబుతోడ నా
ఖండలుఁ డల్కతోఁ బది ము-ఖంబులఁ జక్కున నద్రిపక్షముల్
చెండినయట్లు దైత్యుతలఁ - జేతులు గాళ్లును సంగరావనీ
మండలభూతసంఘములు - మాటికి మెచ్చఁగఁ ద్రుంచె నెంతయున్ 106



క. ఈరీతిఁ దునిమి మొండెము
లార న్నలు దెసల వైచె - నసురాధముఁ జే
యారగఁ జంపితి ననుచును
మారుతి యటచనఁగ వాఁడు - మఱి చిత్రముగన్. 107

చ. తనువునఁ గాంతి యెప్పటి వి-ధంబునఁ జెన్ను దొలంగ కెంతయుం
గనుఁగవ నిప్పు లొల్కుచు వి-కంపము నొందఁగ నార్చి పేర్చి య
య్యనిలజుఁ గూడ ముట్టి - యట నద్రిచరాధమ! పోకు నిల్వుమీ
నిను దునుమాడ కేమిటికి - నేనిటఁ బోవఁగనిత్తు నావుడున్. 108

క. మైరావణుఁ బరి మార్చితి
మైరావణుఁ డిందులోన - మఱియుం గలఁడో
మైరావణతుల్యుం డై
వారక దైతేయుఁ డొకఁడు - వచ్చెనొ పోరన్. 109

వ. అనుచు నత్యద్భుతంబును బొందుచు గంధసింధురఘీంకారంబులు వీనుల సోఁకిన కంఠీరవంబు వడువున నప్పవనతనయుండు సంగరోత్సాహంబునం దిరిగి యవలోకించి మైరావణుంగా నిశ్చయించి మఱియును. 110

సీ. కదిసి యుద్ధతిఁ బట్టి - కాళ్లుచేతులు గూడఁ
దిగిచి విరువ నవి - తిరిగి మొలచుఁ
బెనఁగి లాగి శిరంబుఁ - బెఱికి వైచినఁ దొంటి
వడువుకంటెను దగ - వచ్చియుండుఁ
దొడరి గాత్రము పెక్కు - తునియలు గాఁ జేసి
వైచినఁ గ్రమ్మఱ - వచ్చి యుండు
మొనసి యంగము లొక్క - ముద్దగాఁ బిసికినఁ
దననాఁటి చెలువంబుఁ - దప్ప కుండు

తే.గీ. నున్న వీక్షించి మారుతి - యన్ని శాటుఁ
జలముఁ దక్కంగ వెండియు - సంహరించి
చెలఁగి ఘనపంక్తి చట్టలు - చీఱి పుట్టె
పొలుపు చెడఁ ద్రొక్కి యంతటఁ - బొమ్మటంచు. 111

క. త్రొక్కినయాక్షణమునఁగఱ
కెక్కినచోద్యంబుతోడ - నెలమి దలిర్పన్
రక్కసుఁడు కొలను జొచ్చిన
దిక్కరిచందమున వెడలె - దిక్కులు వణఁకన్. 112

క. అనిలజుఁ డంతట వానిం
గనుఁగొని నీమాయ లెల్లఁ - గడచనె నింకన్
దునిమెద నిట రమ్మనుచును
ఘనవృక్షం బెసఁగ దైత్యుఁ - గడిమిం దాఁకెన్. 113

చ. జగదధినాథ! యక్కపిని-శాచరనాయకు లప్పు డాజిలోఁ
దెగువయుఁ బెంపు సొంపు పటు - దృష్టియు ముష్టియు నొక్కతుల్య మై
తగఁ గడుఁబోరి రెంతయును - దారుణమూర్తుల నట్టిరీతి నీ
యుగమున నెవ్వరుం దొడరి - యుద్ధము సేయఁగఁ జూడ మెంతయున్

క. అనవుడు విని రఘురాముఁడు
మనమున నాశ్చర్య మంది - మైరావణునిన్
మునివర మఱి యేవిధమున
హనుమంతుఁడు గెల్చె ననిన - నతఁ డిట్లనియెన్. 115

చ. అనిలతనూజుఁ డయ్యసుర - నాగ్రహ మొప్పఁగఁ జంపుఁ జంపినన్
దనుజుఁడు వెండియున్ బ్రదికి - తత్కపినాథుని నొంచు నొంచినన్
గనుఁగొని నాని నప్పటికిఁ - గాలునిప్రోలికి నంపు నంపినన్
ఘనతరసత్త్వుఁ డైయతఁడు - గ్రమ్మఱి వానరుఁ బోరుఁ బోరినన్. 116

క. పవనతనూజుఁడు వెస న
ద్దివిజారిని జంపువిధము - దెలియక మిగులన్
వివశుం డయి వీక్షింపుచు
బవరముఁ జాలించి తనదు - భావములోనన్. 117

ఉ. హెచ్చినయల్కతోడ రిపు - లిద్దఱిలో నొక రెవ్వరేనియుం
జచ్చినదాఁకఁ బోరు టది - సొంగముగాక మహాద్భుతంబుగాఁ
జచ్చుచుఁ బుట్టుచుం దొడరి - సారెకు వచ్చినవాని గెల్వఁగా
వచ్చుట సాధ్య మేగతి న-వధ్యుఁడు వీఁడని చింతఁ గుందఁగన్. 118



క. మైరావణు దినమృత్యువు
దారుణరూపంబుతోడఁ - దా నై యలుకన్
జేరినవిధమున ననిలజు
నారయ దుర్దండి సేరి - యపు డిట్లనియెన్. 119

చ. తన నిజమైన ప్రాణములు - ధాతవరంబునఁ జేసి మేనిలో
నునుపఁడు దన్నిమిత్తమున - నుద్ధతితోడుత నెన్నిమార్లు ద్రుం
చినఁ దెగి క్రమ్మఱం బ్రదికి - చెచ్చెరఁ బోరఁగ వచ్చుఁ గావునన్
వనచరనాథ! వీని గెలు - వంగను దుర్లభ మెన్నిభంగులన్. 120

తే.గీ. అనిన వీక్షించి ప్రాణంబు - లసుర మేన
నుండ కేరీతి నెందుల - నుండుఁ జెపుమ
వాని మర్దింతు నావాల - వహ్ని చక్ర
వాళగిరి దాఁటిపోయిన - వాలుగంటి! 121

చ. అనవుడు నిప్పురోత్తమము - నందు మహోబిల మొప్పుచుండు దా
నను గుహయొక్క టెప్పుడును - నవ్యముగాఁ గనుపట్టు నందులో
ననుపమ మైనగుండు గల - దందును నేడుబిలంబు లుండు న
గ్గనులఁ జరించుఁ దుమ్మెదల - కైవడి నెప్పుడు వానిప్రాణముల్. 122

క. ఒక గనిలోపలితుమ్మెద
లొకగనికిం బోవు వాని - నొకమఱిగాఁ జం
పక యొకట నొకటఁ జంపినఁ
బ్రకటితముగ బ్రదికి తొంటి - భంగిన యుండున్. 123

ఉ. కావున నేడుతుమ్మెదల - గ్రక్కున నొక్కటఁ గూడఁబట్టి నీ
లావునఁ జంపితేని విక-లత్వముఁ బొందుచు నాఁడె భూమి మై
రావణుఁ డీల్గి యంతకు పు-రంబున కేగుటగాక తక్కినన్
దేవనిశాచరాదులకుఁ - దీరదు గెల్వఁగ వీని నావుడున్. 124

ఉ. దండధరాకృతిం గినిసి - దానవనాయకుఁ డంతలోన దు
ర్దండిని జూచి యి ట్లనియె - దానవవంశమునందుఁ బుట్టి నీ
దండిఁ దొఱంగి పేదగతి - దైన్యము నొంది మదీయభూరిదో
ర్దండపరాక్రమంబునను - దాయకు మర్మము లంది యిచ్చితే. 125

మ. అని క్రూరోక్తుల దూరఁ బల్కి ప్రకటో – ద్యద్వీరహుంకారముల్
దనరన్ మారుతి గిట్ట నొంచె నతఁడం–తన్ వాని నీక్షించి చ
య్యన వాలంబునఁ జుట్టి పట్టి చనఁ దా – నందంద కారించి మే
దినిమీఁదం బడవైచె వజ్రి వెస న–ద్రిన్ వైచుచందంబునన్. 126

వ. ఇట్లు వైచి. 127

చ. తడయక ధీరుఁ డై యొక ప–దంబునఁ గంఠముఁ ద్రొక్కి పట్టి వీ
ద్వడ నొకపాద మద్రికిని – బారఁగఁ జాఁచి యలీంద్రవర్గమున్
బొడుముగఁ గుంటితోఁ బిసికి – భూతలమందున వైచె వైచినన్
వెడలె సురారిప్రాణములు – విస్ఫుటమేఘరవంబు తోడుతన్. 128

వ. ఆ సమయంబున 129

సీ. కులగోత్రములతోడఁ – గులగోత్రసంఘంబు
నిరుపమోన్నతులచే – నివ్వటిల్లె
భోగీంద్రుఁ డాత్మేచ్ఛ – భోగించె నొకవేయు
శిరముల రత్నంపు – సిరులు మెఱయఁ
గూర్మి దైవారంగఁ – గూర్మంబు తల యెత్తె
తల యెత్తరా దను – తలఁకు మాని
కిటి భూమిదేవి కౌఁ–గిటిలోన భోగించె
దనుజభరశ్రాంతి – చనఁ జెలంగి

తే.గీ. భువనముల కెల్ల మోదంబు – వొడమె దిక్కు
లెలమిఁ దళుకొత్తె మిక్కిలి – యిచ్చఁ బొంగె
ననిలజుని కర్థి వలగొని – యలఁత మ్రొక్కి
సన్నుతులు నేసె దుర్దండి – సమ్మదమున. 130

క. హనుమంతుఁ డంతఁ గృపతో
దనుజాంగనఁ జూచి నీదు – తనయునిఁ గొంచుం
జనుదెమ్ము దైత్యలోక
మ్మునకుం బట్టంబుఁ గట్టి – పోయెద ననినన్. 131

వ. అతికుతూహలంబునం బోయి కారాగృహంబున ననేకదుఃఖంబులం బొందుచున్న కుమారుం గాంచి హనుమంతుప్రసాదంబున భవత్కర్మపాశంబులు



విఱుగ దయ్యె రమ్మని తద్వృత్తాంతం బంతయుఁ దెలియం జెప్పి శృంఖలాబంధంబు లూడ్చి పోవైచి శుద్ధోకంబుల స్నానంబ సేయించి దివ్యగంధమాల్యాంబర భూషణాలంకృతుం జేసి కొనివచ్చిన నతండు పావనిం గాంచి పాదపద్మంబులకు సాష్టాంగం బెఱంగి లేచి ముకుళితహస్తుం డై సవినయంబున నిట్లని నుతించె. 132

## దండకము

శ్రీరాఘవేంద్రాంఘ్రిపంకేరుహస్ఫారభృంగా! జగత్ప్రాణపుత్త్రా! మహాదేవవర్యా! ధరాపుత్త్రికాశోకగాఢాంధకారాబ్జమిత్రా! సురారాతివంశాటవీభీమదావాగ్నిరూపా! దినేశాత్మభౌమాత్మముఖ్యా! దశగ్రీవసైన్యాద్రిసందోహదంభోళిహస్తా! [1]సుపర్వాణగంధర్వసిద్ధోరగాధీశవిద్యాధరస్తోత్రపాత్రా! చతుర్వేదవేదాంగశాస్త్రప్రవీణా! [4]భవాంభోదఝుంఝూసమీరా! సుహృజ్జంతుహృన్నిర్మలాబ్జాకరా! దాససంచారహంసా! అహంకారమైరావణక్రూరసర్పేంద్రదామోదరస్యందనా! సత్కృపాలోచనాంభోజయుగ్మా! పటుస్థూలసూక్ష్మావతారస్ఫుటద్బాహుశుంభత్ప్రతాపా! మహాదివ్యయోగీంద్రనిష్కల్మషధ్యాన[2]ముద్రాప్రకాశోరుతత్త్వస్వరూపా! సుధాసౌధసత్కాంచనాభీష్టధర్మాత్మ భోగాపవర్గప్రతిష్ఠా[3] ప్రభావా! జితారాతిషడ్వర్గపంచేంద్రియా! సర్వభూతాత్మకా! సర్వలోకాశ్రయా! శ్రీహనూమంత !దేవా! నమస్తే! నమస్తే! నమః

చ. అని బహుభంగులన్ వినతుఁ – డై వినుతించినఁ గన్నుదమ్ములన్
ఘనకరుణామృతంబు దొఱు – గం దగఁ గన్గొని పాణిపల్లవం
బునఁ దను నంటఁ గాఁ దిగిచి – పొల్పెసలారఁగ గారవించి నీ
జనని హితోక్తి కిచ్చఁ గడు – సంతస మందితి నిన్నుఁ బ్రోచితిన్. 134

వ. అని ప్రియపురస్సరంబుగా సుభాషితంబుల సంభావితుం జేయ నత్తఱిఁ గారాగృహపాలకు లతిభయాతురు లై యంతఃపురంబునకుం జని. 135

సీ. ఇరుగెలంకుల దైత్య – తరుణీకదంబంబు
గొలువ గద్దియమీఁద – నలరు దాని
సలలితసత్కళా – సౌభాగ్యరేఖలఁ
బౌలోమి యొప్పులఁ – బరఁగుదాని

1. సుపర్వగంధర్వ – అనుసమాసము సాధువు. 2. ముద్రప్రకాశో – పూ.ము.
3. ప్రతిష్ఠ – పూ.ము. 4. భకాంభోధి – పూ.ము.

నవరత్నమయభూష - ణములకుఁ దనమూర్తి
భూషణం బై యుండఁ - బొలుచు దాని
మృదుపాణిపద్మంబు - మెఱుఁగుఁజెక్కిటఁ జేర్చి
తన భర్త సేమంబుఁ - దలఁచు దాని

తే.గీ. వృద్ధపుణ్యాంగనలు సెప్ప - వీను లలరఁ
గథలు వినుచున్న ధర్మ మా-ర్గంబుదానిఁ
గలితతన్వంగి మాతంగిఁ - గాంచి మ్రొక్కి
హస్తములు మోడ్చి కడుఁ గంపి - తాత్మ లగుచు. 136

క. అని లోపల మైరావణు
ననిలజుఁ డణఁగించి యతని - యల్లునిఁ గరుణన్
దనుజేశ్వరుఁగాఁ గావిం
చినకథ సకలంబుఁ దెలియఁ - జెప్పిరి వరుసన్. 137

క. చెప్పిన విని కడుభయమున
నప్పద్మదళాక్షి యులికి - యతిశోకముతోఁ
గప్పుకొని మూర్ఛచేఁ బడి
తెప్పిరి భువిఁ బిణికి పుణికి - ధృతి చెదరంగన్. 138

ఉ. అల్లన నాణిముత్తియము - లాకఁలిదీఱ మెసంగి మీలు దా
మొల్లక పాయఁగా నుమియ - నుర్విని రాలెడురీతిఁ గుప్పలై
ఝల్లనఁ గంటినీరు కుచ - శైలములం దురలంగ నేడ్చె ను
త్ఫుల్లసరోజనేత్రి తన - పూరుషు సారెకుఁ బేరువాడుచున్. 139

వ. ఇట్లు శోకించి శోకాంధకారంబు మిక్కుటం బగుటయు నచ్చటిదైత్యకాంతలు తోడుతం జనుదేర . 140

చ. సురుచిర మైన నెన్నడుము - స్రుక్కి వణంక ముఖేందుచంద్రికా
స్ఫురణ గరంబు వాడి నును - పొంకపుఁజన్గవ రాయఁ బెన్నెఱిం
దురిమిన పుష్పదామములు - దూలఁ బిఱుందు కరంబు భార మై
విరసము దోఁప లేచి పల - వింపుచు నల్లన నేగె నేడ్చుచున్. 141



సీ. వేఁడి?[1] పురందరు - వేయుమాఱులు దాఁక
నాజిఁ బోఁదరిమిన - యవఘళుండు?[2]
వేఁడి? [3]కృతాంతు ము - వ్వెట్టికింకరులతోఁ
బనిఁ గొన్న యసమాన - భవ్యయశుఁడు?
వేఁడి? [4]పయోఽ ధిపు - వినుతభూషణములు
గానుకఁ గొన్న శృం-గారమూర్తి?
వేఁడి? [5]కుబేరు దు - ర్విక్రమం బెడలించి
పురిఁ జూరవెట్టిన - భూరియశుఁడు?

తే.గీ. వేఁడి? గంధర్వభుజగేంద్ర - విబుధయక్ష
సిద్ధవిద్యాధరాసుర - స్త్రీకదంబ
సురుచిరస్ఫారమంగళ - సూత్రగాత్రి?
వేఁడి? జయశాలి? నాప్రాణ - విభుఁడు వేఁడి? 142

వ. అనుచు నరుగునంత. 143

సీ. తవిలి ప్రేవులు జన్ని - దంబులు గావించి
రమణఁ బాడెడు బ్రహ్మ - రాక్షసులును
బురియలు మస్తకం - బులు పేరులుగఁ జేసి
నృత్య మాడెడు భూత - నివహములును
గుత్తుకబంటిగా - నెత్తు రంతయుఁ ద్రావి
జోక లై తిరిగెడి - డాకినులను
బురియలుమాంసంబు - లరుగక యెఱఁగొని
యోకిలించెడునట్టి - శాకినిలును

తే.గీ. గుండియలు మ్రింగి దిగకున్న - గ్రుడ్లుమిడిచి
ధరణిఁ బొరలాడు పెనుముది - దయ్యములును

---

1. బురందరు
2. అవఘళుండు = వ్యాపకుఁడు. శ.ర. సమర్థుఁడు, సమర్థ శక్తిమంతుఁడు. సూ.ని. ఇదే ప్రయోగము.
3. గృతాంతు
4. బయోధిపు 5. గుబేరు - పూ.ము. సరళాదేశము చింత్యము.

ముదుసునంజుళ్లు ముచ్చట - మునుఁగ మెసఁగి
చొక్కి సుకియించు బలితంపు - రక్కసులును. 144

క. క్రొవ్విన నంజుటి పెక్కువ
దవ్వులఁగని పాఱునడవి - దయ్యపుగములన్
మవ్వపు మెదదున మత్తిలి
నవ్వెడు బేతాళములను - నక్కలు మెదలన్. 145

సీ. హరునిచే మడసిన - యంధకాసురునాఁడు
మెసఁగమే కదుపాఱ - మేదిరములు
పర్జన్యుచే నాజిఁ - బడిన వృత్రుని నాఁడు
ద్రావమే రక్తంబుఁ - దనివి దీర
హరిచేతఁ ద్రెళ్లిన - మురదానవుని నాఁడు
మ్రింగమే శవముల - మెచ్చు లొదవ
సేనాని చేతఁ జ-చ్చిన తారకుని నాఁడు
భక్షింపమే మాంస - పర్వతములు

తే.గీ. మనసు పుట్టిన నిటువంటి - మధుర మైన
లెస్సనంజుళ్లు చవిగొన - లేము గాక
యనుచు నానందమునఁ బొంగి - యనిలపుత్త్రు
సన్నుతులు సేయు ఘనపిశా-చములు గలిగి. 146

వ. మఱియు గరుడకేతనుహస్తాంబుజంబును బోలె శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గాది[1] దివ్యాయుధప్రకరంబై రత్నాకరంబునుంబోలె వీరదైతేయకిరీటకోటి నిర్మలమణిప్రభాభాసురం బై కాళరాత్రి సదనుంబోలె భూతభేతాళశాకినీడాకినీ కదంబనివాసం బై మహారణ్యంబునుంబోలె సింహశరభ శార్దూల గంధభేరుండ భల్లూక వరాహాదిసంకీర్ణం బై చంద్రశేఖరాలంకారంబునుంబోల భయంకరచర్మాస్థి[2] మస్తకానేక సంకలితం బై నిర్జరసుందరీనర్తనశాలయుంబోలెఁబటవపణవమృదంగ కాహళఘంటికానంతవిచిత్రబహురూపసమంచితంబై కందర్పకింశుకోద్యానంబునుంబోలె నసర్గళరక్తధారాప్రవాహస్ఫుట దారుణద్యుతిపటలమయం బై

1. శార్ఙ్గాది - పూ.ము.
2. చర్మాస్తి - పూ.ము.





కనకమహీధరంబునుం బోలె మహిత [1]సువర్ణభూషితసంజనితరజోరంజితం బై గనుంగొన నద్భుతం బై మరుత్తనయు ప్రతాపానలజ్వాలాభీలం బై యున్నయక్కలనిమధ్యంబునం బడి యున్న మైరావణుం గాంచి చేర నరిగి. 147

ఉ. హా దనుజేశ! హా జితము - రారితనూభరూప! హా ధను
ర్వేదసమగ్ర! హా సమద - విక్రమ! హా కులశైలగర్వభే
ద్యాదినిలింపగాథతిమి - రాంబుజబాంధవ! హా ప్రియేశ! నీ
కీదురవస్థఁ జావ లిఖి - యించెనె బ్రహ్మ లలాటపత్రికన్. 148

చ. అనుచుఁ గరంబుల న్నురము - నాననముం గడు మోదుకొంచు న
ద్దనుజవరేణ్యుమీఁదఁ బడి - తద్దయు మూర్ఛిలి యెట్టకేల క
ల్లన నొకయింత దెప్పిరి క-లంగుచు దేహము వట్టి చూచుచున్
గనుగవ బాష్పపూరములు - గాలువలై వడిఁ బాఱ నేడ్చుచున్. 149

సీ. సురభయంకర మైన - బిరుదందెఁ బొలుపొందు
పదములే యీవీడు - పడిన విచట
దిక్కరికుంభంబు - లెక్కి యాడెడునట్టి
యూరులే యీమాగి - యున్న విచట
నఖిలదానవకోట్ల - కభయంబు లిచ్చిన
కరము లే యీశూన్య - గతివి దల్ప
గౌరీశపదపద్మ - కమ్రభూషణ మైన
మకుట మే యీపాటి - దకట యనుచు

తే.గీ. గ్రుచ్చి యెగనెత్తి యల్లనఁ - గుచములందుఁ
గౌఁగిటను జేర్చి క్రమ్మరఁ - గలఁగ డించి
యవయము లెల్ల కన్నుల - నద్దికొనుచు
వద్ద శయనించుఁ గూర్చుండు - వ్రాలు సోలు. 150

ఉ. అక్కట ప్రాణనాథ! కడు - నారడిఁ బొందుచు నెల్లభంగులన్
ది క్కొకయింత లేనినను - దీమస మొప్పఁగఁ జూడ వేల నేఁ
డెక్కడ పోయె నీకరుణ - యేమిట కల్గితి వింత నాథ! నే
నెక్కడ చొత్తు నే తెరువు - [2]నేగతి గల్గు నెఱుంగఁ జెప్పవే! 151

1. సుపర్ణ - పూ.ము. 2. తెరువు యేగతి - పూ.ము. దుష్టసంధి.

చ. [1]శ్రుతినుతపాదపంకజుఁడు - శూరుఁడు విష్ణుఁడు రాఘవుండు నీ
కతనిని గెల్వ నేమిటికి - నప్పుడ చెప్పనె కాక వెండియుం
బతిహితశీలభూషణుఁ బ్ర-భంజనసూను నెదుర్పఁబోక యు
న్నతమతిఁ బోయి కాంచి శర-ణం బొగి వేఁడు మటంచుఁ జెప్పనే?

గీ. ఎంతసెప్పిన గర్వించి - యిచ్చగింప
వైతి తనమన్ని గొంటి వే - మనఁగ నేర్తు
ననుచు నప్పటి మూర్ఛిల్లు - నంతలోనఁ
దెలియు భ్రమనొందు శోకించుఁ - గలఁగుఁ గలఁగి. 153

క. తెక్కలి రావణబాంధవ
మెక్కడఁ దోడయ్యె నీకు - హృదయేశ్వర! నీ
వెక్కడికేగితి? వర్మిలి
నక్కడ కే వత్తుఁ గొంచు - నరుగవె కరుణన్. 154

వ. అనుచు నెలుంగెత్తి రాళ్లుగఱంగ నేడ్చునద్దానవురాలిం గనుంగొని యాంజనేయుండు దయారసభాషణంబులతో నీలమేఘునితో నిట్లనియె. మహాశోకార్ణవంబున మునుంగుచున్న యత్తలోదరి నూరడంబలికి మదాజ్ఞఁ జేసి వైరం బుడిగి దనుజేశ్వరునకుఁ బరలోకక్రియ లొనర్పు మనవుడు నతం డట్లకాక యని పోయి మాతంగిశోకంబు వారించి వైదికానుష్ఠానంబున మంత్రపూర్వకంబుగా నతనికి నగ్నిసంస్కారాది కృత్యంబు లాచరించి క్రమ్మఱ నేగుదెంచి హనుమంతునకు మ్రొక్కి ముకుళితహస్తుం డై నిలుచుటయు నప్పురంబునం గలదానవానీకంబులం బిలువంబంచి తన కుమారు మత్స్యవల్లభుం బిలిపించిన నతండు వచ్చి పొడగాంచి సాష్టాంగం బెఱఁగి నిలిచి ముకుళితకరకమలుం డై. 155

ఉ. దేవ! సమీరనందన! మ-దీయమనఃకమలార్కబింబ! య
ద్దేవనిశాచరాదులకుఁ - దేరి కనుంగొన రాని యట్టి మై
రావణుఁ జంపి దిక్కు లను - రాగమునొంద సమస్తలోకముల్
బ్రోవగఁ నీకె కాక తల - పోయఁగ నెవ్వరికైనఁ జెల్లునే. 156

1. శా. - పూ.ము





క. అనుచు ననేకవిధంబుల
వినుతించిన సంతసిల్లి - విమలోదకముల్
గనకకలశంబులందునఁ
దనరఁగఁ దెప్పించి దైత్య - తతి జయవెట్టన్. 157

క. మంచిమూహూర్తమునందు స
మంచితమతి నీలమేఘు - నభిషేకము సే
యించి జగంబులు దన్ను ను
తించఁగఁ బవమానసుతుఁడు - దేజం బెసఁగన్. 158

చ. [1]భువియును మిన్ను వారిధులు - భూధరపఙ్క్తులు దారకంబులున్
రవిహిమధామబింబములు - రాఘవుకీర్తి గలంతకాల ము
త్సవమున నొప్పి యిప్పురి ని-శాచరకోట్లకు నెల్ల రాజ వై
యవిరళనీతి నుండు మని - యర్మిలిఁ బట్టముఁగట్టె నెంతయున్. 159

వ. తదనంతరంబ. 160

చ. జనవర మత్స్యవల్లభుని - సత్కృపతో యువరాజ్యవైభవం
బున కభిషిక్తుఁ జేసి యొగి - పూర్వసురావళినెల్ల నీతిమైఁ
బనిగొని నీలమేఘునకు - బంధురకీర్తి ధనంబుఁ గూర్చి నీ
వనఘ! సుఖస్థితిం బ్రదుకు - మంచును బల్కెను గారవంబునన్. 161

క. చాలించు మింక మదివగ
లాలించుము పుణ్యచరిత - లనిశము జిహ్వన్
గీలించు సత్యవాక్యము
పాలించుము దైత్యవరులఁ - బ్రమదం బెసఁగన్. 162

క. చేరకు పాతివ్రత్యలఁ[2]
గోరకు పరధనము లెంత - కోపం బైనం
బోరకు విప్రులతోడను
నేరకు గలలోన నైన - నిష్ఠురభాషల్. 163

1. ఉ - పూ.ము
2. పతివ్రతాతతి -సాధువు

క. మనుపుము దీనజనావళి
మనుపుము బాంధవులఁ బ్రీతి - మఱి దానవులన్
దనుపుము పితృదైవంబుల
ననుపుము సత్కీర్తి దిశల - కరుగం బేర్మిన్. 164

వ. మఱియును. 165

చ. దురితఫణీంద్రగారుడము - దుర్భవనీరద మారుతంబు ని
ర్భరభయదోరురోగకుల - పర్వతవజ్రము గాఢశోక సా
గరబడబానలంబు రిపు - గంధగజాధిపసింహ ముగ్రత
స్కరతిమిరార్కబింబము జ-గన్నుత రాఘవనామ మారయన్. 166

ఉ. మంగళవైభవాలయము - మానితముక్తికురంగలోచనో
త్తుంగపయోధరప్రకట - దుర్గనిరర్గళ నేత్రభాసురా
లింగనసౌఖ్యకారణము - లేఖమహీజము భక్తకోటిహృ
త్సంగసువర్ణభూధరము[1] - సంగతిరాఘవనామమారయన్. 167

క. కావున రాఘవనామము
భావంబునఁ బదిలపఱిచి - బాంధవగురు దీ
నావలి దుర్దండిని మై
రావణసతి మనిచి మనుము - రాక్షసనాథా! 168

వ. అని జ్ఞానోపదేశంబుగాఁ బలికి సుగ్రీవాదు లెంతశోకంబునం గుందుచుండుదురో తడ వయ్యెం బోవలయు ననపుడు నీలమేఘమత్స్యవల్లభు లాదిగాఁగలయెల్లవారలు పునఃపునఃప్రణామంబులు సేసి జయవెట్టినం గరుణాకటాక్షుం డై యందఱు సుఖంబుండుండని వేఱువేఱ వీడుకొలిపి తదనంతరంబ వాయువేగంబునం గదలి తొలుత మిమ్ముం దాఁచినలతాగృహంబుఁ దరిసి దానికిఁ బ్రదక్షిణంబుగాఁ జొచ్చి యప్పేటికఁ దెఱచి మీయున్నచందంబుఁ జూచి యతికుతూహలంబునం బొంగి యప్పెట్టియ క్రమ్మఱ మూసి యెత్తుకొని యాగృహంబు వెడలి కదిలి. 169

క. శిరమున మూఁపునఁ బెట్టియ
ధరియించుచు నుబ్బి కణఁగి - దాఁటుచుఁ బదముల్

1. సుపర్ణభూధరము - పూ.ము.





[1]గరిమం బాడుచు నాడుచు
సరభసగతిఁ దెచ్చెఁ బ్లవగ - సైన్యముకడకున్. 170

ఉ. అంతటఁ బంకజాప్తకులుఁ - డాదిగ నెల్లకపీంద్రవర్గముల్
చింతఁ దొఱంగి చిత్తసర-సీరుహము ల్వికసింప రాక్షస
ధ్వాంతదివాకరుం బతిహి-తప్రసవర్తను వాయుసూను న
త్యంతముదంబునం బొదలు - నట్ల యెదుర్కొని సందడించుచున్ 171

క. కొందఱు కౌఁగిటఁ జేర్చిరి
కొందఱు నుతియించి రాత్మఁ - గూరిమి భక్తిం
గొందఱు వలగొని తిరిగిరి
కొందఱు ప్రణమిల్లి రమిత - కుతుకం బలరన్. 172

క. అటమీఁదఁ బుష్పవర్షము
పటుతరముగఁ గురిసె ధరణిఁ - బ్రబ్బుకొనంగాఁ
జటులత సురదుందుభులు
త్కట నినదం బలర దివిని - దద్దయు మ్రోసెన్ . 173

క. పాడిరి [2]తుంబురునారదు
లాడిరి యచ్చరలు విబుధు - లంబరవీథిం
గూడిరి గనుఁగొన దానవు
లోడిరి యింకనుచు మౌను - లుబ్బిరి యంతన్. 174

చ. అనిలసుతుండు పేటిక ర-యంబునఁ దొల్లిటిచోటఁ బ్రీతితో
నునిచి కవాట మూడ్చి కడు - నొప్పగ మీ సుఖనిద్ర గందకుం
డను వెడలించి యల్లన బె-డంగగుసెజ్జలఁ బెట్టి పాదముల్
గొనకొని యొత్తుచున్ నిదురఁ - గూరక మేల్కొని యుండె నంతటన్.

చ. కలువలు గుందఁ దామరలు - కౌతుకమందఁ జకోరవర్గముల్
చలమును బొంద జారజన - సంఘవిహారము పెంపు గుంద ది

1. గరిమెం - పూ.ము.
2. తుంబుర - పూ.ము. ఇది 'ఉకారాంతము' స్తోత్రం సంహర నారద! స్తుతికథాలాపై రలం తుంబురో! (హను-8-45) అని హనుమన్నాటకము.

క్కులు వెలుఁగొందఁ దస్కరులు - గుందఁ దమఃపటలంబు చింద వే
ల్పులు వొగడొంద భాస్కరుఁడు - పూర్వమహీధర మెక్కె నెంతయున్ 176

ఉ. అంతకు మున్న మేల్కని ర - యమ్మున మీ రొగిసాంధ్యకృత్యముల్
సంతసమొప్పఁ దీర్చి కపి - సైన్యము గొల్వ దశాస్యుఁ ద్రుంచి ని
శ్చింతను సీతఁ గొంచు వెసఁ - జెచ్చెర వచ్చితి రీచరిత్ర మా
వంతయుఁ బావనిం దెలుపఁ - దర్కసుతాదులు సెప్ప రేమియున్. 177

వ. అని యగస్త్యుండు సెప్పుట విని యుదంచితపులకాంకురుం డై యానందబాష్ప పూరంబులు ఱెప్పల నప్పళించుచు హనుమంతుం గనుంగొని చేరం బిలిచి గ్రుచ్చి కౌఁగిటం జేర్చి తొడలపైఁ గూర్చుండ నిడుకొని కరకమలంబులం గపోలంబులు పుడుకుచు నత్యాదరంబున సకలసభాసదులు విన నిట్లనియె. 178

ఉ. తామరసాసనాదులకుఁ - దప్పక కన్గొన రాని భీమసం
గ్రామములోన నక్కడిఁది - రాక్షసవర్గము నీఱుసేసి మ
న్నామము ప్రాణముం దగఁ బు-నర్భవమొందఁగ నుద్ధరించి తిం
కేమిటఁ దీరు నీఋణ[1] మ-హీనపరాక్రమ! వాయునందనా! 179

క. విను ప్రాణంబుల రీతిని
దనరుచు వర్తిల్లునట్టి - తమ్ములు నాకున్
మును మువ్వు రింతనుండియు
ననఘా! నీతోడ నల్వు - రైరి ధరిత్రిన్. 180

క. అని యప్పుడు ధరియించిన
యనుపమనవరత్న భూష - ణాదుల నెల్లం
బెనుపొందఁదొడిగి తద్దయుఁ
గొనియాడి యగస్త్యుఁజూచి - గురుమతిఁ బల్కెన్. 181

చ. పరహితశీలుఁ డైవెలయు - పావని చేసినప్రాణదాన మి
ట్లరుదుగ మీరు నాకుఁ దగ - నానతియీక యుపేక్షచేసినం
బరమమునీంద్ర! లోకములు - ప్రస్తుతిసేయఁగ నుండు ప్రోల్లస
త్తరణికులుండ నయ్యును గృ-తఘ్నుఁడు నా ధరనుండ వల్వదే. 182

1. నీరుణ - పూ.ము.



వ. కావున మునివరా! నీకతంబున హనుమంతుసచ్చరిత్రంబు సకలంబును వీనులపండువుగా వింటి నని యనేక భంగుల నుతియించి దీనికిఁ బ్రత్యుపకారంబు సేయ నేమిగల్గునో యని చింతించుచుండునయ్యవసరంబున మౌహూర్తికు లేగుదెంచి దేవా! మజ్జనభోజనంబు లవధరించుసమయం బయ్యె నని విన్నవించుటయు నయ్యింగితం బెఱింగి యయ్యగస్త్యుండు మొదలైన మహామునులందఱులేచి రాఘవసందర్శనంబునకుఁబునరాగమనంబు మాకుఁ గలుగవలయుఁ బోయివచ్చెద మని వేదమంత్రంబులనాశీర్వదించిన వారల దివ్యరత్న పుష్పంబులఁ బూజించి నమస్కరించి యనుపుటయుఁ దమతమ నిజాశ్రమంబులకుం జనిరి. అనంతరంబ సకలభూపాలసంఘంబుల బంధుమిత్రామాత్యభృత్యవర్గంబుల ననిపి కొలువు చాలించి యనుజవర్గంబులు గొల్వ హనుమంతుమూఁపునఁ గరకమలంబు లూఁదుకొని యంతఃపురంబున కరిగె నంత. 183

క. అనుజన్ముల వేర్వేఱను
ననిపి సుగంధోదకముల - నభిషేకుం డై[1]
ఘనవస్త్రభూషణావలు
లను వొప్పఁగఁ దాల్చి చంద - నాలంకృతుఁ డై. 184

[2]ఆ.వె. [3]కమ్మపూలు ముడిచి - కంజాప్తునకు నర్ఘ్య
మిచ్చి తల్లులెడకు - నేగి మ్రొక్కి
యాంజనేయు చరిత - మంతయు వినుపించె
నతులభక్తి భూమి - సుతయు వినఁగ. 185

క. వినుపించిన వా రనిలజుఁ
గనుఁగొని యతిభక్తి మ్రొక్కి - కడలేని కృపా
వననిధిఁ దేల్చుచు నిట ర
మ్మని చేరఁగఁ బిల్చి పలికి - రభిమత మెసఁగన్. 186

ఉ. పావని దీనికిం దగిన - ప్రత్యుపకారము నీకుఁ జేయ[4] మా
కీవును నర్కవంశమిపు - డెల్లను నిల్పితి వంచు దివ్యర

1. నభిషిక్తుండై - సాధువు
2. గీ. పూ.ము 3. కమ్మబూలు - పూ.ము
4. నీకు సేయు - పూ.ము.

త్నావలు లర్థి నిచ్చి ముద – మారఁగ దీవన లిచ్చి రంతటన్
రావణవైరి పల్కె నను – రాగ మెలర్పఁగఁ దల్లితోడుతన్. 187

చ. అనుజుఁడు మంత్రియున్ సుతుఁడు – నాప్తుఁడు భృత్యుఁడు ప్రాణబంధువున్
[1]నను భయదాసు రార్ణవము – నందు మునుంగక యుండఁ బ్రోచె నీ
యనిలసుతుండు నేను నితఁ – డాప్తులు మిక్కిలి హత్తి యుండఁ బొ
త్తున భుజియింపఁగావలయుఁ – దోరపుభక్తిని నీవు వెట్టఁగన్. 188

వ. అనవుడు నక్కౌసల్యయు నగుంగాకయని భోజనాగారంబులలోపల నుచితాసనంబులఁ గూర్చుండఁబెట్టి యయ్యిరువురమధ్యంబున. 189

చ. ఒసపరి యైనరాజనపు – టోగిరమున్ మిరియంపుఁగూరలుం
గసగస లానవాలుఁ గడు – గమ్మని నెయ్యిని బిండివంటలున్
రసములు బాయసంబు మధు – రంపుఫలంబులు నూరుఁగాయలుం
బసగల భక్తితోఁ బసిడి – పళ్లెరమందునఁ బెట్టె నెంతయున్. 190

వ. అప్పుడు రాఘవుం డాపోశనపూర్వకంబుగఁ బ్రాణాహుతులు గైకొని భుజియింపందొడంగుచు నాంజనేయునకుఁ బ్రహర్షంబుతో భుజియింప సెలవు వెట్టిన నతండత్యానందంబునుం బొంది యద్దివ్యప్రసాదపూరితం బగునప్పళ్లెరం బెత్తుకొని లేచి తన్నుం గనుంగొన్న వారి నేత్రంబుల కుత్సవంబు పుట్టించుచు వెల్వడి కపిసైన్యమధ్యంబునకుం బోయి శరణాగతరక్షామణిబిరుదాంకుండును దురితపరిహారవరదాభయహస్తుండును దుష్టనిగ్రహశిష్టప్రతిపాలకుండును సర్వజీవదయాపరుండును సర్వకాలాశ్రయుండును బ్రహ్మరుద్రాదిదేవతాస్తోత్ర పాత్రుండును వేదవేదాంతవేద్యుండును బురాణపురుషోత్తముండును నాదిమూలవిగ్రహుండును గారణజన్మావతారుండును గైవల్యదాయకుండును నైన శ్రీరామచంద్రుని దివ్యప్రసాదంబునకు రారో! యని పిల్చుటయు సుగ్రీ వాంగద సురేజ్య పనస నల నీల [2]జాంబవంత సుషేణ గుహ్యక గంధమాదన కేసరి జ్యోతిర్ముఖ గజగవయగవాక్ష పావకాక్ష ఘోరాక్ష వాలపాశ వేగదర్శి గ్రధన మహానాద సూర్యప్రభ ధూమ్రాక్ష జంభారి గిరిభేది ద్వివిద మైంద శరభ సన్నాహాది బాహాంతరితతరుచరసేనా సహస్రంబులుఁ గుతూహలంబులం బొదలి కదలి యమృతంబునకుం బొదివిన

1. దునుభయదాసురార్నవము. – పూ.ము. యతిభంగము
2. జాంబవత్సుషేణ – సాధువు.





బృందారక సందోహంబుచందంబున నొండొరుల గడువం బాఱుచు మూఁపు మూఁపునంద్రోయఁ బరివేష్టించి యొక్కఁడొక్కనిం ద్రొక్కుచు నిక్కుచుఁ గరకమలంబు లొగ్గినఁ గరువలిసుతుం డెంతయుఁ బ్రసాదంబుఁ బంచిపెట్టుచో నధిక సమ్మర్దం బగుటయు నతిదూరంబునం బొలుచు నగస్త్యవృక్షం బెక్కి వెండియుం బంచిపెట్టి కొందఱకుం జాలకున్నఁ బత్రంబులఁ దత్పాత్రంబునఁ దివిచి పంచి పెట్టునెడ. 191

చ. ఘనతరసత్కృపారసము – గన్నులఁ బిక్కటిలంగ నెంతయుం
దనరుచు లేఁతనవ్వు వద – నంబున వెన్నెలగాయఁ జారునూ
తనమణిభూషణావలుల – దట్టపుఁగాంతులు సందడింపఁ జ[1]
య్యనఁ జనుదెంచె రాఘవధ – రాధిపుఁ డక్కపిసేన లోనికిన్. 192

చ. పవనతనూజ! నీవలని – భక్తికి మెచ్చితి నిష్ట మేది యు
త్సవమున వేఁడు రమ్మనుచుఁ – జండ భయంకరపఙ్క్తికంధరా
ర్ణవబడ బానలం బగు క–రం బొగి నెత్తి కదల్చి పిల్చినన్
సవినయమొప్ప వచ్చి ధరఁ – జాగిలి మ్రొక్కి నుతించి యిట్లనున్. 193

ఉ. అచ్చరలేమ లెంతయు న – హర్నిశముం జనుదెంచి పాడఁగా
నచ్చపు మీకథామృతర – సాంబుధిలోపల నోలలాడుచుం
బొచ్చెము లేక మిమ్ముఁ దల – పోయుచు నుండఁగనిమ్ము నాకు మీ
సచ్చరితంబు ధాత్రిఁ గొన – సాఁగిన దాఁక వరంబు రాఘవా! 194

క. అనవుడు నిది యిచ్చితి నీ
కని గౌరవభాషణముల – ననయంబును నె
మ్మన మలరఁజేసి ప్రీతిని
ననుపమ మగు హార మిచ్చె – నతిముద మొదవన్. 195

వ. తదనంతరంబ కొలువు కూటంబున కేతెంచి రత్నసింహాసనాసీనుం డై తమ్ములం బిలిపించి యాంజనేయునకు ననేకప్రియపూర్వకంబుగా సంభావనంబులు సేసి యిట్లనియె. 196

చ. ఘనతరభీషణాబ్ధి నొక – కాలువకైవడిఁ గట్టి రావణున్
అనిమొనఁ బుత్త్రబంధుసచి – వాప్తయుతంబుగఁ జంపి జానకిం

1. సందడింప సయ్యన – పూ.ము.

గొని చనుదేర మీకతనఁ - గూర్చిన శూరతగల్గె నాకు నే
మని నుతియింతు మిమ్ము నన - ఘాత్ముల సత్పరమోపకారులన్. 197

ఉ. కావున లావుసేసితిరి - కార్యము గల్గినవేళఁ గ్రమ్మఱన్
వావిరి మమ్ము జూడఁజని - వత్తురుకాని కడింది మీరు మీ
తావుల కేగి యుండుఁడు బె - డంగగు సౌఖ్యత లొప్పుగాంచుచు
న్నావుడు వార లేగిరి ప్ర-ణామము లెంతయుఁ జేసి వేడుకన్. 198

ఆ.వె. అంత దివ్యభూష - ణావలు లర్థితోఁ
గడు విభీషణునకుఁ - గట్ట నిచ్చి
పిలువనంపినపుడు - ప్రీతి వత్తువు గాని
యనుచు ననుప మ్రొక్కి - యరిగె నతఁడు. 199

వ. అంత. 200

సీ. చతురంబునిధి మధ్య - జనపాలు రేతెంచి
చెప్పిన యుడిగంబు - సేయుచుండఁ
దలఁచినప్పుడె దేవ-తలు రయంబున వచ్చి
యీప్సితార్థము లర్థి - నిచ్చుచుండఁ
గైసేసి యప్సరో - గణములు సనుదెంచి
భూరివిద్యలఁ బ్రొద్దు - పుచ్చుచుండఁ
దుంబురు [1]నారదా - దులు సారెకును వచ్చి
గీతప్రబంధముల్ - గేరిపాడ

తే.గీ. నశ్వమేధాదికృత్యంబు - లలరఁ జేసి
బాలమరణంబు చోరశ-బ్దంబులైన
బాధ లొగిఁ బొందకుండఁగ - భవ్యకీర్తి
రాజ్య మొగిఁ జేయుచుండెను - రాఘవుండు. 201

ఉ. ఈ కథ నెవ్వరైన లిఖి - యించిన విన్నఁ బఠించిరేనియుం
బ్రాకటరాజ్యవైభవము - బంధుసమృద్ధియుఁ బుత్త్రలాభమున్

1. దుంబుర - పూ.ము.
తుంబర - వింధ్యపర్వతస్థే జాతిభేదే తుంబురు - గంధర్వ భేదే. అని వాచస్పత్యము. ఇది - అకారాంతమైనచో వింధ్యపర్వతము నందలి జాతి. ఉకారాంతమైనచో గంధర్వుఁడు.



భీకరచోరశత్రుఘన - బృందనివారణ మీప్సితార్థముం
జేకుఱు నెల్లసౌఖ్యములు - శ్రీహనుమంతు కృపారసంబునన్. 202

చ. సరసిజలోచనాకుసుమ - సాయకసన్నిభ! గోపకన్యకా
వరచరణాబ్జషట్పద!సు - వర్ణమహీధరధీర! వైరికుం
జరమృగనాథ! బంధుజన - సంఘదివౌకస! భూరిచంద్రపు
ష్కరహిమధామహారఘన - సారసుధామలకీర్తి భూషణా! 203

క. నారాయణపుణ్యకథా
పారాయణ! నీతిశాస్త్ర - పారీణ! లస
త్కారుణ్యనేత్ర! సుజనా
ధారా! లోకాభిరామ - ధర్మనిధానా! 204

మాలిని. అలఘుతరచరిత్రా! - యబ్బయామాత్యపుత్త్రా!
కలుషజనవిదూరా! - కామినీచిత్తచోరా!
విలసితగుణశీలా! - వేదశాస్త్రానుపాలా!
జలజహితసమానా! - సర్వవిద్యానిధానా! 205

## గద్యము

ఇది శ్రీభీమేశ్వరసత్కృపారసప్రసాదకవితాధురీణ సకలశాస్త్రప్రవీణ సుకవిజనమిత్ర సర్వయామాత్యపుత్త్ర మాదయనామధేయప్రణీతం బైన మైరావణ చరిత్రంబునందు సర్వమును దృతీయాశ్వాసము.

సంపూర్ణము.

---